# స్వయంసిద్ధ

మణీలాల్ వంద్యోపధ్యాయ

అనువాదం:

శ్రీ మద్దిపట్ల సూరి

ప్రకాశకులు

కె. ఎస్. ఆర్. అండ్ సన్స్,

(Formerly Known as Variety Agencies)

బిసెంట్ రోడ్, విజయవాడ-2.

# స్వయంసిద్ధ

చండప్రచండుడైన 'బాశులీ' జమీందారు హరినారాయణ గంగూలీ, ఆయుర్వేద వైద్యుడైన కరాలీ చటర్జీగారి కూతుర్ని - త్రాచులాంటి పిల్ల అయిన చండిని చూడటానికి వచ్చాడు - ఈ వార్త పొక్కగానే శ్యామాపురంలో పెద్ద అలజడి బయలుదేరింది. అంత అలజడికి కారణాలు కూడా లేకపోలేదు.

శ్యామాపురం సంపత్సమృద్ధమైన గ్రామం. అదంతా హరినారాయణబాబు ఏలుబడిలోని పరగణా. అతడు ఉత్త పేరుకి జమీందారు కాడు; ఇన్ని శాసనాలూ, ఇన్ని పౌరసత్వాలూ ఉన్న ఈ ఈరోజుల్లో కూడా ఆయన విషయమై ప్రజలు పెదవి కదల్చటానికి వీల్లేనంత ఉద్ధతుడు. అతడి కేదైనా తిక్క రేగినా, సంకల్పం కలిగినా ఇహ అతడి మనస్సు మరల్చటం మన తరం కాదు. హరినారాయణబాబు నోటినుండి వచ్చిన మాటకి హరిహరాదులు దిగివచ్చినా తిరుగులేదు. ఈ గంగూలీవంశ ప్రతిపత్తీ, ప్రాభవం, ఐశ్వర్యం అన్నీ మహారాజుల ఛాయాలోవి. ఈ ప్రాంతాల్లో పసివాళ్ల దగ్గర్నుంచి-పండు ముదుసలులవరకు ఎవరైనాసరే-ఆ జమీందారు పేరు చెపితే భయంతో గజగజలాడటమే కాదు, భక్తితో తల వంచుతారు.

కరాలీ చటర్జీ పిల్లలుగలవాడు. ఏ గచ్చాకో-పుచ్చాకో మాత్రలు కట్టియిస్తూ దానిమీద వచ్చే సంపాదనతో అతడు చాలామందిని పోషించాలి. సజ్జనుడు, స్వధర్మనిరతుడు, ఆడి తప్పనివాడూ అని పేరుప్రతిష్ఠ లున్నవాడు. కేవలం అతని ఒక్కడి సంపాదనతోనే సంసారం గడవాలి. దారిద్ర్యపిశాచం అతడి దరిదాపులకైనా రాకూడదు. అప్పు అన్న మచ్చ అతడి కంటకూడదు. అతడి సహధర్మచారిణి బహుదొడ్డ గృహిణి. సంసార నౌకకి చుక్కాని పట్టగల నేర్పుకలదే కాకుండా - అందులో ఉన్న సులువు - బలువులు ఆకళించుకున్న ఇల్లా లామె. అంచేత చటర్జీ సాంసారిక విషయాల్లో చాలా సుఖ వంతు డనటంలో విరోధులకి కూడా విప్రతిపత్తిలేదు.

ఈ సుఖ సంసారంలో ప్రస్తుతం గడ్డు సమస్యగా పరిణమించింది అతడి పెద్దకూతురు-పెళ్ళికాని పిల్ల చిరంజీవిని చండి...

ఎటొచ్చీ చండికి శ్యామాపురంతోనూ, తల్లితండ్రుల తోనూ సన్నిహిత సంబంధం ఏర్పడ్డం ఈమధ్యనుంచే. అంతకు మునుపు - అంటే చండి అయిదేళ్ల పిల్లగా ఉన్నప్పుడు ఆమె మాతామహుడు కూతుర్నీ అల్లుణ్ణీ చూసిపోదామని శ్యామా పురం వచ్చాడు. ఆయ నప్పుడు పంజాబ్‌లోని ఓ ప్రసిద్ధ విద్యాలయంలో వ్యాయామ శిక్షకుడుగా పనిచేస్తూ ఉండే వాడు. అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. మనుమరాలిని చూసి, ఆ కుర్రదాని తెలివితేటలకి ముచ్చటపడి, "ఇది నాకు చాలా నచ్చినపిల్ల. దీన్ని నేను నావెంట తీసుకువెళ్లి, పెంచి పెద్దదాన్నిచేసి, పది పన్నెండేళ్లుపోయాక మళ్లీ పంపిస్తాను.

అప్పుడు మీరు దీన్ని చూసి నిజంగా ఆశ్చర్యపోవాల్సిందే - నాతో పంపించు" అని అడిగాడు అల్లుణ్ణి.

మామగారి మాటను అల్లుడు మన్నించకుండా ఉండ లేకపోయాడు. చండిని అతడికి అప్పగించాడు. ఆ వ్యాయామ ప్రవీణుడు ఆ పిల్లను తనతో పంజాబ్ తీసుకెళ్ళి తన అభిరుచుల కనుగుణంగా ఆమెను అన్ని విద్యలలోనూ పరిపూర్ణురాలిని చెయ్యటానికి కొంత ప్రయాసపడ్డాడు.

వీరేంద్రనాథుడు కేవలం వ్యాయామ ప్రవీణుడైన వస్తాదే కాడు; బహుభాషా కోవిదుడుకూడా. అనేక దేశాల ప్రసిద్ధ రచయితల గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివినవాడు. హిందూధర్మ శాస్త్రాలన్నా, పురాణాలన్నా, సనాతన ధర్మ మన్నా చెవికోసుకొనేవాడు. చండికి చక్కని శిక్షణనిచ్చి, విద్యావంతురాలినిగా తయారు చేసినట్లే,ఆరోగ్యానికి సంబంధిం చిన విధినియమాలనుకూడా బోధించి, ఆమెని మంచి ఆరోగ్యవతినిగాకూడా చేశాడు. పంజాబ్ లోని నైసర్గికవాతా వరణమూ, వ్యాయామ ప్రవీణుని శిక్షానైపుణ్యమూ, పట్టు దలతోకూడిన శిష్యురాలి సాధనా అన్నీ సార్థకమయాయే కాని, ఏదీ వ్యర్థం కాలేదు.

ఇంతలో వీరేంద్రనాథు డిహలోకయాత్ర చాలించి హఠాత్తుగా పరలోకానికి వెళ్ళిపోయాడు. చండి కప్పటికి బాల్యావస్థ గడిచింది. ఆమె అవయవాలు యౌవనంతో విక సించసాగాయి. పరిపూర్ణమైన యౌవనం, సంపూర్ణమైన ఆరోగ్యం ఈ రెండింటి ఐక్యతతో ఆమె సౌందర్యం అనవద్య మైనదయింది...

తాతగారు పోగానే చండి తండ్రిదగ్గరికి–శ్యామాపురానికి – తిరిగి రావాల్సివచ్చింది. కాని ఇక్కడి వాతావరణం ఆమెకి పసితనంనుంచి అలవాటైన అభిరుచులకి అడుగడుగునా అవరోధాలు కల్పిస్తున్నట్లు తోచసాగింది. ఆమె ఆహార–విహారాలు, ఆచార వ్యవహారాలు, ఒకటేమిటి అన్నీ ఆమె యీడు ఆడపిల్లలందరికీ అతివింతగానూ, కొత్తగానూ కన్పించసాగాయి. తా నేలాంటి అదుపాజ్ఞల్లో పెరిగిందో – అలాగే ఇక్కడి ఆడపిల్లలంతా పెరిగినట్లయితే ఎంతో బావుండేదికదా అని అనుకునేది చండి. ఆమె అలాంటి అభిప్రాయాలు వెల్లడిచేస్తున్నప్పుడల్లా ఇక్కడి ఆడపిల్లలు పొట్టలు చెక్కలయ్యేటట్లు నవ్వేవాళ్లు ... "వ్యాయామం మగవాళ్లు చేస్తారు కాని, ఆడవాళ్ళెక్కడైనా వాళ్లలాగా కుస్తీలుపట్టీ, దండాలుతీసి, నెత్తిన బరువులెత్తుకుని గంతులేస్తారా ? ఛీ! ఛీ! ..." అనేవాళ్లు.

ఇలాంటి పరిస్థితుల్లో ఆ మాటమీద – ఆ మాటమీద ఎప్పుడైనా తగాదా వచ్చిందంటేమాత్రం ఇరుగుపొరుగు ఆడవాళ్లు ఎంత ఇరకాటంలో పడేవాళ్లో చెప్పటానికి వీల్లేదు. చండి నదురూ–బెదురూ లేకుండా–ఏదో మెలిక తిరుగుడు పెట్టి ఒక్కక్షణంలో వాళ్లని ఉక్కిరి బిక్కిరయేటట్లు చేసేది. తన యీడుపిల్లలనైనా, తనకంటె పెద్దవాళ్లనయినా, రెండుచేతుల్తో చులాగ్గా పైకిఎత్తేసి, వాళ్లని 'కుఁయో' మనిపించేది. పైగా నవ్వుతూ "నేనూ మీలాగా నోరు మెదపలేకపోయినా, మీకంటె సులువుగా చేతుల్ని మాత్రం కదపగలను. కనుక మీరు నాతో పేచీలు పెట్టుకున్నారంటే చెడ్డచిక్కు" అనేది.

చండితో ఎవరైనా స్నేహం చేసుకుందామని వచ్చినా, ఆమె మాటలతీరు వాళ్లని విస్తుపోయేటట్లు చేసి - దరికి చేరనిచ్చేదికాదు. సాధారణముగా పల్లెటి దిక్కున ఆడవాళ్లకి భయసంకోచాలు కలిగించేవన్నీ చండికి తృణప్రాయంగా కన్పించేవి. "నీకు భయమనేది లేదా ?" అని ఒక వేళఎవరైనా అడిగితే 'ఒంట్లో బలమనేది వుంటే-భయాలూ గియాలూ మన చాయలకి రమ్మన్నా రావు' అనేది.

ఇరుగుపొరుగున చండిని గురించి ఇహ ఎంత చర్చ బయలుదేరేదో చెప్పలేం. ముసలివాళ్ళు మూతులు విరుచు కుంటూ "చటర్జీ కూతుర్ని చివరికిట్లా తయారుచేశాడేమిటే ? ఇదెక్కడో గడేకారిలాగుంది. దీన్నెలా వదిలించుకుంటాడే మాయమ్మ !" అనుకునేవాళ్ళు.

నదురూ-బెదురూ లేని కూతురి ప్రవర్తన చివరికి తలి దండ్రుల మనసుల్లోకూడా కొంత భయాన్ని కలిగించింది. ఈడొచ్చిన పిల్ల, అందులోనూ రేపో-మాపో పరాయి ఇంటికి వెళ్లి కాపురం చెయ్యాల్సిన పిల్లకి ఇంత జంకూ-గొంకూ లేక పోవటమనేది మంచిదికాదు. చండి ఇక్కడికి వచ్చి ఇంకా ఏడాదయినా తిరగకమునుపే ఆమెను గురించిన వదంతులు ఊరంతా పాకిపోయాయి.

ఆమెను గురించి అపప్రచారం ఎంతైనా జరిగింది. కాని నిజానికి నైతికంగా ఆమెలో తప్పుపట్టాల్సిన అపరాధం లవ లేశమైనా కన్పించేదికాదు. యోగ్యుడైన గురువుదగ్గిర ఆమె విద్యాశిక్షణ, ఆరోగ్యరక్షణ మాత్రమే కాదు నేర్చుకున్నది - ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటంకూడా అలవరచుకుంది.

అయినా చండి ఇరుగుపొరుగువారి మెప్పును ఈషణ్మాత్రమైనా సంపాదించలేకపోయింది. ఆమె బాగా ఆచి-తూచి ఆలోచించి చేసిన పనిలోనే ఎదటివాళ్లు తప్పు పట్టటానికి ప్రయత్నించేవాళ్లు. నిరుపేదలైన వెనుకబడిన కులాల ఆడవాళ్లు కొందరు ఈ ప్రాంతాల్లో పండిన కూరగాయలు మొదలైనవి ఇంటింటికి తిరిగి అమ్ముకుంటూ ఉండేవాళ్లు. అదే వాళ్లకి జీవనాధారమైన వృత్తి. కాని ఇప్పుడు ఎక్కడినుంచో వచ్చిన హిందూస్థానీవాళ్లు పట్నాల్లో దిగుమతి అయ్యే విదేశీ కూరగాయల్ని వాటినీ బళ్లమీద తెచ్చి అమ్మటం మొదలెట్టారు. పాపం నిరాధారులైన ఈ దరిద్రుల నోటిముందు కూడు పడిపోయింది. ఆ పల్లీయులకీ విషయం తట్టినట్లేదు. వాళ్ళు ఇతర దేశాలనుంచి దిగుమతి అయ్యే నకిలీ సరుకును, చౌకపారు వస్తువుల్ని కొనటానికి అలవాటుపడి, ఈ పల్లెసీమని పండే పదార్థాలమీది మమకారాన్ని తేలిగ్గా త్రోసిపుచ్చుకున్నారు. దీన్ని చండి సహించలేకపోయింది. ఈ విషయంలో ఇతరుల సానుభూతి-సహకారం అపేక్షించకుండానే ఆ వ్యాపారస్తుల్ని ఏదో తికమకపెట్టి మళ్లీ ఈ పొలిమేరలో అడుగుపెట్టకుండా చేసింది. కాని ఇలా చేసినందుకు చండి ఆ చుట్టుపక్కల మరింత చెడ్డపేరు తెచ్చుకుంది.

పల్లెటూళ్లలో స్త్రీ విద్యాప్రచారానికై పాదిరీల సౌజన్యంవల్ల ఆ ఊళ్లోనూ ఒక మిషనరీ బాలికాపాఠశాల వెలిసింది. అభమూ శుభమూ తెలియని ఆడపిల్లలు ఆ స్కూల్లో చేరి, చదువుమాట యెలావున్నా క్రైస్తవ మతప్రచార గేయాలు కంఠస్థంచేస్తూ - హిందూ ధర్మాల్నీ - హిందూ దేవతల్నీ వికృతంగా వర్ణించే దురభ్యాసాలకు బాగా అలవాటుపడ్డారు.

కృష్ణకుమారి అనే ఒక యువతీలలామ కొత్తగా మతం పుచ్చుకొని, క్రీస్తుకుమారిగా మారి, ఈ విద్యాలయం భారం పైనవేసుకుని, ఈ ప్రాంతంలోని బాల బాలికల నందర్నీ అజ్ఞానాంధకారంలోనుంచి వెలుగులోకి తీసుకురావటానికై క్రిందా మీదా పడుతోంది. బాల బాబాలికల చదువు విషయమై ఆ పంతులమ్మ అంత శ్రద్ధవహించినా వహించకపోయినా, వాళ్లు చిరకాలంనుంచీకొలుస్తున్న దేవతల్ని గురించి, ధర్మాన్ని గురించి వాళ్ల లేతమనస్సుల్లో విషబీజాల్ని నాటటంలోమాత్రం ఆమె ప్రయత్నలోపమేమీ చెయ్యటంలేదు. ఈ చిరుత బాలికలు చిలక పలుకుల్లాగా నేర్చుకున్న ఆ గేయాలు పాడుతూంటే, వాటిలో హిందూమతాన్నిగురించి ఎంతో ఈసడింపు వ్యక్తమవుతూండేది. అయినా ఆ బాలికల సంరక్షకులు అదేమీ పట్టించుకోకుండా చిరునవ్వు నవ్వుకొని ఊరుకుంటూంటే, వాళ్ల దురభిమానాన్ని చండి సహించలేకపోయేది. "ఆ విద్యాలయానికి మీ పిల్లల్ని పంపకండి. వాళ్లమనస్సుల్లో నాటబడిన విషబీజాలకి విషఫలితాలు తప్ప సత్ఫలితాలెన్నటికీ కలగవు" అని చండి సంరక్షకులతో వాదించి మరీ చెపుతూ వుండేది.

కాని ఆమె మాట వినేదెవరు? పశ్చిమ దేశంలో ఎక్కడో అదుపాజ్ఞల్లేకుండా పెరిగిన ఓ సిగ్గు – శరం లేని పిల్ల వచ్చి, తానే మహా ఆదర్శం అయినట్లు ప్రతివిషయంలోనూ తగుదునమ్మా అని తలెత్తుకు నిలబడుతుందా! ఎలా సహించి వూరుకుంటారు! ఆ బాలికల సంరక్షకులు ఆమె వాదనకి విసుగెత్తి చివరకి కోపంతో "అక్కడికి పంపకపోతే మరింక ఏ స్కూలుందని పంపమంటావ్, ఏట్లో నడాన?" అంటూ కసున్నమనేవాళ్లు.

"అక్కడికి పంపించి వాళ్ళ బుర్రలు పాడుచేయటం కన్న ఇంట్లో కూర్చోబెట్టుకుని మామూలు పనీ - పాటలు నేర్పుకోవటం లక్షరెట్లు నయం" అనేది చండి నిర్భయంగా.

ఒక పొరుగు ముసలమ్మ మూతి విరుచుకుంటూ, "అయితే ఇహనేం? రాబోయే నీ మామగారిచేత ఈ ఊళ్ళో ఓ బడి పెట్టించు. నువ్వే ఉండొచ్చు పంతులమ్మగా" అని వెటకారం చేసేది.

తన ఉక్తులూ-యుక్తులూ ఇహనేం లాభంలేదని చండి గ్రహించింది. కాని ఇంతమంది బాలికల లేతహృదయాలూ, విషమయమై పోతున్నాయే! అని ఆమె మనస్సుకు పరితాపం కలగసాగింది. ఈ గ్రామాన్నంతనీ ఎలా ఈ అనాచారంనుంచి ఉద్ధరించటం? ఆమెకి ఉపాయమేమీ తోచలేదు. వాళ్లకి ఇందులోని కుత్సితమంతా తెలిసేట్లు చెప్పాలని ప్రయత్నించేది. కాని ఆడపిల్లలంతా ఈమె మాటలకి ముఖం చాటు చేసుకుని నవ్వుకుంటూ ఉండేవాళ్లు. చివరకి మళ్ళీ అంతా ఏకమై చండికి శివమెక్కేట్లు వెక్కిరింపుగా చూచి మరో గేయం పాడుతూ అల్లరిచేసేవాళ్ళు.

ఒకరోజున స్నానాల రేవులో ఇలాగే జరిగింది. చండి కూడా స్నానానికి వచ్చింది. అక్కడ చేరిన బాలికలంతా చెరువులోదిగి, చండిని మొహంమీద కొట్టినట్లుగా - ఆమెని ఏడ్పించాలని తాము బళ్ళో నేర్చుకున్న గేయాన్ని పాడటం మొదలుపెట్టారు. కాని ఒక్కక్షణంలో వాళ్ళ అల్లరంతా అణిగింది. చండి ఒక్కొక్క బాలికనే పట్టుకొని ఆ నీళ్ళలో ముంచుతూ లేవతీస్తూ ఊపిరాడకుండా చేసింది. పాపం, ఒక్కరు కూడా ఆరోజున ఆమె చేతుల్లోంచి తప్పించుకోలేకపోయారు.

ఆ బాలికల కిలాంటి శాస్తి చేసినందుకు ప్రతిఫలంగా వాళ్ళ తల్లిదండ్రులు చండిని గురించి ఎలాంటి వదంతులు ఊరంతా ప్రచారం చేశారో, వాటిని విని చండి మాత్రం నిర్లక్ష్యంగానే నవ్వి ఊరుకుంది; కాని ఆమె తలిదండ్రులు ఆ వదంతులు విని హడిలి బేజారెత్తిపోయారు. "ఇదిపల్లెటూరు. ఇక్కడ పదిమందితోనూ కలసి మెలసి అణకువగా వుండక తప్పదు. పంజాబులో చలామణీ అయిన నీ దురుసుతనం ఇక్కడ సాగదేమనుకున్నావో!" అని తల్లీ తండ్రీ ఘట్టిగా చెప్పారామెకి.

తల్లీ తండ్రీ వేసిన చీవాట్లని చండి తలవంచుకొని విన్నది. 'స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః' అని తాతగారు బోధించిన ఆర్యోక్తి వెంటనే జ్ఞాపకం వచ్చింది. బడాయికోసమని స్వధర్మాన్ని విడిచిపెట్టుకున్న వాళ్ళు-లేదా పరిస్థితులకి తలవొగ్గి తమధర్మాన్ని మంట కలుపుకున్న వాళ్లు ఇలాంటివాళ్లకేనా మనం భయపడవలసింది ? పసిపిల్లల మనసుల్లో విద్య నెపంతో విషాన్ని ఎక్కించి, వారి స్వధర్మాన్ని విశ్వాసాన్ని కూకటివేళ్ళతో పెల్లగించటానికి ప్రయత్నించే వాళ్లకి మరింత భయపడనక్కర్లేదూ ? పంజాబులో జరిగిన ఒక సంఘటన ఆమెకి గుర్తుకొచ్చింది. బాలికలకు చదువు చెప్పుతామనే మిషతో మిషనరీవాళ్లు ఒక పాఠశాలను స్థాపించబోతే అప్పుడక్కడెంతో కల్లోలం బయలుదేరింది. కాని ఇక్కడ ? ఈ విషయంలో ఇక్కడ ప్రతీకారానికి మార్గమూ లేదు. అసలా ప్రయత్నమూ లేదు. ఇక్కడెవరికీ అలాంటి ఊహకూడా ఉన్నట్లులేదు. ఆమెకళ్లు చెమ్మగిల్లాయి. దీర్ఘంగా నిట్టూర్చి, తాతగారిచ్చిన భగవద్గీతను తీసుకుని కూచుంది.

చండి ఎంతవరకు చదివిందీ అన్న సంగతి ఎవరికీ తెలియదు. ఒక పుష్కరంపాటు ఈమెని తనదగ్గర పెట్టుకుని ఆ తాతగారు - ఈ గారాబు మనుమరాలికి ఎలాంటి శిక్షణ ఇచ్చాడో అది తెలుసుకుందామనే ఆసక్తినయినా ఆమె తలిదండ్రులు ఎన్నడూ కనపరచలేదు. చండికూడా తన విద్యాప్రతిభ ఎంతటిదో ఎదుటివారు తెలుసుకునే అవకాశాన్ని ఎన్నడూ కలుగనివ్వలేదు. ఈ విషయంలో ప్రస్తుతం ఇంకేమీ మాట్లాడకుండా, తన దారిని వెళ్ళిపోయి, తన విద్యాపటిమను తరచుకోవటం మొదలెట్టింది. ఆమె అలా తన గదిలోపల గడియ వేసుకుని కంటికి నిద్రలేకుండా ఎన్నో రాత్రులు గడిపినదన్న సంగతికూడా ఎన్నాళ్ళో గుంభనగా ఉండలేదు. ఆ సంగతి ఎవరైనా అడిగినప్పుడు "భగవద్గీత చదువుకొంటున్నాను" అనేది సగర్వంగా.

గీత చదివినా ఆమె మనఃపరితాపం తీరలేదు. తర్వాత కొన్నాళ్ళకి ఆ విద్యాలయ వార్షికోత్సవం సభ జరిగిన సందర్భంలో ఓ అఘాయిత్యపు పనిచేసింది. దాంతో ఆమె ఎంత ఉద్దండురాలైందీ చుట్టుపక్కలఊళ్ళలోకూడా తెలిసిపోయింది.

ఆ సభకి చుట్టుపక్కల గ్రామాల స్త్రీలుకూడా ఆహ్వానింపబడ్డారు. తనకూఆహ్వానంరావటంతో చండికూడా వెళ్ళింది ఆ సభకి. సభా ప్రారంభంలో పంతులమ్మ మిస్ క్రీస్తుకుమారి హిందూ స్త్రీల కుసంస్కారాన్నిగురించి గొప్ప ఉపన్యాసం మొదలెట్టింది. కుసంస్కారాలమీద ప్రారంభమైన ఉపన్యాసం పోనుపోను హిందూదేవతల దూషణలోకి దిగింది. కుసంస్కారాలతో కుళ్ళిపోతున్న హిందువుల ఆరాధ్యదేవత అయిన

కాళికాదేవి ప్రసక్తి తీసుకొచ్చింది ముందు. నగ్నశరీరం, అసహ్యాకరమైన ఆకారం, రుధిరపానాసక్తి కలిగిన ఆ 'అసభ్య' దేవతమీాద ఆమె కోపంతో విరుచుకుపడింది. ఆ సభలో కాళికాదేవి భక్తురాండ్రు లేకపోలేదు. పల్లెటూళ్ల తగవు లాటల్లో ప్రసిద్ధికెక్కిన మహిళలూ ఆ సభకి చాలామంది వచ్చారు. గృహకల్లోలాల్లో, ఇరుగుపొరుగు పోట్లాటల్లో వాళ్ళ కెంత ప్రతిభయినా ఉండనీ-ఇలాంటి ప్రత్యేక సమావేశంలో తమకెంత అగౌరవకరమైన చర్చ బయలుదేరినా కూడా వస్తుతః దుర్నివార్యమైన వారి వాగ్ధాటికి అప్పుడు మాత్రం పక్షవాతం వచ్చినట్లయింది. వాళ్ళందరూ ఈ స్వధర్మనిందను, విభిన్నజాతి స్త్రీ తమ దేవత నుద్దేశించి చేస్తున్న అవమానాన్ని చెవులు రిక్కించుకు విని, దిగమ్రింగి ఊరుకున్నారు. కొంతమంది ఈ సదవకాశంలో చండి కేసి చూసి చాటుగా నవ్వుకునే కుతూహలాన్నికూడా నిగ్రహించుకోలేకపోయారు. అది తక్కినవారు కనిపెట్టకపోలేదు.

చండి యింక సహించలేకపోయింది. సభలోనివారంతా త్రుళ్ళిపడేటట్లు ఆమె చటుక్కున లేచి నిలబడి "నేను తమ వాదాన్ని ఖండించగలను-కాస్త ఆగండి" అన్నది తీవ్రంగా.

ఒక్కనిమిషం సభంతా నిశ్శబ్దమయింది. అక్కడ ఉన్న విద్యార్థినులు, ఇతర స్త్రీలు - అందరి చూపులూ ఒక్కసారి చండిమీాద పడ్డాయి. పౌడరు పులుముకున్న క్రీస్తుకుమారి ముఖం వివర్ణమయింది. ఆమె అతి కటువుగా "నువ్వా అసభ్య బాలికవు! నువ్వు నా 'స్పీచ్'కి అడ్డురావడానికి సాహసిస్తున్నావా ?" అన్నది.

చండి ఏమాత్రం తొణక్కుండా "అంకచ్ఛితంగా. తమరు మమ్మల్ని అందర్నీ ఇక్కడికి ఆహ్వానించి రప్పించి, చాలా అవమానం చేశారు. తమరు మాఅందర్నీ క్షమాపణ వేడుకుంటే బావుంటుంది" అన్నది.

ఇప్పటివరకూ ఈ క్రీస్తుకుమారిని ఇంతమాటనటానికి సాహసించిన వాళ్లెవరూ లేరు. ఈ స్త్రీలందరియెదుట - తన విద్యార్థినుల యెదుట తనకు జరిగిన ఇంతటి అవమానాన్ని ఆమె ఎలా దిగమింగి ఊరుకుంటుంది ? అసంభవం ! సభలో బయలుదేరిన గుసగుసలు ఆ పంతులమ్మను మరింత ఉద్రిక్త పరచాయి. ఆమెఆత్మగౌరవం కాపాడుకుందామనే తలంపుతో "నువ్వు నా ఎదుటికి వచ్చి నిలబడు" అని తర్జనితో నిర్దేశిస్తూ చండిని పిలిచింది.

ఆమె చెప్పినట్లు చండి నదురూ బెదురూ లేకుండా పంతులమ్మ టేబిల్ దగ్గరకి వచ్చి నిలబడేసరికి - అందరూ ఆశ్చర్యముతో గుడ్లప్పగించి చూడసాగారు. చండి మాత్రం నిర్వికారంగా అలాగేనిలబడి, కుతూహలం వెల్లివిరుస్తున్న చూపులతో ధుమధుమలాడుతున్న క్రీస్తుకుమారి ముఖంకేసి సమాధానాన్ని కోరింది.

పంతులమ్మ సహనం కోల్పోయింది. ఆమె ఇచ్చిన జవాబు అహంకారమూర్తిని అయిన ఆమెకి అనువైనదే. కాని దాంతో సభలో స్త్రీలంతా మాత్రం గజగజలాడిపోయారు. ఆమె టేబిల్ మీదికి వంగి, చండిని చాచి లెంపకాయకొట్టి, "నీ అసభ్యత కిదే సమాధానం" అన్నది.

ఆ మరుక్షణంలో జరిగిన సంఘటనతో అక్కడి వారంతా పడుతూ లేస్తూ ఇంటి ముఖం పట్టారు. దెబ్బ తగలటంతోటే చండి-ఒక చేత్తో ముందున్న టేబిల్‌ను వెనక్కి-వెల్లకిలా పడేసింది. దానితో ఆ టేబిల్ మీద వున్న అలారం గడియారం, సిరాబుడ్డి, బైబుల్ వాల్యూములు అన్నీ తల్లకిందులుగా పడిపోయాయి. క్రీస్తుకుమారి చేతుల్ని టేబుల్ మీద మోపి నుంచుని ఉంది. టేబుల్‌మీద పడేసరికి ఆమె వెనక్కి పడిపోకుండా తప్పించుకోలేక పోయింది. ధబేలున వెల్లకిలగా పడిపోయింది. 'అమ్మో!' అని ఆమె అరచిన అరుపు అందరికి విన్పించింది.

ప్రక్కనే వున్న ఆ పాఠశాల పరిచారిక చటుక్కున వచ్చి మిస్సమ్మను పట్టుకుంది. సభంతా చెల్లాచెదరైంది. ఎవరికివారు వెళ్లిపోదామనే తొందరలో ఉన్నా, ఈ ఆఖరి దృశ్యం పూర్తిగా చూసిపోదామనే ఆసక్తిమాత్రం అందరికీ ఉంది. పరిచారిక సహాయంతో పంతులమ్మ లేచి నిలబడగానే ఆమె వికృతరూపం చూసేసరికి - అంతభయంగా వున్న సమయంలోకూడా-అందరూ నవ్వకుండా వుండలేకపోయారు. ఆ టేబుల్‌మీది సిరాబుడ్డిలోని సిరా అంతా ఆ మిస్సమ్మ ముఖం నిండా, ఆమె కట్టుకున్న తెల్లచీరెనిండా ఒలికి, ఎలా ఉండాలో అలా ఉంది ఆమె.

సిరా తొణకటంతో అసలు రూపం చెరిగిపోయిన మిస్సమ్మ ముఖంకేసి చూసి, చండిఏమాత్రం తొణక్కుండా, "ఇది కాళీమాత చేసిన శాస్తి దొరసానమ్మా! ఆమె శక్తి తెలుసుకోలేక అనవసరంగా మీరామెను నిందించారు. దానికి

తగినట్లు ఆమె తన అదృశ్య హస్తాలతో మీ ముఖానికి ఈ కాళిమ పూసింది. ఇహముందైనా ఎప్పుడూ ఇలాంటి పనికి పూనుకోకండి'' అన్నది.

ఈ సంఘటన చిలవలు – పలవలతో చుట్టుపక్క గ్రామాల్లో పాకిపోయింది. చండి చేసిన ఈ అన్యాయ కృత్యాన్ని – 'దేశీయ యువతి అయిన చండి వేష, భాష, మతాల్లో ఆంగ్ల మానసపుత్రి అయిన పంతులమ్మతో వాదోప వాదాలు చెయ్యాలని వెళ్లి అఘాయిత్యం చేసింది. ఆమే దొంగచాటుగా టేబిల్ వెనక్కి ఎత్తేసి పంతులమ్మకి శాస్తి చేసింది.' అన్నంతవరకూ అందరూ ఒకేరకంగా చెప్పుకునే వాళ్లు. ఇది జరిగాక–చండి భవిష్యత్పరిణామం ఎలా ఉంటుందీ అనేదిఊళ్లో అందరికీ అతిముఖ్యవిషయమైపోయింది. ఈవిషయం చర్చించుకోవటం అందరికీ అవసరమైన పనిగా పరిణమించింది. ఆయుర్వేదాచార్యులుగారు ఈ అమ్మాయిని ఎలా వదిలించు కుంటాడు? ఇంత త్రాచులాంటి పిల్లను ఎవరు చేసుకోటానికి సిద్ధపడతారు? ఒకవేళ ఏ అయ్యచేతులోనో ఓ అయ్యచేతులో పెట్టినామాత్రం–అత్తవారింటి కెళ్లాక ఇంత 'అదరగండంపిల్ల' ఈ పిల్లేం సంసారం చేస్తుంది! వూళ్ళో ఆడవాళ్ళు ఎక్కడ ఏ ఇద్దరు కలుసుకున్నా చండినిగురించే ఇలా ఏదోఒకటి తర్కించు కుంటూ ఉండేవాళ్ళు. ఇలాంటి పరిస్థితుల్లో 'బాశులీ జమీం దారు హరినారాయణబాబు చండినిచూడటానికివచ్చా'డన్న వార్త తలవని తలంపుగా ఊరంతా పాకిపోయేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. ఆయనకి ఒకవేళ పిల్ల నచ్చిందంటే ఆ యింటికి పెద్దకోడలుకూడా అవుతుంది. కనుక అసలు చండిని ఎవరైనా చేసుకుంటారా? దానికేమైనా కన్నెచెర విముక్తి

అంటూ ఉందా అని తర్జన భర్జనలతో కిందుమీదవుతున్న వారికీవార్త ఊహాతీతంగా కన్పించింది. ఈ ఆశ్చర్యకరమైన వార్త వాళ్లు మామూలుగా ఒక పట్టాన విశ్వసించలేరు. అంచేత ఈయన రావటంలో ఇంకేం నిగూఢమైన ఆంతర్యం ఉందో అని వాళ్ళు మరింత కళవళ పడటంలో అసహజం ఏముంది !

చండి ప్రకృతి ఎంత అపూర్వమైనదో, ఆమెని కోడల్నిగా తన యింటికి తీసుకుపోదామని వచ్చిన జమీందారుగారి ప్రకృతి కూడా అలాంటిదే. ఆయన తాను వస్తున్నట్లు ముందుగా కబురేమీ చెయ్యకుండానే - సామాన్య కుటుంబీకుడైన చటర్జీగారింటికి వధువును చూడటానికి వచ్చాడు. ఈ సంగతి ఏమాత్రం దాగలేదు. ఊరంతా గుప్‌మంది ఈ జమీందారుగారి నివాసం శ్యామాపురానికి ఇంచుమించు ఇరవై మైళ్ల దూరం. హరినారాయణ జమీందారుగారి పేరు ఈ ఊరివారికి తారక మంత్రంలాంటిదే అయినా, చర్మచక్షువులతో ఆయన్నింతకు ముందు ఈ ఊళ్లో ఎవరూ చూసి ఎరుగరు. ఇంత సుప్రసిద్ధుడైన జమీందారుని చూసేందుకు చటర్జీగారింటిచుట్టూ జనం చాలామంది మూగారు. రాజవైద్యుడైన చటర్జీ - రాజతుల్యుడైన జమీందారుని బయట వసారాలో కూచోపెట్టి ఆయన ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నట్లు చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"తమ దగ్గిర ఇంకా పెళ్లికాని యీడొచ్చిన పిల్ల ఉన్నదని విన్నాను. ఆ పిల్లను చూచిపోదామనే వచ్చాను నేను.

నాకు నచ్చితే మా అబ్బాయిల్లో ఎవరికో ఒకరికి చేసుకుంటాను'' అన్నాడు హరినారాయణబాబు.

జమీందారు ఇలా అనేసరికి ఆ రాజవైద్యుడికి గొంతు పట్టుకున్నట్లయి, మాట పెగిలి రాలేదు. గ్రుడ్లు రెండూ అప్పగించి ఏదో మహాపరాధం చేసినవాడిలా చూస్తూ నిలబడ్డాడు.

హరినారాయణగారి ఒత్తరి మీసంలోంచి, అతడి పెదవులమీది కువ్వోత్తుగా వచ్చిన చిరునవ్వు స్పష్టంగా కన్పిస్తోంది.

''తమరు నామాట కాదనరని తెలుసునాకు. అయినా ఒక్క విషయం మాత్రం మరచిపోవద్దు చటర్జీగారూ! హరినారాయణ గంగూలీ అనవసరపు మాటలు మాట్లాడేవాడు కాడు. అసలలాంటి అనవసరమూ లేదతడికి. నేను ఎలాంటి పిల్లకోసమని వెతుకుతున్నానో, మీ అమ్మాయిని గురించి ఏమేమి విన్నానో, ఆ రెండూ ఒకరకంగా కొంతవరకు ఏకంకావటం వల్ల మీ అమ్మాయి నా మనస్సులో ఒక స్థానాన్ని ఆక్రమించుకుంది. ఇప్పుడిహ చూపులకుకూడా నచ్చిందీ అంటే, ఆమె మాయింట్లోకూడా స్థానాన్ని పొందగలుగుతుంది.''

కొంప మునిగిందే! తనకూతురు దుందుడుకు తనమంతా హరినారాయణగారి చెవినికూడా పడిందా యేం? ఆవదంతులన్నీ వినికూడా, నచ్చితే ఆమెని కోడల్నిగా తీసుకెళ్ళాలని చూడటానికి వచ్చాడా? చటర్జీ ఆశ్చర్యంతో మెల్లిగా ఇలా అన్నాడు—''ఈ పేదవాడి కూతురు సంగతి ప్రభువుల చెవిదాకాకూడా......''

ప్రభువులవారి ముఖంలోని చిరునవ్వు పెద్దనవ్వుగా మారింది. కొంచెం పరిహాస ధోరణిలోకి దిగా డాయన.

నప్పుతూ చటర్జీమాటకి అడ్డువచ్చి, "ఈ పరగణాలోని యావన్మంది సంగతులూ ప్రభువుగారి హృత్కవిలిలో వ్రాసిపెట్టి ఉంటాయని మీకు తెలియదనుకుంటాను. ఈ సంగతి ఆడపిల్లల విషయాలకికూడా వర్తించకుండాపోదు. ఎందుచేతంటే తన యింట్లో అనురూపుడైన కుర్రవాడు-వరుడు-ఉన్నప్పుడు యోగ్యురాలైన మరొక యింటి ఆడపిల్ల అవసరం వుండక మానదుగా! అయినా మీ అమ్మాయి మొన్న మొన్నటి దాకా పంజాబ్‌లో ఎక్కడో వుండటంవల్ల ఆమెనుగురించి కొంచెం ఆలస్యంగా తెలిసింది. నిజానికి అసలు ఈ తెలియటం కూడా ఆమెకి ప్రతికూలంగా వచ్చిన ఫిర్యాదువల్లనే తెలిసింది!" అన్నాడు.

ఇది అంతకన్న మరీ ఆశ్చర్యం! ఫిర్యాదా! చండిని గురించి ఏదో ఫిర్యాదు జమిందారుగారి దగ్గరకొస్తే - అందు కోసమని!... జమీందారుగారే ఈ చిక్కు సమస్యను తేల్చి పారేశారు. "మీ హితాభిలాషియైన ఎవరో మీ యిరుగు పొరుగు వ్యక్తే అయివుంటాడు; మీ అమ్మాయిని గురించి, ఆమెకు విరుద్ధంగా ఒక ఫిర్యాదు వ్రాసి పంపాడు. ఆమెమీద నేరారోపణచేస్తూ అందులో ఏమేంసంగతులు వ్రాశాడో, వాటిని చూసి నేనూ తెల్లబోయాను. పల్లెటూళ్ళో ఇలాంటి ఆడపిల్ల ఉంటుందనేది అసలు నా ఊహాకి అందలేదు. ఆ ఫిర్యాదు పంపినవ్యక్తి అందులో తన పేరు వ్రాసుకోటానికి సాహసించలేకపోయాడు. అంచేత ఆవ్యక్తి ఎవరో తెలియక ఈ ఊళ్ళో ఉండే మాప్రతినిధికి - మీ అమ్మాయిని గురించి సరియైన వృత్తాంతం అంతా భోగట్టాచేసి వ్రాసిపంపమని

ఉత్తరం ద్వారా తెలియపరచాను. తర్వాత ఆ ఫిర్యాదులోని విషయాలన్నీ తల్లకిందులుగా మారాయని మాత్రం మీకు చెప్పగలను. మీ అమ్మాయిలోని దోషాలుగా ఏ సంగతు లయితే ఉదహరించారో, వాటి నన్నిటినీ గుణాలుగా భావించాను నేను. అందుకనే ఆమెని చూడటానికని వచ్చాను. వెళ్ళండి, మీరింక ఆలస్యం చెయ్యకండి, మీ అమ్మాయిని ఇక్కడికి తీసుకురండి, ఎక్కువసేపు ఇక్కడ కనిపెట్టుకు కూచునే తీరిక లేదు నాకు.''

ఆ రవంత వ్యవధానంలో చండిని వీలైనంతవరకు అలంకరించి తీసుకురావటానికి ప్రయత్నించారు. బయట వైపున ఉన్న హాలూ - వసారాలకి, లోపల యింటికీ మధ్య కొంత ఖాళీజాగా ఉంది. చటర్జీ లోపలికి కబురు చెయ్యగానే ఆ అతిథి మహనీయుని గౌరవవార్థమై చండి చక్కగా అలంకరించుకుని, పరిచారికతో అప్పుడే బయట హాల్లోకివచ్చి అడుగుపెట్టింది. ఇంతలో దైవికంగా ఒక సంఘటన జరిగింది.

ఆ ప్రాంగణంలో చటర్జీగారి ఆవు కట్టేసివుంది. దాని ప్రక్కనే కట్టేసివున్న లేగదూడ గంతులేస్తూ కట్టుతాడు లాక్కుంటోంది. ఒక కుర్రవాడు ఆ దూడచెవులు రెండూ పట్టుకుని దాన్ని అటూయిటూ గుంజటం మొదలెట్టాడు. ఇంతలో ఆవు పలుపు తెంచుకుని, కొమ్ములు విసురుతూ ఆ ఆకుర్రవాణ్ణి పొడవబోయింది. అక్కడ కూచున్నవారంతా ఏంచేయ్యటానికీ తోచక బిత్తరపోసాగారు. చండి చటుక్కున పైటకొంగు నడుముకు బిగించి, ఆ కుర్రవాడి కడ్డంగావచ్చి నిలబడి ఆ ఆవు కొమ్ములిన్ని రెండుచేతుల్తోనూ గట్టిగా

పట్టుకుని, బలంగా వెనక్కి తోసేసింది. అంతబలిష్టమైన గోమాత ఇహ ఒక్కడుగుకూడా ముందుకు వెయ్యలేక పోయింది. ఇంతలో వారి పాలేరువచ్చి, ఆవును తోలుకెళ్ళి మామూలుచోట కట్టేశాడు. చండి ఒక్కతోపు తొయ్యటంతో ఆ ఆవు పొగరంతా అణిగిపోయిందన్న సంగతి మాత్రం అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది.

చండి అక్కడినుంచి మళ్ళీ హాల్లోకి వచ్చి, అందరికన్న ముందు తండ్రికి నమస్కరించి, తర్వాత జంకూగొంకూ లేకుండా తమ పరగణాకంతటికీ ప్రభువయిన హరినారాయణ బాబుకి నతశిరస్కయై నమస్కరించింది. ఆతడిప్పటిదాకా విస్తుపోతూ చండికేసే చూస్తూ కూచున్నాడు. చండి తన పాదాలకి నమస్కరించగానే, ఆప్యాయంగా తన చేతులతో ఆమెని లేవనెత్తి ఆమెచేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని "చేతులు నొప్పియెక్కలేదుకదా?" అని అడిగాడు.

చండి తలవంచుకుని చిరునవ్వు నవ్వుతూ "ఊహూఁ" అన్నది.

అంతా నిశ్శబ్దం. ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. అందరి చూపులూ హరినారాయణమీద, చండిమీదనే ఉన్నాయి. గంగూలీబాబు అయిదు నిమిషాలు ఆమె హస్తరేఖలన్నీ పూర్తిగా పరిశీలించాక "నువ్వే జయించావు తల్లీ! నువ్వు చండివిగానే రావాలి మాయింటికి" అన్నాడు.

తర్వాత చటర్జీకేసి చూస్తూ "సంశయ మనస్కుడ నయ్యే మీ అమ్మాయిని చూడటానికి వచ్చాను. చెవులతో వినటం, కళ్ళతో చూడటం—ఈ రెంటికీ చాలా వ్యత్యాసం

ఉంది. ఈమె ఇక్కడ అడుగు పెడుతూనే నాసంశయాన్ని మొదలంట తీర్చేసింది. తనపేరును సార్థకంచేసుకుంది. నేను చూడటం అయిపోయింది. ఇంక నేను చెప్పవలసిందికూడా ఏమీలేదు. మీ కేదయినా అడగవలసింది ఉంటే అడగండి అన్నాడు.

"ప్రభువుల యెదుట మాకింక అడగవలసిం దేముంటుంది? తమ ఆజ్ఞ ప్రకారం పిల్లని తమ సన్నిధికి తీసుకొచ్చి నిలబెట్టాను. ఇహ అన్నిటికీ తమ చిత్తం, మాభాగ్యం..."

"నేను వచ్చి మీ అమ్మాయిని ఎలా పరీక్షించి తెలుసుకున్నానో, అలాగే మీరుకూడా వచ్చి మీ జమీందారు బిడ్డని చూచుకోవటం మంచిదనుకుంటాను"

"అదేమీ అవసరంలేదు ప్రభూ! తమరు దయాహృదయులై మా అమ్మాయిని చూడటానికి వచ్చారు, నచ్చిందని సెలవిచ్చారు. అలాంటప్పుడు ఇంక నేనేం యెదురు చెప్పతాను?"

"అయితే ఇహ పంచాంగం తెప్పించండి: లగ్నం పెట్టిద్దాం" అని జమీందారుగారి ముఖతః ఆజ్ఞ వచ్చింది.

పంచాంగం అక్కడే ద్వారబంధంమీద ఉంది. అది ఆయన చేతులోకి రావటానికి ఎంతో సేపు పట్టలేదు. అందరూ అయన పంచాంగం చూసే భంగిమనే చూస్తున్నారు ముహూర్తం ఎప్పుడు నిర్ణయిస్తారో తెలుసుకుందామనే అందరికీ ఉబలాటంగా ఉంది.

కొద్దినిమిషాల్లోనే ముహూర్తం నిర్ణయించి జమీందారుగారు అక్కడున్న వారందరికీ ఆనందంతో తెలియ

చేశారు. "ఫాల్గుణ శుద్ధ త్రయోదశీ బుధవారం. చాలా బాగుంది ఆ ముహూర్తం. ఆ ముహూర్తానికే మీరు ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకోండి బావగారూ!" అన్నాడు.

బావగారు! తలవనితలంపుగా వచ్చిన ఈ సంబోధన చెవులకింపుగానే ఉంది. కాని ముహూర్తం నిర్ణయించిన తిథి చెవిని పడేసరికి చటర్జీమనస్సుకి కొంచెం గుంజాటన ఏర్పడింది. ఇంత అవ్యవధానంగా ఆడపిల్ల పెళ్ళి ప్రయత్నాలు పూర్తి చేసుకోవటం ఎలా? అతడు కొంచెం చిన్నపుచ్చుకుని, చేతులు జోడించి, తడబడుతున్న కంఠంతో తన గుంజాటన బయటపెట్టాడు. "ప్రభువుల మాటకు మళ్ళీ బదులుచెప్పటం దుస్సాహసమే అనుకోండి. అయినా పరిస్థితినిబట్టి విన్నవించుకోక తప్పనిసరవుతోంది. వచ్చే త్రయోదశి అంటే ఘట్టిగా పదిహేను రోజులుకూడా వ్యవధి ఉన్నట్లు లేదు—"

జమీందారు ఈ నివేదనంతా పూర్తిగా వినకుండానే మధ్యలో అడ్డువచ్చి "ఇది ఏమంత తక్కువ వ్యవధి చటర్జీ గారూ! అవసరం వచ్చిందంటే మనం రాత్రికి రాత్రి చెరువులు త్రవ్వించగలం, గుళ్ళుకట్టించగలం, తోటలువేయించగలం... మీకు తెలియనిదేముంది? హరినారాయణ గంగూలీ నోటి వెంట మాట వచ్చిందంటే ఇహ దానికి తిరుగు ఉండటానికి వీల్లేదు. ఆముహూర్తమే ఖాయం" అన్నాడు.

ఇంక ఆయన మాటకి ఎదురు చెప్పటానికెవరూ సాహసించలేక పోయారు. తర్వాత అలా అన్న జమీందారే చండీ వైపుకి తిరిగి "నిన్ను ఊరికే చూసిపోదామనే ఉద్దేశ్యంతోనే వచ్చాను తల్లీ! ఇవాళ ఉత్తమాటలతోనే 'ఆశీర్వాద లాంచ

నం' జరిపి వెళ్లిపోతున్నాను. అయినా నీతో చెప్పకుండా ఉండలేక పోతున్నాను. ప్రధానంనాకు నీకు నేను ఇవ్వవలసిన బహుమతి నీ యిష్టమైనది నువ్వు కోరుకున్నట్లయితే, అది నా శక్తికి మించనిదై ఉండి, దాన్ని నీ నోటిమీదుగా అడిగితే చాలా సంతోషిస్తాను నేను" అన్నాడు.

అక్కడున్న వారందరికీ మళ్ళీ అమితాశ్చర్యం వేసింది. చండి ఏంకావాలని కోరుతుంది? ఆమె ఏమి కోరుతుందో వినాలని అందరూ చెవులు రిక్కించుకు కూచున్నారు.

చండి ఏమీ తడబడకుండా సహజమైన కంఠంతోనే తన కోరికను తెలియచేసింది. "అలా సెలవిస్తున్నారు కనుక తమరు మా ఊళ్ళో ఒక చక్కని విద్యాలయాన్ని స్థాపించండి. వివాహమయిన మర్నాడు నేనా నూతన విద్యాలయానికి ప్రారంభోత్సవము చేసి, తమ యింట 'గృహప్రవేశం' చేస్తాను. ఇంతకుమించి నా ప్రార్థన ఏమీలేదు".

అక్కడున్న వారంతా నిర్ఘాంతపోయారు! హరినారాయణబాబుకూడా అప్పటివరకూ జంకూ-గొంకూ లేని చండి ముఖంకేసి విస్తుపోయి చూస్తున్నాడు. మరుక్షణంలో ఆయనే ఆ నిశ్శబ్దతకు భంగం కలిగిస్తూ "ఆశ్చర్యం! నే నిప్పటివరకు అనేకమంది ప్రార్థనలు వినివున్నాను. కాని నాముందు ఎవరూ బెత్తం ఝుళిపించినట్లు ఇలాంటి కోరికను ఇంత ధీమాగా కోరలేదు. గంగూలీ వంశానికి ఆదర్శప్రాయురాలైన వధువులాగా నువ్వు నీ కాబోయే మామగారి వితరణ గర్వాన్ని ఈకోరికతో అణచగలిగావు. నువ్వుకోరటం-ఆ కోరినదాన్ని

నేను ఇవ్వటం - ఈ రెండింటి సార్థకత ఎలా పరిణమిస్తుందా అన్నదే ఇప్పుడిహ సమస్య అమ్మాయీ!'' అన్నాడు.

హరినారాయణబాబు చూసివెళ్ళాక - చండిలోపలికి రాగానే - ఇరుగుపొరుగువాళ్ళూ- ఇంట్లోదాసీలూ పదిమందీ ఆమెని చుట్టేశారు. ఎవరికళ్లలో చూచినా ఆశ్చర్యమే! ఎవరి ముఖాల్లో చూసినా ఆశ్చర్యమే! మహిషాసురమర్దనిలా ఏదో అసాధ్యకృత్యాన్ని సాధించి విజయపతాక ధరించి వచ్చినట్లుంది చండి వాళ్ళ దృష్టికి. "అంత గొప్పవాడాయన. ఆయన ముందు అంత నిర్భయంగా అన్నిమాటలు ఎలా మాట్లాడ గలిగావే?'' అందరినోటా ఇదే ప్రశ్న.

వాళ్ళు తనని చూసి ఇంత ఆశ్చర్యపోతున్నా - చండి ఆకృతిలోగాని, ఆచరణలోకాని వీసమంతైనా మార్పు కన్పించలేదు. ఆమె ఇంతకుముందు ఎంత నిస్సంకోచంగా వీధివైపు హాల్లోకి వెళ్లిందో మళ్ళీ అంత నిస్సంకోచంగానే లోపలికి వచ్చింది. అందరి ముఖాల్లోనూ, అందరి మాటల్లోనూ ఆశ్చర్యం వ్యక్తమవుతూండేసరికి, ఇంతకుముందు జరిగిన సంఘటనకి వీరంతా నిశ్చేష్టులై ఉంటారని గ్రహించింది. ఆమె కొంచెం పరిహాసంగా నవ్వుతూ "నే నేమంత ఎక్కువగా మాట్లాడాను? కాదా అంటే కాస్త జలగమీద సున్నం చల్లి వచ్చాను. అంతేగా!'' అన్నది.

అందరూ నిశ్చేష్టులై చండికేసి వింతగా చూడసాగారు. ఈ చటర్జీగారి కుటుంబానికీ - అదే వీధిలోని మైత్రా

గారి కుటుంబానికీ చాలా స్నేహం. చండి తల్లి మైత్రాగారి భార్యని 'వదినా' అని పిలుస్తూ ఉంటుంది. దాన్నిబట్టి చండికి కూడా ఆమెని అత్తా అని పిలవటం అలవాటయింది. "విన్నారర్రా పిల్లదాని మాటలు!" అంటూ ఆమె వీరందరి విస్తుపాటుకీ భంగం కలిగించింది.

చండి ముఖంలోని చిరునవ్వు మాయమైంది. కొంచెం అభిమానపడుతూ "ఎందుకని అత్తా? నేనేం అన్యాయం చేశానో చెప్పు. 'నేను మాటంటే దానికిహ తిరుగుండటానికి వీల్లేదు' అని ఆయనే అన్నారుగా, నాన్నముఖంమీద! అవసరమైతే రాత్రికిరాత్రి చెరువులు త్రవ్వించేవారు, గుళ్ళూ గోపురాలూ కట్టించేవారాయె! ఏదో దయతలచి ఈ వివాహానికి రెండువారాలైనా గడువిచ్చారు... అందుకనే నేను వారికి అసలైన జవాబు చెప్పాను" అన్నది.

"జవాబంటే జవాబా? ఇంటిల్లిపాదీ నీమాటలు విని ఆశ్చర్యపోవటంకాదు, మూర్ఛపోయారనుకో... మగవాడు, పైకి ఏమన్నా అనకపోయినా మనస్సులో ఏమనుకున్నాడో ఎవరికి తెలుసు?" అన్నది మైత్రా గృహిణి.

"ఆయనంత తెల్లబోయీ ఉండరు. మనస్సులో ఏమీ అనుకునీ ఉండరు. ఇహ నాసంగతంటారూ! 'ఇది వట్టి సిగ్గుమాలిన పిల్ల' అని వారు అనుకోటానికి నేనైనా అనుచితమైనకోర్కె ఏమీకోరలేదు."

"ఈకోరిక కోరి నువ్వు మాత్రం మహాబాముకున్నదేమిటేపిల్లా? ముసిలాడు ఊరికే రెండక్షింతలగింజలు నెత్తినేసి

అవ్వనమపించుకుని వెళ్లాడు కాని, చేతులో చిన్న మెత్తు బంగారమైనా పెట్టి వెళ్లాడా ? ఊళ్లో బడి పెట్టిస్తే నీ కోరిక లన్నీ తీరేదేమిటి ? నీకు జరిగేదేమిటే మహా ?"

చండి ఈ మాటకి జవాబేమీ చెప్పకుండా నవ్వి ఊరు కుంది. కాని ఆనవ్వులోని అసలు రహస్యాన్ని ఆమె తల్లి బయటపెట్టింది. ఆమెకూడా నవ్వుతూనే "మాట వచ్చిం దంటే ఇది అన్నం నీళ్ళుకూడా మరచిపోతుంది వదినా ! దీని కిక్కడికి వచ్చినప్పటినుంచీ ఆ మిషనరీవాళ్ళ బడి అంటే ఎంత కోపమో, ఆ మిస్సమ్మని అప్పుడెన్ని తిప్పలు పెట్టిందో మీకు తెలుసుగా! ఊళ్ళోఆడపిల్లలంతా ఆస్కూలుకి వెళ్లటం మొదలెట్టి, తమ దేముళ్ళని తలచుకోవటం మరచిపోయి - ఏసుక్రీస్తు కథలు చదవటం అలవాటు పడ్డారని దాని కొకటే దిగులు. ఈ దిగులు తీరటానికి అది ఎంతమంది దేముళ్ళకి ప్రాణాచారాలు పడమన్నా పడుతుందనుకుంటూ - ఏదో భగ వంతుడే దాని మనసులో వెతను ఈ విధంగా తీర్చదలచు కున్నా డనుకుంటున్నా. దీని పెంకితనం, పట్టుదల చూసి, నే నెంత దిగులు పెట్టుకున్నాననుకున్నావ్ వదినా ! దాని పట్టు వదిలించటం ఎవరితరం ? ఈ తీరు దిది ఎవరింట్లో పోయి పడుతుందో అని తలంపుకు వచ్చినకొద్దీ నా కెంతో ఆందోళన పుట్టుకొచ్చేది. అన్నం - నీళ్ళా సయించేవి కావు. ఏదో మీఅందరి ఆశీర్వాదంవల్ల తల్లి సర్వమంగళ దాని అభిమానాన్ని ఈ విధంగా కాపాడింది" అన్నది.

"నీ కూతురు ఎంత పెడసరం పిల్లయినా కానీ, దాని నోరు ఎంత మంచిది కాకపోనీ, అది అసలు రాణి అయే అదృ

ష్టంతోనే పుట్టిందన్న సంగతి అందరూ ఒప్పుకు తీరాల్సిందే అనుకో! లేకపోతే చుట్టుపక్కల పద్దెనిమిది గ్రామాలకీ-అసలీ ప్రాంతానికంతటికి ప్రభువుల్లాంటి వారయిన బాబులీజమీందార్ల యింటికి నీ కూతురు కోడలుగా, వెళ్ళకలిగిందేనా చెప్పు?'' అన్నది. మైత్రాభార్య గంభీరంగా.

మర్నాడు తెలతెలవారు తూండగా ఊరంతా సందడిగా ఉన్నట్లుండటంతో, ఇళ్లల్లోని వాళ్ళంతా వీధి గుమ్మాల్లోకివచ్చి విస్తుబోయి చూస్తూ నిలబడ్డారు. ఊళ్ళో రచ్చబండ ప్రాంతాల్లో ఏదో తిరుణాళ్ళలా ఉంది. ఎడ్లు, బళ్లు, కూలీలు- ఎంతోమంది జనంపోగయినా రక్కడ. అంతా ఒకటే కోలాహలం. అప్పుడే ఒకవైపు నుంచి ఇటిక గోడలు కట్టడం ప్రారంభ మయింది. ఇంజనీరు తాపీ మేస్త్రీలు, లెక్కలేనంతమంది కూలీలు నిశ్శబ్దంగా నియమపద్ధతిని చకచకా ఎవరిపనులు వారు చేసుకుపోతున్నారు. నిన్నటిదాకా మైదానంలా ఉన్న ఆ ప్రదేశమంతా ఇప్పుడు ఇటికలతో, ఇసుకతో, సున్నంతో నిండిపోయింది. మరికొంతమంది ఉద్యోగులు పైన అజమాయిషీ చేస్తున్నారు.

చండి హరినారాయణబాబుని అర్థించటం, ఆయన అలాగేనని వాగ్దానం చెయ్యటం — ఈ సంగతంతా క్రితం రోజునే ఊరంతా ప్రాకిపోయింది. అంచేత ఇదంతా కాబోయే కోడలు కోరిన అసంభవమైన కోర్కెను, సంభవమని నిరూపించేందుకు బాబులీ జమీందారు తలపెట్టిన కార్యకలాపం-అని ఊళ్లోవాళ్లు వెంటనే గ్రహించారు. ఎక్కడ చూసినా ఈప్రస్తావనే! ఎవరింట్లో చూసినా చండిని గురించీ, చండ

ప్రచండుడయిన బాగులీ జమీందారుగారి ఈ బ్రహ్మాండ మైన ప్రయత్నాలను గురించీ చిత్రవిచిత్రమైన కథలుగా చెప్పుకునేవాళ్ళే.

ఎర్రచీర కట్టుకున్న సంజెపడతి అప్పుడప్పుడే పడమటి కొండమీదనుంచి క్రిందికి దిగింది. దీపకాంతులు ఇళ్ళలోని చీకట్లను దూరందూరంగా తరిమివేస్తున్నాయి. సరిగ్గా యిదే సమయంలో చటర్జీగారి దేవిడీముందు రెండుగుర్రాల బగ్గీ ఒకటి వచ్చి ఆగింది. తలగుడ్డ ధరించిన పంజాబీ కోచ్‌మన్ చటుక్కున దిగివచ్చి బగ్గీతలుపులు తెరవగానే చండికి కాబోయే మామగారు హరినారాయణబాబు ముందు, ఆయన వెనుక లెదర్‌బాగ్ చేతపుచ్చుకొని వారి దివాన్ రాధానాథ బాగులీ దిగారు. అతడు కూడా ఆజానుబాహువూ – హరి నారాయణబాబు లాగానే వయసు చెల్లినవాడూ.

కరాలీ చటర్జీ బయట వసారాలో కూచుని, ఆత్మీ యులతోనూ, తమ పురోహితుడితోనూ ఈ వివాహ విష యమే సంప్రదిస్తున్నాడు. బండివచ్చి వాకిలిముందు ఆగిన ధ్వని అందరూ విన్నారు. అతడు నౌకర్ని ఉద్దేశించి "ఎవ్రా వచ్చింది?" అని అడిగాడు.

ఆ సమయంలో నౌకర్లెవరూ అక్కడలేరు. "మేమే వచ్చింది బావగారూ! అనుకోకుండా హఠాత్తుగానేవచ్చాం" అని హరినారాయణబాబే అతని ప్రశ్నకు సమాధానం యిస్తూ వివాహం జరగబోయేసావడిలోకి వచ్చాడు.

చాపలమీద కూచుని ఉన్న వాళ్ళందరూ కంగారుగా లేచి నిలబడ్డారు. ఈ సమయంలో హరినారాయణబాబు

వస్తాడనేది వాళ్లు ఊహించనేలేరు. తనకు కలిగిన అపరిమితాశ్చర్యాన్ని కొంతవరకు తమాయించుకొని, చేతులు జోడించి, "చిత్తం, చిత్తం, దయచేయండి. దయచేయండి. ఒరేయ్! ఎవర్రా అక్కడ? చప్పున కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు తీసుకురండిరా." అని చటర్జీగారు లోపలికి కేకేశారు.

హరినారాయణబాబు అతడి మాటలకు అడ్డువచ్చి, "ఆగండాగండి, మీరేమీ హడావిడి పడకండి. అవేమీ అవసరం లేదిప్పుడు. అమ్మాయి చండి విద్యామందిరం నిర్మించాలని ఆజ్ఞాపించి, ఈ ముసలివాణ్ణి ఎంత ఇరకాటంలో పెట్టిందీ తెలుసుగా మీకు! ఆ అజమాయిషీ పని మీదనే వచ్చాను అసలు. ఈ సదవకాశంలో మళ్లీ మాతల్లిని మరో సారి చూసి పోదామనే ఉత్కంఠకొద్దీ ఇక్కడికి వచ్చాను" అన్నాడు.

పురోహితుడు ముందుకు వచ్చి, "చూడక పోవట మేమిటి? తప్పకుండా చూసివెళ్ళండి. కాని వచ్చినవారెటూ రానేవచ్చారు కనుక కాసేపు కూచోక తప్పదు. రవంత ఫలాహారం అదీ—"

హరినారాయణబాబు మళ్ళీ నవ్వుతూ "ఇప్పుడా ప్రమేయమంతా తలపెట్టొద్దు భట్టాచార్యులుగారూ! ఎందుకిప్పుడు? అనవసరం. మేము ఇలా హఠాత్తుగా అమ్మాయిని చూడాలనే సంకల్పంతోనే ఈ రావటం. అమ్మాయి ఇప్పుడేంచేస్తోంది బావగారూ?" అని అడిగాడు,

"ఈ వేళప్పుడు రోజూ పూజాగృహంలోనే ఉంటూ ఉంటుంది. హారతి ఇవ్వటం ముగించి ధ్యానక్లో కాలు పఠిస్తూ ఉంటుందనుకుంటాను బహుశా" అన్నాడు కరాలీ చటర్జీ.

హరినారాయణబాబు ఉల్లాసంతో "యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ" అన్నారు. పెద్దలు. అయితే ఇప్పుడు చండి ఇంకా యథాస్థానంలోనే ఉండి ఉంటుందన్న మాట! మమ్మల్ని ఇద్దర్నీ ఆ పూజాగృహం దగ్గరకి తీసుకెళ్లండి బావగారూ! ఆమె తాలూకు ఒకవిధమైన రూపురేఖల్ని నిన్న చూశాను. ఇవాళ మరొక రూపాన్ని కూడా చూసి ధన్యుణ్ణి అవుతాను. మీకేం అభ్యంతరం లేదుగా!" అన్నాడు.

కరాలీబాబు సవినయంగా "తమరలా సెలవియ్యకండి ప్రభూ! ఇదంతా కేవలం మా మహాభాగ్యం! అయితే ఇంతకీ కొంచెంసేపు కూచునేటంత సావకాశం లేదంటారా తమకి?" అని అడిగాడు.

హరినారాయణబాబు ఇదివరకు లాగానే మళ్లీ – నా మాటకి తిరుగనేది ఉండటానికి వీల్లేదు బావగారూ! మరో మాట. మేము ఇలాగే హఠాత్తుగా అమ్మాయి ఉన్నచోటికి వెళ్లి, ఆమెను విస్తుబోయేట్లు చేయాలి. మేము వచ్చినట్లు ముందుగా ఆమెకి కబురు పంపవద్దు. ఈ ముసలివాళ్లిద్దరూ మీ వెనకాలే లోపలికి వస్తున్నందుకు మీరేమీ తప్పుగా యెంచవద్దు. ఎంచేతంటే మేము కాళ్లుకూడా కడుక్కోకుండా సరాసరి పూజాగృహం దగ్గరకే వస్తున్నామంటే–అది కేవలం మా చండిని చూసిపోదామనే ఉత్కంఠతోనే..." అన్నాడు.

ఈ ప్రాంతానికంతకీ రత్నంలాంటివాడీయన వంశ గౌరవంలో, అభిమానంలో, ఐశ్వర్యంలో, ధైర్యసాహసాల్లో—ప్రతి విషయంలోనూ ముందు ఈ జమీందారుగారి పేరుచెప్పి, తర్వాత ఇంకొకరి పేరు చెప్పాల్సిందే. అంచేతనే ఆయన సద్గుణాలతోపాటు - ఆయన తాలూకు కొన్ని తిక్క లక్షణాలు కూడా జనసామాన్యానికందరికీ తెలుసు. ఆయన పెదవుల మీదనుంచి వచ్చిన మాటకి అటు ప్రొద్దు ఇటు పొడిచినా తిరుగులేదు. ఆయన మనస్సులో ఏపని చెయ్యాలని అనుకున్నా ఫలానాపని నేను చేస్తానని ఎవరికైనా మాటఇచ్చినా ఇహ అది పూర్తిచేసేటంతవరకు ఊరుకోడు. కనుక ఇలాంటి జమీందారుగారికి తలవని తలంపుగా కలిగిన కోర్కెను తీర్చటానికి కరాళీబాబు కంగారు పడ్డాడంటే ఆశ్చర్య మేముంది ? సహజమే అది !

నడిమి వాకిలి దాటగానే కుడివైపున తూర్పు పడమరలుగా ఉన్నదొక ఇల్లు. అందులోనే ఒకవైపున పూజాగృహం ఉంది. అక్కడ ఎత్తయిన వేదికమీద ఓ కలశం పెట్టిఉంది. ఆ కలశంముందు ఇత్తడి పీటమీద సాలిగ్రామాలూ, గోడని వివిధ దేవతల చిత్తరువులూ, కలశానికి సరిగ్గా వెనుక పెద్ద కాళీ చిత్తరువు, వేదికముందు రాగి గంగచెంబులూ, పూల సెజ్జ, శంఖం, ఘంట మొదలైనవన్నీ అమర్చబడి ఉన్నాయి. రెండుప్రక్కలా ఇత్తడి స్తంభములమీద దీపాలు వెలుగుతున్నాయి. ఆ చిరువెల్తురులో పూజామందిరం సౌందర్యం స్పష్టంగా భాసిస్తోంది. ఆమందిరమంతా ధూపదీపాల సుగంధంతో ఘుమాయిస్తోంది. చండిచిత్రాసనంమీద పద్మాసనం

వేసుకున్నాచుని, భావోద్దీపితమైన దృష్టిని దేవి చిత్తరువుమీద నిలిపి మృదుమధురంగా దేవీ స్తోత్రాన్ని పఠిస్తోంది—

'—జయా మమాగ్రతఃపాతు విజయాపాతు పృష్ఠతః
నారాయణీ శీర్ష దేశే సర్వాంగే సింహవాహినీ
శివదూతీ ఉగ్రచండా ప్రత్యంగే పరమేశ్వరీ,
విశాలాక్షీ మహామాయా కౌమారీ శఙ్ఖినీ శివా
చక్రిణీ జయదాత్రీచ రణమత్తా రణప్రియా
దుర్గా జయన్తీ కాళీచ భద్రకాళీ మహోదరీ
నారసింహీచ వారాహీ సిద్ధిదాంత్రీ సుఖప్రదా
భయంకరీ మహారౌద్రీ మహాభయ వినాశనీ...' '

చండి తన్మయురాలై ఇలా స్తోత్రం చేస్తోంది. తన వెనుక కొందరు వ్యక్తులు వచ్చినిలబడ్డారన్న సంగతి ఆమె గమనించనే లేదు. స్తోత్రం పూర్తిచేసి నత శిరస్కయై ఆమె దేవికి నమస్కరించగానే "ఇందుకే నేను ఇలా హఠాత్తుగా పూజా గృహానికి వచ్చింది బావగారూ! ఇలా వచ్చాను కనుక అమ్మాయిలోని ఈ వినూత్న రూపాన్ని చూడ గలిగాను" అన్నాడు హరినారాయణబాబు.

చండి తలయెత్తిచూస్తూనే చకితమై, ముందు తండ్రికి తర్వాత తన తండ్రి యీడువారైన ఆ ఇద్దరు పెద్దలకి పాదాభి వందనం చేసింది. ఆమె పైకి ఏమీ మాట్లాడలేదు. కాని ఆమె ముఖంలో నిరుపమానమైన జ్యోతి భాసిస్తోంది.

హరినారాయణబాబు ఎంతో సంతుష్టుడై అన్నాడు - "అమ్మాయి ఈ వయస్సులోనే ఇంత తేజస్సును ఎలా పొంద

గలిగిందో ఇప్పుడు తెలుసుకున్నాను బావగారూ! మొన్న బాహ్య సౌందర్యాన్నే చూసి ముగ్ధుణ్ణయ్యాను. ఇవాళ ఈమె హృదయంలో భాసిస్తున్న ఈ దివ్యజ్యోతి కేవలం కళ్ళకే కాకుండా మనస్సుకు కూడా నిండుగా కన్పిస్తోంది. ఏమంటావ్ బాపూలీ? నువ్వేమీ మాట్లాడవేం?''

దివాన్ రాధానాథ బాపూలీ ఇప్పటి వరకూ విముగ్ధుడిలా చండికేసే చూస్తూ నుంచున్నాడు. ప్రభువుగారి ప్రశ్నతో అతడి పరధ్యానం వదిలింది. అతడేమీ తొణకకుండానే "అసలు మీరు అమ్మాయిని చూసిరాగానే చెప్పారుగా నాతో! మీకుమీరై ఎవర్నీ అంతలా ప్రశంసించగా నేనెప్పుడూ వినలేదు. మనిషి మొహం చూడగానే వాళ్ళ ఆంతర్యం ఎలాంటిదయిందీ చెప్పేసెయ్యగలనన్న అపఖ్యాతి ఒకటుంది నాకు. ఆ నిధానంతోనే అమ్మాయి స్వభావం ఎలాంటిదై ఉంటుందా అని ఆలోచిస్తున్నాను ఇందాకట్నుంచీ'' అన్నాడు.

''గుర్తించావా? ఇంకా ఓ నిశ్చయానికి రాలేదా?''

''నా నిశ్చయం అయిపోయింది''

''మాటలతీరు ఎలాంటిదో వినకుండానే?''

''మేలిమి బంగారాన్ని చూడగానే తెలుసుకోవచ్చు. గీటురాయిమీద ఒరిపిడి పెట్టాల్సిన పనిలేదండీ!''

హరినారాయణబాబు పూజాగృహం ప్రతిధ్వనించేటట్లు నవ్వుతూ "అయితే నేనేమీ మోసపోలేదంటావన్న మాట?'' అని అడిగాడు.

"ఇంతవరకు బాపులీ హరినారాయణ గంగూలీగారు ఎన్నడూ ఎవరిచేతిలోనూ మోసపోలేదు" అని ఆయన ప్రశ్న ఇంకా పూర్తికాక మునుపే సమాధానం చెప్పేశాడు.

ఒక్క నిమిషంలో హరినారాయణగారి అందమైన ముఖం నల్లబడిపోయింది. ఆయన దివానుకేసి కోరచూపులు చూస్తూ "నువ్వేదో మెరమెచ్చులకి అన్నమాటలా ఉందిది బాపూలీ! నిజం చెప్పు ఎప్పుడూ నేనే జయిస్తూ వచ్చానంటావా? అయితే మరి ఆత్మీయులదగ్గిర మోసపోయి ఇరకాటాన పడటం, అన్నమాట నిలబెట్టుకోవాలని హడావిడిగా పరుగెత్తుకు రావటం - ఇదంతా ఒకరకంగా మోసపోవటం కాదంటావా బాపూలీ?" అని అడిగాడు.

దివాన్‌జీ ఏమాత్రం తెల్లబోకుండా "అందులో మీరు మోసపోయిందేమీలేదు. ఈ విషయమై మీతో ఇదివరకు నేనెప్పుడూ తర్కించలేదు, ఇక ముందుకూడా తర్కించను. అయినా జగన్మాత మీ ప్రతిష్ఠ నిలబెడుతుంది అనటానికి ఇదేసూచన" అన్నాడు.

ఈ వృద్ధులిద్దరి సంభాషణా, తన తండ్రితోపాటు చండి కూడా తెల్లబోయి వింటూ ఊరుకుంది. ఏదో నిగూఢ విషయంలా వుంది; బోధపడేటట్లు లేదు.

హరినారాయణ బాబు మళ్ళీ అక్కడున్న వారంతా ఉలిక్కిపడేటంత బిగ్గరగా నవ్వుతూ "ఆ మాటమీద ఆ మాటమీద మా సంసారిక విషయాలేవో వచ్చాయి. దివాన్‌జీ ఆ విషయం ఇప్పుడు నిష్కర్షగా తేల్చి చెప్పేశారు. ఆ ప్రసక్తి అంతటితో వదిలేసి, ఇహ ప్రస్తుత విషయమే

మాటాడుతాను.........ఆఁ మొన్న నిన్ను ఒక్కనే చూసి వెళ్ళటం అయిందమ్మాయీ! ఈ వృద్ధుడు ఉత్త పిసినారిలా ఉన్నాడు-ఉత్త చేతులతో వచ్చి నచ్చిందని లగ్నంకూడా పెట్టుకు వెళ్ళాడు - అని బహుశా నీమనస్సుకి కష్టంతోచి ఉంటుందను కుంటాను. అవునా అమ్మా! అన్నాడు. చండి తల పైకెత్తి "అదేమిటి! నా కసలు ఆ ఆలోచనే రాలేదు. నేను అనుకున్నది మీ రూహించినదానికి పూర్తిగా విరుద్ధం బాబా" అన్నది నిస్సంకోచంగా.

ఈ 'బాబా' అన్న సంబోధన జమీందారుగారి హృదయాన్ని చటుక్కున కదిలించింది. అతడా దౌర్బల్యాన్ని అణచుకుని "ఏమనుకున్నావమ్మా?" అని అడిగాడు.

"అసలు లగ్ననిశ్చయం, మీరు చేసుకు వెళ్ళినంత ఉదాత్తంగా ఈ ప్రాంతాల్లోనేకాదు-ఈ దేశంలోనే ఎవరూ చేసుకు వెళ్ళలేదనుకున్నాను."

గంగూలీ బాపూలీ ముఖంకేసి చూస్తూ "చూశావా బాపూలీ? నాతల్లి ఎలాఅంటున్నదో!" అన్నాడు.

"నే నందుకనే మేలిమిబంగారాన్ని చూడగానే తెలుసుకోవచ్చు నని మొదట్లోనే మనవిచేశాను."

"నిజానికి నువ్వన్నమాటకి అసలైన సమాధానంఇదీ! ఈ దేశంలో కార్యదక్షులికి కొదువలేదు తల్లీ! కాని వారెక్కడున్నదీ వెతికి తెలుసుకునేవారే తక్కువ. అనేక విధాలైన దావాలు చెయ్యగలిగినవా రెందరో ఉన్నారు. అయితే మేం—వారు యేదైనా ఇచ్చేముందు—తాము ఇచ్చిన దాన్ని సార్థకం చెయ్యగలిగినవారిని చూసి ఇవ్వాలికదా!

నేను మొన్న కల్పతరువులాగానే నిలబడి కావలసింది కోరుకో మన్నాననుకో. మామూలు ఆడపిల్లలయితే ఏంకోరుకుని ఉండేవా రంటావ్‌? అసలు ఎవరూ బహుశా నోరు తెరచి అడగగలిగే వారుకాదు. అథవా అడిగినా సిగ్గుతో సతమత మవుతూ 'తమరేది యిచ్చినా సరే' అని మాత్రం అనగలిగే వారేమో! కాస్త ధైర్యంకల పిల్లఅయితే ఏడువారాల నగలు చేయించమనో ఇలాంటిదే మరొకటేదో అడిగేది. కాని నువ్వుమాత్రం ఈ దేశంలో ఎన్నడూ ఏ వధువూ కోరనికోర్కె కోరావు. అస లిలాంటిది కోరవచ్చునని ఎవరి ఊహకీ తట్టికూడా ఉండదు. కార్యదక్షు లెవరో గ్రహించి వారిని ప్రేరేపించటం అంటే ఇలాంటిదే. నేను ఇస్తానన్న దానిని నువ్వు సార్థకపరుస్తున్నావు. కాని ఒక్క విషయం. నేను ఇచ్చిన దానికన్న నువ్వు చేసిన త్యాగమే గొప్పది. నీ జన్మభూమికోసమని, నీ యీడు బాలికల కోసమని మహో న్నతమైన త్యాగంచేశావని నా ఉద్దేశం."

చండి తలవంచుకుని "మీరూరికే పొగిడి నన్ను సిగ్గు పరచవద్దు బాబా! ఈ ప్రాంతాల్లో మీ  రి ఎంత చిరస్థాయిగా—"

హరినారాయణబాబు ఆమాటకి అడ్డువచ్చి, 'ఈ కీర్తి నాది కాదమ్మా, నీది!... ఇహ ముఖ్యమైన పని ఇప్పుడు ముగి స్తాను. బాపూలీ! ఏదీ ఆ బాగ్ తెరచి ఇలాఇయ్యి"అన్నాడు.

బాపూలీ తన చేతులోని బాగ్ తెరవగానే అందులోని రత్నఖచితమైన బంగారు వస్తువులు అందరి చూపుల్నీ ఆక ర్షించాయి.

హరినారాయణబాబు ఆ బాగ్ లో చెయ్యిపెట్టి నవ్వుతూ "ఈ వృద్ధుడు చేసే పనులన్నీ మొత్తానికేవో అసహజమైన పనులై ఉంటాయని నువ్వు ఈపాటికి గ్రహించే ఉంటావు. కనుక నా అభిరుచికి అనుగుణమైన ఆభరణాలతో నిన్ను అలంకరింప చెయ్యబోతున్నందుకు మాత్రం నువ్వేమీ అభ్యంతరం చెప్పకూడదు. ముందుగానే చెప్తున్నా" అన్నాడు.

ఇలా అంటూనే ఆయన బాగ్ లోనుంచి అపూర్వ శిల్పంతో తయారుచేయబడిన రెండు బంగారు కంకణాలు పైకితీశాడు. అవి తయారింపులో అందంగా ఉండటమే కాక పరిమాణంలో కూడా పెద్దవిగా, ఎంతో బరువుగా ఉన్నాయి. హరినారాయణ బాబే స్వయంగా ఆ కంకణాలను చండి చేతులకు పెట్టి, "ఆదిలక్ష్మికి అసలైన భూషణా లివే తల్లీ! ఈ హస్తకంకణాలు ఆమెకి ఒకప్పుడు కేవలం అలంకారాలుగానే కాక ఆయుధాలుగాకూడా ఉపయోగపడ్డాయి. ప్రాచీనకాలపు స్త్రీలు ఇలాంటి కంకణాలనే ధరించి తమ భర్తల ఆయుఃపరిమాణాన్ని ఎక్కువ చేసుకోగలిగారు. అవసర మయినప్పుడు వాటితోనే ఆత్మరక్షణ కూడా చేసుకోగలిగారు. వీటితో గురిచూసి కణతలమీద ఒక్క దెబ్బకొడితే ఎంతటి వాళ్లయినా తల గిర్రున తిరిగి పాదాక్రాంతు లయ్యేవాళ్లు. కాని ఈకాలపు వాళ్లుమాత్రం సగర్వంగా ధరించతగిన ఇలాంటి భూషణాలన్నిటినీ వదిలేసి- కేవలం సన్న సన్నని గాజులతో సరిపెట్టుకుంటున్నారు. పురుషులు కొందరు అంతేలే. అవసరమైతే ఆయుధంగా

ఉపయోగించ తగిన చేతికర్రల్ని తమ ఆరోగ్యముతోపాటు వదిలేసుకుని విలాసంగా ఎందుకూ కొరగాని చేతికర్రల్ని ధరిస్తున్నారు. అసలింతకీ నా ప్రశ్న యేమిటంటే ఇవి నీకు నచ్చాయా ?" అని అడిగాడు.

"నీ వివాహానికి అందరూ చూసి ఆశ్చర్య పోయే టట్లుగా రెండు కంకణాలు చేయిస్తాను చండీ!" అనేవారు మా తాతగారు. కాని ఆయ నిప్పుడు స్వర్గవాసులైనారు. ఆ మహాపురుషుని మనోరథాన్ని తమరు పూర్తిచేశారు బాబా! ఇహనుంచి రోజూ ఉదయం సాయంత్రం రెండు వేళలా వీటిని భక్తితో కళ్ళకద్దుకొని ఇవాల్టి సంఘటనను స్మరించుకుంటూ ఉంటాను" అన్నది చండి.

హరినారాయణబాబు ఎంతో తమకంతో "విన్నావా బాపూలీ! 'మీరింత ఖర్చుపెట్టి ఈ కంకణాల్ని అయితే చేయిస్తున్నారు కాని, ఈ కాలపు పిల్లలు వీటిని పెట్టుకోర'ని వద్దన్నావుగా !" అని అడిగాడు.

"మీ తపస్సుకి సంతుష్టురాలై మీ కులదేవత మీకు నచ్చిన కోడల్ని సృష్టిచేసి ఉంచిందన్న సంగతి నేనప్పుడు ఊహించ లేకపోయాను" అన్నాడు బాపూలీ.

తర్వాత మళ్ళీ బాగ్‌లోనుంచి మరో రెండు స్వర్ణ భూషణాలని బయటికితీసి, నీపేరుకి తగినట్లుగా నువ్వెలాంటి దానివో నీ మామగారిని నేనూ అలాంటివాణ్ణే, నేనిచ్చే కానుకలూ అలాంటివే. ఇవిరెండూ ఎన్నాళ్ళనుంచో మా యినప్పెట్టెలో పడివున్నాయి. మాతాతగారు మహేశ్వర గంగూలీగారు వీటిని మా నాయనమ్మకోసం చేయించారు.

ఆమె అనంతరం ఈ ఇంటికి కోడలుగా వచ్చినవారి కెవరికీ వీటిని ధరించగల శక్తి సామర్థ్యాలు లేకపోయాయి. వీటి నిప్పుడు నువ్వుధరించి, గంగూలీ వంశంలో లోపించిన శక్తి సామర్థ్యాలను నువ్వే పునర్జీవింప చెయ్యాలి'' అన్నాడు హరినారాయణబాబు.

మేలిమిబంగారంతో తయారైన ఈ ఆభరణాలు ఇంచు మించు రెండువందల కాసుల బరువున్నాయి. వాటిల్లోని హారాన్ని చండిమెడలోవేసి, శిరోభూషణాన్ని ఆమె శిరస్సున ధరింపచేసి, "ఇప్పుడు మాతల్లి సాక్షాత్తు మహాలక్ష్మిలా ఉంది'' అన్నాడాయన.

చండి ఒక్కొక్కరికే అందరికీ నమస్కరించి శిష్టా చారాన్ని పాటించింది. క్రొత్తవస్త్రాలు కాని క్రొత్త ఆభర ణాలు కాని ధరించినప్పుడు చాలామంది ఆడపిల్లలు పెద్దలందరికి ఇలా నమస్కరించటం సంప్రదాయరీ. ఈ సంప్రదాయం హిందువు లందరికి సుపరిచితమైనదే...

వాహ్ ! ఈ ఆభరణాల బరువుతో మాతల్లి యేమా త్రం క్రుంగిపోలేదు'' అన్నాడు జమీందారుగారు.

కరాలీ చటర్జీ నవ్వుతూ "ఇలాంటి విషయాల్లో మా అమ్మాయి ఏం ఫర్వాలేదు. ప్రభువులు వింటే ఆశ్చర్యపోతా రేమో! మణుగు బియ్యంమూటనైనాసరే మాఅమ్మాయి చులాగ్గా ఒకచేత్తో పైకెత్తటం, దింపటం చాలాసార్లు చేసింది'' అన్నాడు.

"మణుగు బరువు మోయటం అనేది మన అమ్మా యికి తృణప్రాయం బావగారూ! కాని ఆమె శిరస్సున ఎంత

బరువును ఎత్త సంకల్పించుకున్నానో నేను, ఆవిషయం తర్వాత తెలుసుకోగలుగుతారు మీరు. అయినా నాకు తెలుసు. మన అమ్మాయి దానికైనా ఏమాత్రం వెనుకంజ వెయ్యదు. ఇప్పుడిహ నీకు యింకోవస్తువు నిస్తానమ్మాయీ! ఇదే నా చివరి కానుక, అన్నిటికన్నా యెక్కువైన కానుక" అంటూ ఆయన సర్వాకృతిలో ఉన్న ఓ విచిత్ర వస్తువును బాగ్‌లోనుంచి పైకి తీశాడు. ఆవస్తువును చండి ముందు పెట్టి, "ఇదేమిటో చెప్పుకోగలవా అమ్మాయీ!" అని అడిగాడు.

చండి ముఖం చాటు చేసుకుని, చిరునవ్వు నవ్వుకుని "కొరడాయేమో అనుకుంటాను" అన్నది.

"నిజమే కనుక్కున్నా వమ్మాయీ, కొరడాయే అది! ఇలాంటి కొరడా నువ్వెప్పుడైనా చూశావా?"

"చూశాను, మా తాతగారు ఓసారి నాకు ఇలాంటి కొరడా నిచ్చారు. కాని అది చర్మంతో—"

"ఇది బంగారంతో తయారైనది. ఇది నీకు నేను ఎందుకిచ్చానో తెలుసా? మా యింట్లో ఒక అలవిమాలిన గాడిద ఉన్నాడు. వాడిని నువ్వు అదుపులోకి తీసుకురావాలి. అందుకే నీ కిప్పుడీ కొరడా యిస్తున్నది!"

చండి నవ్వుతూ "ఇంట్లో గాడిదని అదుపులో పెట్ట డానికైతే చర్మంతో తయారైన కొరడా చాలు. బంగారుతో చేసింది దేనికి?" అని అడిగింది.

హరినారాయణబాబు కౌతుకోజ్జ్వలమైన చండి ముఖం కేసి చూశాడు. తర్వాత తన సౌమ్య ముఖాన్ని కఠినంగా మార్చుకుని, "నేను ఎవర్ని గురించి నీకు చెప్పానో అది

మామూలు గాడిద కాదు. బంగారపు గాడిద. అంచేత అలాంటి గాడిదని అదుపులో పెట్టడానికి ఈ బంగారు కొరడాయే అవసరం. ఇదుగో తీసుకోఅమ్మా! పట్టుకో. దీంతో పాటు నేను చెప్పిన మాటలుకూడా గుర్తుంచుకో'' అన్నాడు.

చండి చెయ్యి చాచి ఆయన చేతిలోంచి ఆ విలక్షణమైన బంగారపు కొరడా అందుకుంది... ...

బొశులీ జమీందారుగారి సంపత్తీ - ప్రతిపత్తీ చూసినవారంతా ఈయన క్రితంజన్మలో ఎంతో మహాపుణ్యం చేసుకుని ఉండక పోయినట్లయితే ఇంత ఐశ్వర్యవంతుడు కాగలిగేవాడు కాడని అనుకునేవాళ్లు. కాని ఈ భాగ్యశాలి సంసారిక విషయాలు వారి కంతగా తెలియవల్లేఉంది. తెలిసినట్లయితే ఇంత ఐశ్వర్యం, ఇంత అధికారం ఉన్నా ఈ విచిత్రవ్యక్తికి ఇంతకు మించిన దుఃఖంకూడా ఉన్నదన్న సంగతి గ్రహించేవారే.

హరినారాయణబాబుకి తండ్రి చిన్నతనంలోనే పోయాడు. కాని ఆత్మీయుల సహకారంవల్ల, వాత్సల్యమూర్తి అయిన తల్లిగారాబంగా సాకటంవల్ల, అప్పుడాలోటు అతడికి లోటుగానే అనిపించలేదు. యౌవనదశలో ఉండగా తల్లి గతించినప్పుడు సహధర్మచారిణి అయిన సులోచన సహచర్యం అతడికెంతో సాంత్వనం కలిగించింది. కాని యౌవనం కూడా వెనక్కిదిగజారి ప్రౌఢదశలో పాదం పెడుతున్న

రోజుల్లో సులోచన భర్తబాహుబంధాన్ని విడగొట్టుకుని పరలోకానికి ప్రయాణమైంది. అప్పుడీ జమీందారీగాని, ఈ విపులైశ్వర్యంకాని, ధైర్యసాహసాలుకాని అతడి కేమాత్రం రక్షణ కల్పించలేక పోయాయి. దుఃఖమనేది ఎంత పీడిస్తుందో, మనస్సుని ఎంతగా కోస్తుందో హరినారాయణబాబుకి అప్పుడే ప్రప్రథమంగా అనుభవంలోనికి వచ్చింది. ప్రియా విహారంలో అతీత స్మృతులెన్నో అనుక్షణం కాటువేస్తూనే ఉంటాయి. వారి దేవిడీలో ఆశ్రితులైన ఆత్మీయులకీ కొదువేంలేదు. అయినా సాంత్వనమెవరు కలిగింపగలరు? పరమసాధ్వి అయిన సులోచన వీరినందర్నీ ఒక కంట కనిపెట్టి కాపాడుతుండేది. ఆ కరుణామయి అంతర్ధానం కావటం వల్ల అందరికీ మతిపోయినట్లయినది. రెండుసంవత్సరాల శిశువుని-గోవిందుని భర్తకప్పగించి పరలోక గతురాలైంది సులోచన. హరినారాయణబాబు ఆ పసికందును చూసుకుంటూ భార్యావియోగ దుఃఖాన్ని మరచిపోవాలని ప్రయత్నించాడు. కాని సాధ్యం కాలేదు. తండ్రి గారాబంచేసినంత మాత్రాన పిల్లవాడు తల్లిని మరచిపోలేదు. ఇంట్లో ఉన్న పరిచారికలూ, పరిజనులూ అందరూ అస్తమానం ఏడుస్తూవుండే పిల్లవాణ్ణి చూసి కంగారు పడసాగారు. ఏం చేసినా ఊరుకునేవాడు కాదు. ''అమ్మ దగ్గిరికి పోతాను'' అని ఒకటే ఏడుపు. పుట్టెడు దుఃఖములో మునిగిఉన్నా హరినారాయణబాబు ఈ విషయమై చాలా ఆలోచించాడు. అతడికీ శైశవంలోనే తండ్రి పోయాడు. యౌవనంలో తల్లి గతించింది. అయినా అతడింతగా బెంబేలు పడిపోలేదు.

పౌరుషం, అభిమానం ఆ నలభై సంవత్సరాల జమీందారు హృదయాన్ని కలచివేశాయి. మామూలు మానవులు లాగా తానుకూడా పదిమంది సానుభూతి వాక్యాలకోసం ఆపేక్షపడితే, ఇదివరకుదాకా తన యెదుట పడడానికి కూడా సాహసం లేనివారంతా ఈ అవకాశాన్ని ఊతగా తీసుకుని మరీదగ్గరకి చేరటానికి ప్రయత్నిస్తారు. ఈ ఆలోచన రావటంతో ఆయన దుఃఖాన్నంతా అతిప్రయత్నంమీద ఎలాగో దిగమింగి మళ్లీ ఎంతో ఉత్సాహము తెచ్చిపెట్టుకుని జమీందారీ వ్యవహారాలు చూసుకోటం మొదలెట్టాడు. దుఃఖ విహ్వాలుడైన జమీందారుగారు హఠాత్తుగా మళ్లీ వ్యవహారాల్లో ఇంత ఆసక్తిని కనపర్చటం చూసి అందరూ హడలిపోయారు. 'పిల్లవాడి ఏడ్పు నాచెవిని పడిందంటే ఊరుకోను ఇహ, జాగ్రత్త అని పరిచారికల నందర్నీ హెచ్చరించాడు. యజమానికి సంబంధించిన విషయాల్లో అందరూ ఎంతో జాగ్రత్తగా ఉండేవాళ్లు. పిల్లవాడియేడ్పు ఆయన చెవిని పడిందంటే తమకెవ్వరికి ఇంక అక్కడ ఉండేందుకు ఆస్కారం ఉండదని తెలుసువాళ్లకి. పిల్లవాడ్ని చూదామా రెండు నిమిషాలైనా ఏడుపుమాని ఊరుకునేట్లు లేడు. చివరికి ఏడుపు మాన్పించటం ఎలా అనేది నిర్ణయించుకున్నారు. వీళ్ళలో ఒక పరిచారిక కలకత్తాలో ఓజమీందారు యింట్లో కొన్నాళ్లు పనిచేసింది. జమీందార్ల యిళ్లలో ఏడుస్తూఉండే బిడ్డల్ని ఏడ్పు మానిపించటం ఎలాగో తెలుసుకునే అది ఈ బాళులీ జమీందారుగారి హవేలీలో ప్రవేశించింది. ఆపనే ఇక్కడాచేస్తే ప్రయోజనం ఉండకపోదు. కొద్ది పరిమా

ణంలో ఇంత నల్లమందు పాలుపట్టేటప్పుడు ఆ పాలల్లో కలిపిపట్టి - బిడ్డని నిద్రపోయేటట్లు చేయటం మొదలెట్టింది. ఇహ ఎప్పుడూ పిల్లవాడు నిద్రమత్తుగానే ఉండేవాడు. తర్వాత యెప్పుడూ పసివాడి యేడుపు ప్రభుపుగారి చెవిని పడనే లేదు.

పైకి జమీందారు చాలా కఠినుడిలా కన్పించేవాడు. ఇంతదుఃఖాన్ని ఈయనఎలాదిగ్రమింగగలిగాడాఅని అందరూ అనుకునేవాళ్లు. కాని మనస్సులో ఎంత బాధపడుతున్నాడో అదెవరికి తెలుస్తుంది ; తెల్లవారేసరికి కన్నీటితో తడిసిఉండే అతడి తలగడాను చూసి, ఈ కఠినుడి మనః ప్రవృత్తి ఎలాంటిదయిందీ తెలుసుకునేందు కెవరికి పట్టింది ?

ఆర్నెల్లు ఇలా గడిచి పోయాయి. జమీందారుగారు పగలల్లా ఆఫీసులో కూచుని శాసించటంతోనూ, మధ్యాహ్నమప్పుడు - రాత్రిళ్ళూ తన గదిలో కూచుని స్వర్గీయురాలైన సహధర్మచారిణిని తలచుకుంటూ కాలక్షేపం చెయ్యసాగాడు. కాని తలవనితలంపుగా జరిగిన ఓసంఘటనతో అతడి దిగుళ్ళన్నీ మాయమైనాయి. బాకులీ జమీందార్లకి పొరుగు జమీందారయిన రేవతీ మోహనరాయ చౌదరి అప్పుల్లో మునిగి హరినారాయణ బాబుని ఆశ్రయించాడు. హరినారాయణబాబు పన్నెండు లక్షల రూపాయలు అప్పుగా యిచ్చి అతడ్ని అప్పుల బారినుంచి తప్పించాడు. రాయ చౌదరీకూడా అందుకు కృతజ్ఞతగా తన యెస్టేట్ మీద అధికారాలన్నీ హరినారాయణబాబుకి దఖల్ పరిచాడు. ఈ కారణం మూలంగా ఈ రెండు కుటుంబాలకి బాగా సన్ని

హితత్వం ఏర్పడింది. తర్వాత రాయచౌదురీగారి కుమార్తె మాధురీదేవి - పదిహేడేండ్ల యువతి - హరినారాయణగారి అంతఃపురంలోకి రాణిహోదాలో ప్రవేశించబోతున్నదని తెలుసుకున్నప్పుడు అందరూ ఆశ్చర్యపోయారు.

హరినారాయణబాబుకి కాస్త ఖాయాలీ ఉన్నమాట నిజమేకాని, ప్రభుత్వంవారిచ్చే గౌరవ బిరుదాలమీద మాత్రం అతడి కెన్నడూ మోజులేదు. తన ప్రజలందరికీ అతడు ప్రాణతుల్యుడు. యెస్టేట్‌లో ఎక్కడచూసినా అతడికి మంచి పేరేఉంది. మా'రాజబాబు' 'రాజబాబు' అని అందరూ ఘనంగా చెప్పుకునే వారాయన్ని గురించి. ప్రభుత్వ సంస్థలకి ఆయనెప్పుడైనా భూరివిరాళ మిచ్చినపుడు కూడా అక్కడుండే కలెక్టర్‌కో - కమీషనర్‌కో ఈ విరాళమిచ్చినందుకుగాను మీరు నాకు బిరుదేమైనా యిచ్చి నన్నుమాత్రం సిగ్గుపడేటట్లు చేయకండి' అని ముందుగానే వ్రాసుకునేవాడు.

హరినారాయణబాబు తన కేదైనా ఖయాలీ పుట్టినప్పుడు అసాధ్యమైనపను లనుకున్నవన్ని ఎలాచేశాడో, రేవతీ మోహనుడి కూతుర్నికూడా చటుక్కున అలాగే వివాహమాడాడు. రేవతీ మోహనునికి అప్పుపెట్టిన అష్టకోట జమీందారు పెద్ద వంశగౌరవంలేనివాడు. అయినా అతడు మాధురీదేవిని తన కివ్వమని కోరాడు. రేవతీ మోహనుడికి రెండు బెడదలొచ్చిపడ్డాయి. హరినారాయణబాబు అతడ్ని ఋణ విముక్తుణ్ణిచేశాడు. కాని చరిత్రహీనుడయిన అష్టకోట జమీందారు మాధురీ దేవిని ఎలాగైనా వివాహం చేసుకోవాలని కుట్రలు పన్నసాగాడు. రేవతీ మోహనుడు తన గాజసాన్ని

రక్షించు కోటానికి ఎంతైనా ఖర్చు పెట్టేవాడుకాని, తగాదాలన్నా, కోర్టువ్యవహారాలన్నా అంత పట్టించుకునే వాడు కాడు. ఆ జమీందారు ఇలాంటి వాటిల్లో ఆరితేరిన వాడు. తన కూతుర్ని ఇవ్వలేదనే కోపంతో అతడింకా ఏం చేస్తాడో అన్న భయంతో రేవతీ మోహనుడు మరోసారి హరినారాయణబాబుని ఆశ్రయించాడు. - ఆ జమీం దార్ల ఆదికాలంనుంచి ఏవో మనస్పర్థలుంటూ ఉండేవి. అతడిదంతావిని మండిపడ్డాడు. అష్టకోట జమీందారు కుతంత్రాలు పన్నుతూ ఉండగానే - హరినారాయణబాబు అందరూ విస్తుపోయేటట్లు రేవతీమోహనుడి కూతుర్ని హఠాత్తుగా తానే వివాహం చేసుకుని, తన కోటలోకి రప్పించు కున్నాడు.

ఇది జరిగికూడా ఇరవై రెండు సంవత్సరాలు కావొచ్చింది. ఈ బాశులీవారి దేవిడీలో ఎన్నో పరిణామా లొచ్చాయి. మాతృవిహీనుడైన గోవిందు డిప్పుడు ఇరవై నాలుగు సంవత్సరాల యువకుడు. తల్లిపోయిన క్రొత్తలో ఇతడు తండ్రికెంత సమస్యగా కనుపించాడో - అలాగే ఈ నాటికీ సమస్యగానే కన్పిస్తున్నాడు. తండ్రి కీనాటికీ ఆ ఆందోళన, ఆదుర్దా తీరనేలేదు.

వీరి వంశంలోవారి నందర్నీ సృష్టించిన విధాతే ఇతణ్ణీ సృష్టించాడు. రూపురేఖల్లో దేహసౌష్టవంలో గోవింద గంగూలీ అందరి లాగానే ఉంటాడు. కాని ఈ వయస్సులో ఇంతటి కులీనుల బిడ్డలకి సహజంగా ఉండే లావణ్యమూ, సుకుమారత మాత్రం అతడిలో లోపించాయి. పచ్చని

దేహచ్ఛాయ అయినా కాంతివంతంగా ఉన్నట్లుండదు. ముఖంలో జడత్వం అచ్చుగుద్దినట్లుంటుంది. శరీరం సరియైన పోషణ లేకనేమో బిరుసువారినట్లుంటుంది. లేతవయస్సయినా కొంచెం ముదురువయస్సువాడిలా కనిపిస్తాడు. జుట్టు రాగి రంగుకు తిరిగింది. అతడి రూపురేఖల్లో ఈ లోపాలతో పాటు కొన్ని ప్రశస్తమైన లక్షణాలుకూడా ఉన్నాయి. ఆరడుగుల పొడవు, ఆజాను బాహువు, కోటేరు వేసినట్లుండే ముక్కు, చారెడేసి కళ్లు - ఈ లక్షణాలవల్ల చూపరులను ఇట్టే ఆకర్షిస్తాడు.

ఇంతవరకిది ఆకారవైఖరులకు సంబంధించిన గాథ. ఇహ అతడి మనస్తత్వాన్ని గురించి ఆలోచిస్తే మాత్రం అన్నీలోపాలే. అతడిలో ముఖ్యమైన లోపం మానసిక దౌర్బల్యం. ఒత్తిదద్దమ్మలా, వెర్రిబాగులవాడిలా ఉంటాడు. అతడు బయట ఎవరితోనూ కలిసిమెలిసి తిరిగేందుకు వీల్లేదు. అలా తిరగగల స్తోమతాలేదు అతడికి. పేరుకిమాత్రమే జ్యేష్ఠుడు. ప్రాపంచిక జ్ఞానం మాట అలాఉంచి - అసలు ఆత్మగౌరవం కాపాడుకోవటంకూడా తెలియని జడుడు. పరిచారికలు పరిచారకులు ఎవరూ అతడ్ని లక్ష్యపెట్టరు. ఆశ్రితులూ - ఆత్మీయులూ అతడ్నిగురించి అసలు పట్టించుకోరు. ఎవరైనా అతడ్ని ఆక్షేపించినా అభిమానపడడు. ఎవరైనా అతడిమీద అధికారం చెలాయించబోయినా కోపం తెచ్చుకోడు. కనుక ఇంత 'శుద్ధ-మొద్దు - స్వరూపు'డైన కుమారుడి విషయమై తండ్రికి అనవరతమూ ఆందోళనే అంటే అందులో ఆశ్చర్యం ఏముంది ?

ఇహ జమీందారుగారి రెండో భార్య కొడుకు - గోవిందుడి సవితి తమ్ముడు - నివారణు డున్నాడు. అతడు ఇతడికన్న నాలుగేళ్లు చిన్నవాడైనా - అన్నివిషయాల్లోనూ అన్నగారిని వెనక్కి-లాగేసి, తండ్రితో సమానస్థాయిని అందుకో గలిగాడు. అవసరమొచ్చిందంటే జమీందారు ఎంత ముఖ్యమైన కార్యభారాన్నయినా అతడిమీద వేస్తాడు. అతడికి తండ్రిగుణాలు చాలా అబ్బినై. ఇంత చిన్న వాడైనా అతడంటే వారి కచేరీలో అందరికీ హడలే. ఇంట్లో దాసదాసీలు - ఆత్మీయులు - ఎవరైనాసరే, అతడి యెదుటికి వచ్చి మాట్లాడాలంటే గజగజ లాడిపోయేవాళ్ళు. అతడి ఔద్ధత్యం ప్రతాపం తండ్రికెంతో ముచ్చటగా ఉండేవి. అతడ్ని వెనకేసుకువచ్చి -''ఇదే కావలసింది. ఈ మాత్రం కరుకుతనం చూపగలిగితేనే - పేరు చెపితేచాలు అధికారం సాగిపోతూ ఉంటుంది.'' అనేవాడు తండ్రి.

జమీందారుగారికి పెద్దకొడుకంటే చాలా చులకనైన భావం ఉండటం, చిన్నకొడుకంటె అపరిమితమైన ఆదరానురాగాలుండటం ఎస్టేటులోని ప్రజలందరూ గ్రహించారు. అచిర కాలంలో నివారణుడే తమ 'భాగ్యవిధాత' అయేవాడు- అని అనుకుంటూ ఉండేవాళ్లు ప్రజలు.

ప్రజలకిలాంటి అనుమానం రావటానికికూడా కారణం లేకపోలేదు.

తరతరాలనుంచీ వారి వంశంలో వస్తున్న పద్ధతి ఏమిటంటే ఆస్తి ఎవరూ పంచుకోడానికి వీల్లేదు. వంశంలో జ్యేష్టుడే ఎస్టేట్‌కి అధికారి కనిష్టులుంటే-వారికేదో నెలకిం

తనో, ఏడాదికింతనో జీవనభృతి యివ్వటమే. అందుచేతనే వారి ఐశ్వర్యం ఇప్పటివరకూ అవిచ్ఛిన్నంగా ఉంటూవచ్చింది. వారికి ఐశ్వర్యానికి తగినంత సంతానవృద్ధి ఎన్నడూలేదు. భగవంతుడేదో ఆలోచించి సృష్టించినట్లు ఆ వంశంలో ఎవరికి చూసినా ఒక్కడే పుత్రుడుండేవాడు. ప్రస్తుతపు జమీందారైన హరినారాయణబాబు విషయంలోనే విధాత ఆ నియమానికి భంగం కలిగించాడు. ఈ వంశంలో రెండుపెళ్ళిళ్ళు చేసుకున్నదీ - ఇద్దరు పుత్రులున్నదీ ఈయన ఒక్కడే. కనుక ఇప్పుడు అధికారం ఏకొడుక్కి సంక్రమింప చేస్తాడన్న ప్రశ్న బయలుదేరటం సహజం కనుక ప్రజలలా ఊహించగలిగారు.

శ్యామాపురంలోని తమ ఏజంటు చండిని గురించి అన్ని విషయాలూ విపులంగా రాసి పంపగానే హరినారాయణబాబు మాధురీదేవిని పిలిచి, "ఒక విలక్షణమయిన పిల్ల ఉన్నదని తెలిసింది" అని చెప్పాడు.

"గోవిందునిలాంటి వెర్రిబాగులవాడికి, తెలివితక్కువ దద్దమ్మకి పెళ్ళికూడా చెయ్యటం భావ్యంకాదు" అని మాధురీదేవి భర్తతో ఇదివరకు చాలాసార్లు చెప్పింది.

భార్య అలా అంటూవుంటే హరినారాయణబాబు ఆమె ముఖంకేసి నిదానించిచూసి, పెద్దనిట్టూర్పు విడిచి "అవును. అదీ ఆలోచించాల్సిన సంగతే" అంటూ ఉండేవాడు.

ఆ తర్వాత ఇహ ఎప్పుడు వచ్చినా గోవిందుడి విషయం అలా ఉంచి, నివారణుడి పెళ్ళి ప్రస్తావనే వస్తూ ఉండేది. భర్త తన మాటలు విన్నాక చేసిన సూచన్ని బట్టి ఆమె ఈనిర్ణయానికి వచ్చింది. గోవిందుడు జ్యేష్ఠుడన్న హోదాలోనే ఉంటూ, కనిష్ఠులు తీసుకునేట్లు జీవనభృతి మాత్రం పుచ్చుకుంటూ ఒంటరిగానేకాలం గడుపుతాడని, ఆరోగ్యం విషయంలో, ఆయుర్దాయం విషయంలో – ప్రతి విషయంలోనూ సందేహ భాజనుడైన గోవిందుడు ఇకముందు సాంసారిక జీవితానికి దూరంగా ఉండేటట్లే – బాశులీ జమీందారీ గద్దెకికూడా దూరంగా ఉండగలడని ఊహిస్తూ వచ్చింది.

అంచేత భర్త విలక్షణమైన పిల్ల అని చెప్పగానే అది తన కుమారుడు నివారణుడ్ని ఉద్దేశించే చెప్పినమాటయి ఉంటుందని మాధురీదేవి గ్రహించింది. గ్రహించి కొంచెం వెటకారంగా – "పిల్ల అద్భుతమైన పిల్లఅయితే ఏమయినట్లు? వాళ్ళ వంశంకూడా గొప్పదై ఉండొద్దూ?" అన్నది.

"శాస్త్రకారు డేమన్నాడో తెలుసా? 'స్త్రీరత్నం దుష్కులాదపి' అన్నాడు" అంటూ హరినారాణబాబు నవ్వాడు.

మాధురీదేవి రుసరుసలాడుతూ "ఆ శాస్త్రాలూ అవీ తుంగలో తొక్కండి. రాజ పుత్రిక కాకపోతే నివారణుడికి నచ్చదసలు. నా నుచ్చట తీరదు. మీకు తెలియనిదేముంది? అసలింతకి పిల్లమొక్కడేమిటి? అని అడిగింది.

భర్త గంభీరంగా తాను చెప్పినదాన్ని ఉపసంహరించుకుంటూ "అయితే ఇహ విని మాత్రం ఏం ప్రయోజనం? నీముచ్చట సంగతి నాకు జ్ఞాపకమేలేదు. ఇహ ఏమయితేయేం - ఈ సంగతి గుర్తుపెట్టుకునే-నివారణుడికి తగిన పిల్లకోసం ప్రయత్నిస్తాను" అన్నాడు.

రెండు రోజులుపోయాక మళ్లీ భార్యని పిలిచి, 'గోవిందుడి వివాహం నిశ్చయం చేశాను. వచ్చే త్రయోదశినాడే ముహూర్తం" అని చెప్పాడు - హరినారాయణబాబు.

భర్త మాటలు వింటూంటే మాధుకీదేవికి - పిడుగు పడ్డట్టు - చెవులు గడియలు పడ్డాయి. గోవిందుడి పెళ్ళా! తాను పొరపాటుగా వినలేదుకదా! ఆశ్చర్యంతో తడబడుతూ "ఎవరి పెళ్ళి సంగతీ మీరన్నది?" అని అడిగింది.

విన్నబోయిన భార్యముఖంకేసి రెప్పవాల్చకుండా చూస్తూ "నీ పెద్ద కొడుకు పెళ్ళి సంగతి" అన్నాడు హరినారాయణబాబు.

మరుక్షణంలోనే ఆమె కొంచెం ఎత్తిపొడుపుగా - "నిజమే, అయితే పెద్దకొడుకుకి వచ్చిన ముదురు బెండకాయ అన్న పేరును ఎలాగైనాసరే పోయేటట్లు చేయటానికి నడుం కట్టారన్నమాట! అవును అదీ అవసరమే" అన్నది.

భార్యకెందుకింత అయిష్టతో గ్రహించే హరినారాయణబాబు జవాబు చెప్పాడు - "ఇన్నాళ్ళనుంచీ ఇది అంత అవసరమన్న సంగతి ఆలోచించలేదు. కాని పిల్లను చూశాక ఎప్పుడైతే నచ్చిందో అప్పుడే మా అబ్బాయికి చేసుకుంటామని మాటకూడా ఇచ్చివచ్చాను. పేదయింటిపిల్ల, ఆమె

ఎంత రూపవతీ, గుణవతీ అయినా కానీ - తండ్రి అంత పేరు ప్రతిష్ఠలున్నవాడూ - ఐశ్వర్యవంతుడూ, గొప్పవాడూ మాత్రం కాడు. నివారణుడి పెళ్ళి విషయంలో అయితే మరి నీ ప్రతిజ్ఞ ఒకటి నెరవేరాలిగా! అంతంతమాత్రం సంబంధ మయితే నీకు నచ్చదుగా! రాజపుత్రిక కావాలాయె. అందు కని నేను ఇచ్చిన మాట నిలబెట్టుకోటానికి ఆ పేదపిల్లని గోవిందుడి కంఠానికి కట్టి - వాడికున్న ముదురు బెండకాయ అన్న పేరును తొలగిపోయేట్లు చేయతలచుకున్నాను.''

మాధురీదేవి భర్త మాటలన్నీ శ్రద్ధగా విని, ఈసారి పైకి కొంచెం గంభీరంగా "మంచిపని చేశారు. జడభరతుడు లాంటి జమీందారుబిడ్డ-ఓ పేదయింటి విచిత్రమైన పడుచు! ఈ ఇద్దరిపోత్తూ చాలాబావుంటుంది!'' అన్నది.

భర్త ఉత్సాహంతో "సరియైన మాట చెప్పావు. నే ననుకున్నదీ అదే. అంచేతనే నేనూ చాలాదూరం ఆలో చించి మన ఈ మందకొడి రాదారి పడవకి-ధాటీగా పరుగెత్తే 'స్టీమ్‌లాంచ్'ని తీసుకొచ్చి కట్టేందుకు యేర్పాటు చేశాను. బహుశా దీనివల్ల కలిగే ఫలితం మంచిదే అయి ఉండొచ్చు'' అన్నాడు.

ఈ విషయమై ఇంక వేరేమాట లేపీ రాలేదు. కాని అర్థం చేసుకోగలిగితే ఆమాటలే చాలు. భర్త చివరికన్న మాటలు మాధురీదేవి హృదయాన్ని పురుగు తొలిచినట్లు తొలచి, చురుకు చురుకు మంటలు పుట్టించసాగాయి. ఇరవై రెండు సంవత్సరాలనుంచీ తాను ఈ కుటుంబ శకటాన్ని తప్పుదారిని నడిపిస్తూ వచ్చిందా? భర్త హృదయంలోని

అంతర్యం తానిన్నాళ్ళనుంచీ గ్రహించనే లేకపోయిందా? తన పుత్రుడు నివారణుడు గద్దెయెక్కి సుస్థిరంగా ఉండేందుకు గాను-మెల్లి మెల్లిగా అన్ని వైపులనుంచీ ఆటంకాలను తొల గించటానికిచేస్తున్న ప్రయత్నమంతా వృథాప్రయాసే అవు తుందా?...

అనుకున్న లగ్నానికే ఈ వివాహం యథావిధిగా జరిగి పోయింది.

సామాన్య స్థితిపరులైన ఆడ పెళ్ళివారు తమ తాహ తుకి మించి బ్రహ్మాండమైన ప్రయత్నాలయితే చేశారు. కాని మగపెళ్లివారు మాత్రం అంత ప్రయత్నాలేవీ చేసినట్లు లేదు. పెద్ద జమీందార్లాయె. బంగారు వస్త్రాలు ధరించి, పెద్ద బ్రహ్మాండంగా ఊరేగింపు చేసుకుంటూ వరుడు కళ్యాణవేదిక మీదికి వస్తాడని - కలలు కన్నవారంతా నిర్ఘాంతపోయారు. పెళ్ళికొడుకు పల్లకీ దిగి పందిట్లోకి రాగానే అందరూ తెల్ల బోయి చూడ సాగారు. అతడు మామూలు జరీఅంచు పంచె కట్టుకుని అలాంటిదే మరొకటి వల్లెవాటు వేసుకొని ఉన్నాడు. రెండు వైపులా రెండు పాదరసపుగుళ్ళు పెట్టికట్టిన లావుపాటి పూలదండ మాత్రం ఒకటి వేసుకుని ఉన్నాడు. అదొక్కటే కన్పిస్తున్న విశేషం. పెళ్ళికొడుకును చూడగానే 'భేష్, ఫర్వాలేదు' అని అన్నవాళ్ళే - కొంచెం సేపయేసరికి, మగపెళ్ళివారి చెవిని పడకుండా 'పెళ్లికొడుక్కి బుర్ర ఖాళీలా ఉందే' అని చెవులు కొరుక్కోవటం మొదలెట్టారు.

కాని పీటలమీాద వధూవరులు పరస్పరం చూచుకొనే శుభదృష్టి సందర్భంలో మాత్రం వరుడు కళ్ళు రెండూ ఇంతింత చేసుకుని వధువు కేసి చూశాడు. ఆ చూపులు వధువు హృదయాన్ని గాలిస్తున్నాయి. వధువుకూడా అదే సమయానికి అతడి కేసి ఇంచుమించు అలాగే చూసింది. ఈ అపరిచితవ్యక్తి—అతి పరిచితుడిలాగా తన హృదయ కవాటాన్ని తెరిచి, జాలిగా తనకు కావలసిన వస్తువుకోసం – దేనికోసమో వెదుకు తున్నాడా యని అనిపించిందామెకి. విశాలాక్షి అయిన చండి మెల్లిగా బరువుగా రెప్పలు వాల్చుకుంది.

లోపల శోభనపు గదిలోకూడా అందరూ సంశయ మనస్కులయినారు. వరుడు పెదవి కదల్చలేదు. ఎవరైనా పరిహాసమాడితే అది పట్టించుకున్నట్లే కన్పడలేదు. ఆడ వాళ్ళంతా చుట్టూచేరి హాస్యాలు పట్టిస్తూంటే అతడి ముఖంలో నవ్వన్న మాటే కన్పించలేదు. ముత్తైదువులు పడిన శ్రమంతా వ్యర్థమయింది. అతడి హృదయ కవచాన్ని మాత్రం ఛేదించ లేక పోయారు చివరికిదంతా యెనుబోతు మీాద జడివాన కురిసినట్లే అనుకుని ముత్తైదువులంతా తలో దారిని చూసుకున్నారు.

చండి అవగుంఠనంలోంచి ఇప్పటిదాకా వరుడి ముఖం కేసి చూస్తూఉంది. ముత్తైదువులంతా వెళ్ళిపోగానే, అవగుంఠనంలోంచి ముఖాన్ని కొంచెం బయటికి పెట్టింది. వధూవరుల చూపులు కలిశాయి. పెళ్ళిపీటలమీాదనుంచి లేచాక పరస్పరం ఇంత దగ్గిరగా చూసుకుం దిప్పుడే...

పెళ్ళికొడుకే ముందు మాట్లాడాడు. పసిపిల్లవాడి లాగా, "నీపేరు చండికదూ?" అని అడిగాడు.

వరుడి ముఖతః-పసిపిల్లలడిగే ప్రశ్నలాంటి-ఈ ప్రశ్న రావటంచూసి, చండి లోలోపల నవ్వుకుని, పైకి కొంచెం పరిహాసంగా "ఆc. మీ రిందాకట్నుంచీ ఈ పాఠమే వల్లించు కుంటూ కూచున్నారల్లే ఉంది!" అన్నది.

అతడు కళ్ళు రెండూ ఇంతంత చేసుకుని-అస్వాభావి కంగా చూస్తూ "భలే, పెళ్ళి చేసుకోటానికి వచ్చేవాళ్ళెవ రైనా పాఠాలు వల్లించుకుంటూ వస్తారాయేం?" అన్నాడు.

వరుడి మాటలకి చండి కనుబొమలు చిట్లించి, అతడి ముఖంకేసి తీవ్రంగా చూస్తూ "అయితే ఏం చెయ్యాలీ మరి వరుడు?" అని అడిగింది.

ముఖభంగిమతో పాటు, చేతులతోకూడా అభిన యిస్తూ - "బుద్ధిమంతుడిలాగా నోరుమూసుకుని చూస్తూ కూచోవాలి" అన్నాడు.

చండి ఆ సమాధానానికి తగినట్లే వేళాకోళంగా "అందుకనే ఇంతసేపూ అలా కూచున్నారల్లే ఉంది. ఎవరెన్ని వేళాకోళాలాడినా కిమ్మనలేదుగా!" అంది.

"వాళ్లు ఆడవాళ్లుగా మరి!"

"మరి నేను మగవాడినా?"

అతడీసారి నవ్వుతూ "ఉహూc. నువ్వు నా పెళ్లానివి" అన్నాడు.

చండి ఏమీ మాట్లాడకుండా అతడి ప్రక్కనే కూచుని రెప్పవాల్చకుండా ఆ అమాయకుడి ముఖంకేసి చూడసాగింది. క్రూరుడైన విధి తనని ఎలాంటివాడి పజ్జను చేర్చిందీ తెలుసుకోటాని కామె కెంతోసేపు పట్టలేదు. వెంటనే వెనక నుంచి ఎవరో వీపుమీద కొరడాతో చెళ్లున కొట్టి జ్ఞాపకం చేసినట్లు - మామగారు తనకి కానుకగా బంగారపు కొరడా యివ్వటం - ఇచ్చేటప్పుడు ఆయనన్న మాటలూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి. 'మా యింట్లో అలవిమాలిన గాడిద ఒకటుంది. దాన్ని నువ్వు లొంగతీయాలి. అందుకే నీకీ కొరడా' ...

చండికి కనువిప్పు కలిగింది.

మరుక్షణంలోనే రాజకుమార్తె విద్యావతి కథ గుర్తుకొచ్చింది. గురువు కుట్రపన్నటంవల్ల 'మూర్ఖకాళిదాసు'తో ఆమెకి వివాహమయింది. కాని రాజకన్య మూర్ఖుడైన భర్తని తిరస్కరించింది. ఆ తిరస్కృతుడైన మూర్ఖుడు కఠోరమైన సాధనచేసి, జయపతాకాన్ని చేతపట్టుకొని మళ్ళీవచ్చి విద్వాంసురాలైన భార్యని ఓడించి ఆమెకి గర్వభంగం చేశాడు* తనకీ అలాంటి పరీక్షా సమయమే అసన్నమైంది ఇప్పుడు ...

చండి మాట్లాడకుండా కూచోటం చూసి, అతడు నోరంతా తెరిచి "చూడు. ఇవాళ నాకెంతో సంతోషంగా ఉంది. నిజంగా..." అన్నాడు.

---

* తెలుగుదేశంలో ప్రచారంలో ఉన్న కాళిదాస పత్ని విద్యావతి కథ దీనికి విరుద్ధంగా ఉంది. విద్యావతి భర్తని తిరస్కరించినట్లు లేదు.

చిందరవందరగా తన మనస్సును పెనవైచుకున్న ఆలోచనల నన్నిటినీ బలవంతాన సడలింపచేసుకుని "ఎందుకని?" అని అడిగింది చండి.

వరుడు చెప్పలేనంత సిగ్గుతో చేతులు నులుముకుంటూ చండి కేసి చూస్తూ - "ఏముందీ - నిన్ను పెళ్ళిచేసుకుని, నీతో మాట్లాడుతున్నాను కదూ - అందుకనే" అన్నాడు.

చండి ముఖం చాటు చేసుకుని నవ్వి, "అయితే నేను మీకు నచ్చానన్నమాట; నిజంగా నేనా?" అని అడిగింది.

"యే-ఫో... నాకు సిగ్గేస్తోంది"

"పోనీ, ఆమాట చెప్పొద్దులెండి. మరినేను బాగా మాటాడుతున్నానా?"

"ఆఁ నే పుట్టాక నాతో యెవరూ ఇంత బాగా మాట్లాడలా..."

"ఏం? మీ నాన్నగారో?"

"మా నాన్న చూడగానే తిడతారు"

"కంటబడితేనే తిడతారా? మరి మీ అమ్మ?"

"నోటితో ఏమీ తిట్టదు. కాని కళ్ళెర్రచేసి చూస్తూ ఉంటుంది. ఆ చూపు ఎంత భయం వేస్తుందనుకున్నావ్? అమ్మ బాబోయ్! అలాంటి చూపు—"

"కోపంతోనే చూస్తారన్నమ్మాట. ఆపేక్షగా చూడనే చూడరా యెప్పుడూ?"

ఎందుకు చూస్తారు చెప్పు. నేను మూర్ఖుణ్ణిగా! మనిషి పుటక పుట్టిన గాడిదని. నాకు తెలివనే దేమీలేదు."

"మీరేమీ చదువుకోనే లేదా అసలు ?"

"ఊహూఁ. ఎలా చదువుకుంటాను ? చదువుచెప్ప టానికని మాష్టారు రోజూ వచ్చేవాడుట ! కాని తమాషా ఏమిటంటే ఆయన వచ్చి కూచున్నట్లు ఆయన పిలకకూడా నా కెప్పుడూ కన్పించలా"

"అదేం ?"

"నేను ఆయన దగ్గిరకు వెళ్ళటం మాత్రం దేనికి? నా బుర్రంతా ఒట్టి పేడముద్దట; నా కేమీచదువు రాదట! కాని నీతో చెపుతున్నాను. చదువుకోవాలని చాలా యిదిగా ఉంది."

"మీ అంతట మీరే చదువుకోలేక పోయారా ?"

"ఎలా చదువుకోను ? చిన్న జమీందారుగారొచ్చి చేతులో పుస్తకాలు లాక్కెళ్ళేవాడు. 'నువ్వ అసలే పిచ్చివాడివి, పుస్తకాలు కూడా చూస్తూ కూచున్నావంటే మరీ పిచ్చెక్కిపోతుంది' అనేవాడు పైగా. మా నాన్నతో ఈ మాట చెప్పినా ఆయన ఏమీ అనలేదు"

"చిన్న జమీందారేమవుతారు మీకు ?"

"అరే ! తెలియదూ నీకు? నా తమ్ముడు. మాసవితల్లి సంగతి చెప్పలా ఇప్పుడు నీకు ! ఆవిడి కొడుకు. మా అమ్మ పోయింది".

"అహాఁ తెలిసింది. సరే మరి మీ నాన్నగారితో ఎప్పుడూ చెప్పలేదూ ?"

"ఉహూ౦. చెప్పానంటే ఇంకేమన్నా ఉందా ; చిన్న జమీందారొచ్చి నా వీపు తాట ఒలుస్తాడు. ఒక్కొక్క-రోజున కొట్టాడంటే-

"కొడతాడా ? మీరు అతడికన్న పెద్దవాళ్లుకదూ !"

"పెద్దవాణ్ణయితే ఏం లాభం ? జమీందారయేది వాడే ! నీకు ఆ సంగతి తెలియదనుకుంటాను."

"అదేమిటి ? మరి మీరు ?"

"నేనో మొద్దునీ, జడభరతుణ్ణి, పిచ్చివాణ్ణి, అని అంటారందరూ. అందుకనే నాతో యెవరూ అసలు మనసిచ్చి మాట్లాడరు. అందుచేతనేగా నీతో మాట్లాడుతోంటే నాకు చాలా బావుందన్నాను. నిజంగా ! నీ మాటలు ఎంత తియ్యగా ఉన్నాయనుకున్నావ్ ! నీకు నేనంటే యిష్టమేనా ?"

తన హృదయంలో రేగుతున్న తుపానుని ఉగ్గబట్టుకుని "ఎందు.కిష్టం ఉండదు ? చాలా యిష్టం" అన్నది చండి గ్రుడ్లనీరు గ్రుక్కుకుంటూ గద్గద కంఠంతో—

నిస్సహాయుడైన పసిపిల్లవాడిలాగా బ్రతిమాలుతూ "వాళ్ళలాగా కొట్టవుకద ! మా సవితితల్లిలాగా కళ్ళెర్ర చేయవుకద ! నాతో ఎప్పుడూ ఇలా మాట్లాడతావా ?" అని అడిగాడు.

చండి దుఃఖాన్ని దిగమ్రింగి, "ఎందుకు మాట్లాడను ? తప్పకుండా మాట్లాడతా. మీకు సంతోషాన్ని కలిగించే ఏపని చెయ్యమన్నా చేసా' అన్నది.

వరుడు పట్టలేనంత ఉత్సాహంతో "నిజంగా! వహ్వా! అట్లా చేశావంటే భలే. ఇంకా ఏం కావాలి? నువ్వు ఇలా మాట్లాడుతుంటేచాలు, ఊరికే కూచుని వింటూ ఉంటా. నువ్వింకా యేం చెయ్యక్కర్లేదు" అన్నాడు.

చండి నవ్వు తెచ్చిపెట్టుకుని, "నాకు చాలా కథలు వచ్చు. అవన్నీ చెపుతామీకు. కాని మీరుమాత్రం నామాట ఒకటి నిలబెట్టాలి" అన్నది.

అతడు ఆమె ముఖంకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీరుకూడా అందరిలాగా చదువుకుని ప్రయోజకులవాలి." అతడి నోట మాటలేదు. విస్తుపోతూ భార్యకేసి చూస్తూ ఊరుకున్నాడు. "ఇప్పుడదంతా ఎలా సాధ్యం?" అని ప్రశ్నిస్తున్నట్లుంది - ఆచూపు.

చండి రాజకుమారి అయిన విద్యాః కథను భర్తకి చెప్పిందప్పుడు. అతడా కథని ఎంతో శ్రద్ధగా విన్నాడు. మూర్ఖుడుగా ఉండిన కాళిదాసు కఠోరసాధనవల్ల అంత మహాకవి అయినాడని విని ఉత్సాహం పట్టలేక - "వాహ్! వాహ్! వింటూంటే ఎంతో ఆనందంగా ఉంది" అన్నాడు.

చండి భర్తకేసి చూస్తూ "మీరుకూడా అలా అవాలని అనిపించటం లేదూ?" అని అడిగింది.

అతడు సంతోషముతో "నాకా? ఆఁ ఉంది. ఎవరైనా నాకుకూడా అలానేర్పి, నా బాధ్యను వహిస్తే నేనూ అలాగే చదువుకుంటాను" అన్నాడు.

మీరు తప్పక చదువుకోవాల్సిందే! మీ బాధ్యతను నేను వహిస్తాను. మీకోసం ఆ కఠోర సాధనను నేనే చేస్తాను'' అన్నది చండి దృఢ నిశ్చయంతో

పెళ్ళికొడుకు పెళ్ళి పందిట్లోకి రాగానే అతణ్ణిగురించి అవాంఛనీయమైన గుసగుసలెన్నో బయలుదేరిన సంగతీ; అక్కడ పెళ్ళికొడుకు ఒక్కమాటకూడా మాట్లాడపోయేసరికి ఆడవాళ్ళంతా పుట్టించిన వదంతులూ అన్నీ యథాతథంగా తలిదండ్రుల చెవిని పడ్డాయి. తలవని తలంపుగా తటస్థపడిన ఈసంబంధానికి వారెంతో సంతోషంతో ఉప్పొంగిపోయారు. కాని వరుడ్ని గురించి అందరూ తలోకరీతిగా వెలిబుచ్చిన అప్రియమైన అభిప్రాయాలు వారి ఆనందాన్ని చెరిపేస్తున్నాయి. కాని ఈ విషయమై హరినారాయణబాబుని ఎవ్వరూ ఏమీ అడుగలేకపోయారు. అంతే కాదు - ఆయన ఎదుట నిలబడి ఎవ్వరూ వరుణ్ణిగురించి చప్పరించటానిక్కూడా సాహసించలేకపోయారు.

పెళ్ళి అయిన మర్నాడుదయం బంధువులంతా పూజా మందిరం వసారాలో చేరారు. వరుడ్ని గురించిన సమాలోచనలు ప్రారంభమయాయి. శోభనపు గదిలోంచి చిన్నపుచ్చుకుని వెళ్ళిపోయిన వనితలుకూడా చాలామంది చేరారక్కడ. "ఓ భోగట్టా తెలుసుకోవటంలేదు. ఓ మాటా మంచీ ముందుగా అనుకోవటంలేదు. పుసుక్కున సరే అంటే

సరే అనుకుని తాంబూలాలు పుచ్చేసుకున్నారు. గొప్ప వాళ్ళయినందుకు ఏమిటి ఫలితం?'' అన్నారు సన్నగా ఒకరు.

కరాళీబాబు కఠినంగా "ఇప్పు డెందుకు వచ్చిన మాటలు ఇవన్నీ? మీరంతా చూస్తే రభస చేసేట్లున్నారే! భవితవ్యాన్ని మార్చగలిగినవా రెవరయినా ఉన్నారా ఏమన్నానా!'' అన్నాడు.

చండి సరిగ్గా ఇదే సమయానికి ప్రాతఃకృత్యాలన్నీ నిర్వర్తించుకుని అక్కడికి వచ్చింది. మాట్లాడుతున్న వారం రందరూ చటుక్కున ఆపారు. అందరి కోపపు చూపులూ చండి ముఖంమీద పడ్డాయి. కాని ఆమె ముఖంలో విన్న దనపు ఛాయ లేమీ లేవు. ఒక్క విచార రేఖయినా ఆమె ముఖంమీద విరిసి - ఆ ముఖాన్ని రవంతయినా వికృతం చేయలేదు. పైగా ఆమె ముఖం అపరిమితమైన తృప్తితో, అతి ప్రసన్నమైన చిరునవ్వుతో వెల్లివిరిసిపోతుంది. పెళ్ళయిన మర్నాడు ఏ ఆడపిల్ల మొహమూ ఇంత సుప్రసన్నంగా ఉండదు సాధారణంగా.

కూతురి స్వభావం తల్లితండ్రులకు తెలియందికాదు. వారుభయులూ చండిముఖం కేసి చూసి ప్రశాంతంగా నిట్టూర్చారు. 'శోభనపు గదిలో అనర్థక మేమీ జరిగిఉండదు' అందరూ ఇహ లాభంలేదని ఎక్కడివాళ్ళక్కడ వెళ్లిపోయినా - 'అల్లుణ్ణి అమ్మాయి తరచి తరచి ఏవో ప్రశ్నలు వేసి - అతణ్ణి చులకన చేసిఉండదు. చండికి అతడు తప్పక నచ్చిఉంటాడు. లేకపోతే చండి నవ్వు మొహంతో ఇక్కడికి వచ్చేదేకాదు' అనుకున్నారు.

అప్పుడిహ అక్కడివారంతా ప్రశ్నలవర్షం కురి పించారు. 'మీ ఆయన ఎలాంటివాడే? నోరువిప్పి మాట్లా ట్టం చేతవునా? గదిలోకివచ్చినా మత్తు వదలనట్లుంది! అయినా నీ మొహంలో ఇంత చిరునవ్వేమిటి? ఇలా ఒకటే ప్రశ్నలు; అప్రియమైన చర్చలు. వయస్సులో ఉన్నవారు, వయసు మళ్ళినవారూ ఇదే వరస...

చండి ముఖంమీాద నవ్వు అప్పటికీ ఇంకా అలాగే ఉంది. కోపంకాని, చిరాకుకాని, ఆ లక్షణా లేవీ కన్పించ లేదు. ఆమె అలా నవ్వు ముఖంతోనే ఒక్కమాటతో అందరి ప్రశ్నలకి జవాబులిచ్చింది. "భగవంతునిలో విశ్వాసం ఉంచి ఏదయితే కోరుకుంటారో - అదే ఇస్తా డాయన. నేను ఫిర్యాదు చెయ్యవలసిందేమీాలేదు. అలాం టప్పుడు ఇహ నెందుకివన్నీ ?"

కుతూహలంకొద్దీ ప్రశ్నలు వేసినవారి ముఖాలన్నీ వెలవెలపోయాయి. ఇరుగుపొరుగు ముసలమ్మలు మాత్రం విస్తుబోయి మూతులూ - ముక్కులూ విరుచుకుంటూ ఒకరి మొహాలొకరు చూసుకోవటం మొదలెట్టారు. మనకి పూర్వ పరిచితురాలైన మైత్రాగారి భార్య మాత్రం కుతూహలంతో- "వాళ్లన్నట్లు అల్లుడేమిటో అడివిలోంచి వచ్చినట్లున్నా డేమే! ఎవరితోనూ ఒక్కమాటన్నా మాట్లాడలేదుట! కిమ్మంటే ఒట్టుట!" అంది.

ఆ మాట చండి మనస్సుకి కష్టం కలిగించినా - ఆ కష్టాన్ని పైకి వెలిబుచ్చకుండా- "వాళ్ళంతా ఆయనకూడా తమలాంటి జంతువే అనుకుని అదే ధోరణిలో గొడవ

చెయ్యటం మొదలెట్టారు. నిజానికి ఆయన మనిషి కనుకనే మెదలకుండా ఊరుకున్నారు'' అన్నది కటువుగా.

"భలేదానివే నువ్వు'' అన్నదొక యువతి.

చండి నవ్వుతూ "నేనూ మెదలకుండానే ఊరుకున్నాను. నేనేం తైతక్కలాడనూలేదు, సిగ్గూ శరంలేకుండా వాగనూలేదు…'' అంది.

మరొక యువతి మూతివిరుచుకుంటూ "శోభనప్పుగదిలోకి వచ్చి ఎవరూ జపంచేసుకుంటూ కూచోరు'' అంది.

"అది నిజమే - కాని మీలాగా ఎవరూ అంత రణగొణ ధ్వని చెయ్యరు.''

మైత్రాగారి భార్య చండిమాటలకి వత్తాసిస్తూ "అది అబద్ధం కాదే! మీరంతా ఆరోజు కారోజుకి మరీ పట్టపగ్గాల్లేకుండా పగలబడిపోతున్నారు లెద్దూ! అదేం మహాగొప్ప అనుకుంటున్నారేమో! ఈవిషయంలో మాత్రం మీరంతా చండిదగ్గిర పాఠాలు నేర్చుకుంటే బావుంటుంది… "అవును కానీ, చండీ! ఇంతకి అల్లుడేమయినా మాట్లాడాడే నీతో?'' అని అడిగింది.

చండి ఏమాత్రం సంకోచించకుండా "ఏం? ఎందుకు మాట్లాడరు?'' అంది.

ఒక వయసు మళ్ళినావిడ విస్తుపోతూ - "వా! వా! విన్నారా దాని మాటలు! మాకాలంలో ఎన్నడైనా ఎరుగుదుమా ఇంత ఇది?'' అంటూ బుగ్గలు నొక్కుకుంది.

"భలే, మీరు పెళ్ళయితే చేయొచ్చుకాని, మేం మాట్లాడుకుంటేనేనా తప్పు? బాగుంది…'' అన్నది చండి.

మైత్రాగారి భార్య ముఖం చాటుచేసుకుని నవ్వి, "ఏం మాటలు మాట్లాడుకున్నారే! చెప్పు విందాం" అని అడిగింది.

ఆవిడ అలా అనడం చండికి కష్టం కలిగించింది. అయినా ఆ కష్టాన్ని వెలిగక్కకుండా, సహజమైన ధోరణిలోనే "ఈమాట నన్నడగకుండా, ఎవరి అభ్యాయో వారినే అడిగితే బావుంటుంది. దీనికింత చర్చ యెందుకు?" అన్నది.

మళ్ళీ అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం వ్యక్తమయింది. చుట్టూ ఉన్న అమ్మలక్కల మొహాల్లో అప్పటిదాకా ఉన్న ఆనందం మాయమైపోయింది. అందరి మొహాలూ చిన్నపోయినాయి. మకీదగ్గిరచుట్టాల మనస్సుల్లో అప్పటివరకు అలుముకున్న దిగుళ్ళన్నీ మాయమైనాయి.

"ఇందుకనే నేనేమీ మాట్లాడలేదు. ఎవర్నీ ఏమీ అడగలేదు. చండినోటిమీదుగా చెప్పనిదే నేనీసంగతి ఎక్కడా అనతలచుకోలేదు. ఇదంతా వొట్టి కల్పన - నిరాధారమైన సంగతని నేను చండిమొహం చూడగానే గ్రహించాను" అన్నాడు కరాలీ ఛటర్జీ.

చండి తనలో తాను నవ్వుకుంది. ఆడపిల్లలుచిన్నప్పుడే తల్లిదండ్రులను విడిచిపెట్టి మరొకరింట్లోకిపోయి పడక తప్పదు తెలివితేటలుకల ఆడపిల్లలయితే జాగ్రత్తగా ఆలోచించి, ఆచి తూచి మాట్లాడగలుగుతారు. అలాంటివాళ్లు మెట్టిన ఇంటి గౌరవాన్ని పుట్టినయింటి మర్యాదనూ కూడా కాపాడగలుగుతారు. చిన్నప్పట్నుంచీ తాతగారి దగ్గిర ఈ ఉభయ కుటుంబాల మర్యాదనూ ఎలా కాపాడాలో చండి చక్కగా నేర్చు

కుంది. దాంతోపాటు అవసరమైన లజ్జాసంకోచాలను విడనా డటం కూడా అలవాటు చేసుకుంది.

చుట్టుప్రక్కల ఉన్న చుట్టాల చిన్నబోయిన ముఖాలు కొంచెంసేపటికి తెప్పరిల్లుకున్నాయి. అప్పుడిహ క్రితం రాత్రి శోభనపు గదిలోకి వచ్చిన ముత్తైదువు లందరికీ - ఒక్కొక్క రికి ఒక్కొక్క మొహరీ చొప్పున మామగారి వద్దనుంచి పుచ్చుకుని ఇచ్చింది చండి. ఆ శోభనపు రాత్రి వారంతా మామూలుగా పొందే ఆనంద మయితే పొందలేదు; కాని ఇలాంటిదానికి ముత్తైదువులకొక్కొక్కరికి మొహరీ దక్షిణగా ఇవ్వటం మాత్రం వారెక్కడా వినను కూడా లేదు. అప్పుడిహ వాళ్ళ సంతోషం వర్ణనాతీతం!

పుట్టింటిదగ్గిర సెలవు తీసుకుని ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళబోయేముందు తల్లికి 'కనకాంజలి' నివ్వటం ఆచారం. చండి ఈ ఆచారాన్ని ధిక్కరించి అందర్నీ విస్తుబోయేట్లు చేసింది. ఒక ఇత్తడి పళ్ళెంలో బియ్యంపోసి, తాంబూలాలు, ఒక రూపాయి ఉంచి ఇది మీ అమ్మ ఒడిలో ఉంచి 'అమ్మా! నీ రుణం తీర్చుకుని వెళ్ళిపోతున్నాను' అని అనమని చెప్పారు.

ఈ సమయంలో సహజంగా - ఎడబాటు కలగబో తుంది కదా - అనే కారణాన ఏడుపు పొర్లుకొచ్చి, కన్నీళ్ళు కాల్వలు కడతాయి. చండికి కూడా కళ్ళ వెంట నీళ్లయితే వచ్చాయి కాని, పల్లెటూళ్ళలోని ఆడపిల్లల్లాగా ఆ ఏడుపుతో ప్రక్కనున్న వాళ్లని కూడా కంగారు పెట్టిందనటానికి మాత్రం వీల్లేదు. 'మాతృ రుణం తీర్చుకున్నాను' అని చెప్పటం

అనేది ఆమె చెవులకేదో ములుకు సోకినట్లు బాధించసాగింది. 'నే నామాట మాత్రం చెప్పను' అన్నది చండి.

"అదేమన్నమాటే చండీ? ఇది నియమంగా వస్తున్న ఆచారం. అలా అంటూ అవన్నీ ఆపళ్లెంతో సహా తల్లికిచ్చెయ్యాలి" అని ఒక్కరుకాదు - అందరూ అన్నారు.

చండి గద్గద కంఠంతో "మాతృరుణం ఎన్నటికయినా తీర్చుకో గలరా ఎవరైతేమాత్రం? అంత అబద్ధం చెప్పనా?" అన్నది.

అప్పటివరకూ విచారంతో నిలబడిఉన్న చండితల్లి ఈ మాటలు విని ఆనందంతో ఉప్పొంగిపోయింది. అయినా ఆమె తన ఆనందాన్ని వెలువరచకుండా - చెప్పవలసిన విధానం ఏదో ఆమే ఆదేశించింది. "వద్దులేవే అమ్మాయ్! అవన్నీ అనక్కర్లేదులే...ఆచారం ఉందిగా మరి! 'పెంచిన ఋణం తీర్చుకుని వెడుతున్నా'నని చెప్పు".

"ఈ పళ్లెముడు బియ్యం, ఆకులూ, వక్కలూ, ఓ రూపాయి—వీటితోనే నువ్వు పెంచిన ఋణం అయితేమాత్రం తీరుతుందా అమ్మా! ఇది నీకివ్వమని వారే యిచ్చారు నాకు. ఇది నీకిచ్చి, నేను నీ ఋణం ఏవిధంగానూ తీర్చుకోలేను అమ్మా!" అన్నది చండి.

"ఇలా ఆచారాన్ని ఎదిరించి మాట్లాడటం ఎక్కడా వినలేదు మేము" అని అక్కడున్న ఆడవాళ్లు పిన్నా - పెద్దా అందరూ అన్నారు.

పూజామందిరం వసారా ముంగిలిలోకి ఉభయవర్గాల ముఖ్యబంధువులందరూ ఈ లాంఛనం జరిపించటానికి వచ్చి

ఉన్నారు. చండి తన ఈ అభ్యంతరాన్ని సంకోచిస్తూ మెల్లిగా వెలిబుచ్చలేదు. అంచేత ప్రాంగణంలో ఇతర సంగతులేవో మాట్లాడుకుంటూ వున్న ముఖ్య బంధువు లందరూ చండి మాటల్ని స్పష్టంగా విన్నారు.

ఆ మాటల్లోని చురుకు తగలవలసిన చోటుకే పోయి తగిలింది. హరినారాయణబాబు సంతోషంతో "నిజమైన మాట చెప్పావు తల్లీ! అదే కావల్సింది. ఏదో పొరపాటు జరిగినప్పుడు — దాన్ని కళ్ళుమూసుకుని అంగీకరించటంకాదు కావల్సింది — ఆ పొరపాటును ఎత్తిచూపి ఖండించాల్సిందే. నిజమే. ఈ స్వల్పమైనదాంతో పెంచిన ఋణం ఎన్నడైనా తీరుతుందా? పైగా యిది వాళ్ళ గుమ్మంలోని రాతితో వాళ్ళ తలే పగలకొట్టటం లాంటిది. ఆగు అమ్మా! ఒక్క క్షణం ఆగు. దీనికి చేయతగిన విధానమేదో నేను చూస్తాను. నిజంగా నే చేసిన ఓ గొప్ప పొరపాటును పట్టేశావు అమ్మాయీ! చాలా సంతోషం" అన్నాడు.

ఇంటిల్లపాదీ ఆశ్చర్యపోయేట్లు-హరినారాయణబాబు తన తాలూకు వారిని కొందరిని పిలిచి కోడలివ్వవలసిన కన కాంజలికి తగిన ఏర్పాట్లు ఆదేశించాడు. కరాలీబాబు సవిన యంగా ఎంతో అడ్డుపడబోయాడు. కాని ఆయన ససేమిరా వినలేదు. హరినారాయణబాబు నవ్వుతూ, "కోడలి ముఖతః వచ్చిన మాట నా చెవినిపడింది బావగారూ! దాన్ని కాదనటానికి మనకెవరికి తాహతులేదు. ఈ విషయంలో ఇహ మీరు ఎన్ని అడ్డంకులు చెప్పినా లాభంలేదు. మీ రింత సంకోచపడటానికి ఏముం దిందులో? మీ అంతట మీరు

మీ అల్లుడికి పళ్ళెంనిండా రూపాయలుపోసి, ఇంకా ఎన్నో వస్తువులతోపాటు కట్నంగా ఇచ్చారు. వాటిల్లో ఒక్కటైనా నేను వద్దన్నానా? అలాంటప్పుడు మా కోడలు తన తల్లి యదార్థమైన 'కనకాంజలి' ఇవ్వతలచుకొన్నప్పుడు మీ రెందుకు స్వీకరించకూడదో చెప్పండి" అన్నాడు.

హరినారాయణబాబు ఇంత యుక్తియుక్తంగా మాట్లాడిన మీదట దాన్ని కాదనటానికి ఎవరూ సాహసించలేక పోయారు.

కనుక చండి మామగారిచ్చిన అయిదువందల నవర్ణలూ పళ్ళెంనిండాపోసి, తల్లి నుద్దేశించి యథార్థమైన కనకాంజలి ఇస్తూ - "పెంచిన ఋణంమాత్రం ఎలాగో తీర్చుకుని సెలవు తీసుకుంటున్నానమ్మా!" అన్నది.

ఇలా అంటూంటే చండి గొంతు బొంగురుపోయింది. కట్ట తెగిన ప్రవాహంలా కన్నీళ్లు ప్రవహించసాగాయి. ఆ సమయంలో అందరికి కన్నీళ్లొచ్చాయి. ఆడపిల్ల అత్తవారింటికెళ్లే దృశ్యం ఈ దేశంలో ఎక్కడైనా హృదయానికి బాధ కలిగించేదిగానే ఉంటుంది.

# 8

పూజామందిరం ప్రక్క పందిట్లో పెళ్ళివారి కందరికీ వీడ్కోలిస్తున్నారక్కడ. అక్కడ వీథిలో అప్పుడే బ్రహ్మాండమైన ఊరేగింపుకు ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. రకరకాల వాయిద్యాలు, బాజా భజంత్రీలు, బళ్లు - అన్నీ ఇహ బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నాయి. ఈ ప్రాంతాల్లో

ఇంత పెద్ద ఊరేగింపు ఇదివరకెవరూ చూసి యెరుగరు. ఎక్కడా చడీచప్పుడు లేకుండా మొదట్లో మగపెళ్ళివారు నిరాడంబరంగా పందిట్లోకి ప్రవేశించటం చూసి చాలమంది నిరుత్సాహపడ్డారు. అలాంటివారంతా, పెళ్ళివారు తిరిగి వెళ్ళబోయేముందు ఇంత ఊరేగింపుకు యేర్పాట్లు చేసుకోవటం చూసి తెల్లబోయారు.

కనకాంజలిచ్చి, వధువు బయటికి రాగానే హరినారాయణబాబు వియ్యంకుణ్ణి ఉద్దేశించి – "ప్రధానం చేసుకోడానికి వచ్చినరోజునే మన అమ్మాయి నాకు వాగ్బంధం చేసేసింది. తయారయిన విద్యామందిరం చూసి అమ్మాయి సంతోషించినప్పుడే నాకూ సంతృప్తి – విముక్తీ, కనుక ఇప్పుడే ఇక్కడున్నవారంతా – అక్కడికి దయచేసి తమ పాద ధూళి అక్కడ పడేట్లు చేయాలి. ఈ ఊరేగింపుకు చాలా విశేషమైన ఏర్పాట్లుకూడా చేయించాం" అన్నారు.

దీనికి మొదట్లో ఆడపెళ్ళివారు ఓ అభ్యంతరం లేవ తీసినా అది అట్టేసేపు నిలవలేదు. "మేము మిమ్మల్నందర్నీ బలవంతంచేసి సరాసరి మా బాళులీ గ్రామానికేమీ తీసుకు వెళ్ళటంలేదు. మీ అమ్మాయి కావాలని కోరిన విద్యా మందిరం ప్రారంభోత్సవం చూసిరావటానికి అభ్యంతరం ఏమిటి?" అన్నాడు హరినారాయణబాబు.

చివరి కింక ఏ అభ్యంతరమూ నిలవలేదు. ఆడపెళ్ళి వారి తరఫు మగవాళ్లు, ఆడవాళ్ళందరూ తమకు ఏర్పాటు చేసిన అందమైన బళ్లుయెక్కి బయలుదేరారు. చండి తల్లి ఒక్కతె మాత్రం ఇంట్లో ఉండిపోయింది. కూతుర్ని చేతు

ల్లోంచి కనకాంజలిని స్వీకరించాక తల్లి మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా లోపలికి వెళ్ళిపోవాలి. అది సంప్రదాయం. ఈ సంప్రదాయం తెలిసినవాడవటంవల్ల, వియ్యంకుడు తర్వాత ఆమె నేమీ బలవంత పెట్టలేదు.

ఇక్కడిలా బ్రహ్మాండంగా ఊరేగింపు బయలుదేరింది. అక్కడ విద్యాలయందగ్గిర ఊళ్ళో పెద్దలందరూ సమావేశ మయారు. ఆ పల్లీయులకు నిజానికి పెళ్ళిమీదకన్న విద్యాలయం మీదనే ఆసక్తి హెచ్చు. ఒక్క పదిహేను రోజుల్లో ఈ ఊసర ప్రదేశంలో ఇంత పెద్ద భవనాన్ని నిర్మించడం ఈ జమీందారుకి ఎలా సాధ్యమయిందో! హరినారాయణ గంగూలీ అనుకున్న నాటికి తన వాగ్దానం ఎలా చెల్లించుకో గలిగాడో! ఈ జమీందారు అసాధ్యములైన పనులన్నింటినీ అవలీలగా చేసి పారేస్తాడని ఇదివరకుదాకా కథలు చెప్పుకోవటం మాత్రమే విని ఉన్నారు ప్రజలు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూసి, తాము విన్నదానికి ఇప్పుడు చూస్తున్నదానికి నిజంగానే తేడా యేమీలేదు అని - ఆ ఊళ్ళోవాళ్ళే కాదు, చుట్టుపక్కల పది ఊళ్ళలో వాళ్లుకూడా ఆశ్చర్యంగా చెప్పుకోవటం మొదలెట్టారు. కనుకనే అందరూ ఈ ప్రారంభోత్సవ శుభదినంకోసం ఎదురుచూస్తున్నారు. ఈ సమావేశం జరిగేచోట నాలుగువైపులా - ఈ భవనం ఏ పద్ధతిలో కట్టినదీ ఎవరికీ ముందుగా తెలియకుండా పరదాపట్టా కట్టించారు. దాంతో ప్రజలకి మరింత తహతహ జాస్తి అయింది.

కొన్ని స్వదేశీ-విదేశీ వాద్యాలతో ఊరును మార్మో గింప చేస్తూ ఊరేగింపు విద్యాలయం ముందుకు రాగానే

ఒక్కసారిగా కొన్ని ఫిరంగులు మ్రోగినట్లు ధ్వనులు వినిపించాయి. ఆ ధ్వనులు వినిపించటంతోపాటు ఆ భవనానికి చుట్టూ కట్టిఉంచిన తెరలన్నీ - నాటకరంగంమీద తెర దానంతటది తొలగినట్లు - ప్రక్కకు తొలగిపోయాయి. ప్రతిభావంతులైన శిల్పు లెందరో కలిసి శ్రద్ధగా అందంగా తయారుచేసిన ఆ విద్యామందిరం కుతూహలులై ఉన్న ప్రజల చూపుల్ని ఆకర్షించింది.

రెండు వారాల క్రితంవరకూ పశువులు పొర్లాడుతూ పాడుపడ్డట్లు ఉండే దీ ప్రదేశం. అక్క డిప్పుడో దివ్యభవనం కళ్ళకు మిరుమిట్లు కొల్పుతూంటే—కట్టుకథల్లోలాగా ఇదేదైనా గారడీమూలంగా నిర్మితమయిందేమో అని అనిపించ సాగింది. ఆ విద్యాలయం లోపలికి ప్రవేశించటానికి అంత వెడల్పునా విశాలమైన మెట్లున్నాయి. ఆ మెట్లకి రెండు వైపులా రెండు పెద్ద పెద్ద వరండా లున్నాయి. ఆ మెట్లకి ఎగువన ఆర్చిల కడ్డంగా 'వెల్వెట్ క్లాత్ కర్టెన్' వేసి ఉంది. ఆ ఆర్చికి అటూ ఇటూ ఉండే సిమెంట్ స్తంభాలమీద 'శ్రీ చండీ విద్యామందిరం' అని అక్షరాలు చెక్కిఉన్నాయి.

ఊరేగింపు మందిరం దగ్గరకురాగానే హరినారాయణ బాబు ముందుకువచ్చి - వధూవరులను, కొంతమంది వధువు తాలూకు ముఖ్యబంధువులను వెంటతీసుకొని మెట్లెక్కి ఆ 'వెల్వెట్ కర్టెన్' దగ్గిరకొచ్చి ఆగాడు. ప్రాంగణమంతా ప్రజలతో కిటకిటలాడిపోతోంది.

హరినారాయణబాబు వధువు కేసి చూసి నవ్వుతూ— "నువ్వు చేత్తో స్పృశించందే ఈ పరదా తొలగదమ్మాయీ!

ఆ పరదాని నువ్వే తొలగించి నీ విద్యామందిరంలోకి ముందు నువ్వే ప్రవేశించాలి" అన్నాడు.

చండికి శరీరమంతా గగుర్పొడిచింది. పమిటకొంగు నడుముకు బిగించి, ఆ పెద్ద పెద్ద పరదాలను తొలగించ సాగింది.

హరినారాయణబాబు నవ్వుతూ "మాతల్లి మమ్మల్ని తనవెంట తీసుకెళ్ళేట్లు లేదు. ముందూ వెనకా చూడకుండానే పరదాలు తప్పించేస్తోంది. భేష్ అదే కావలసింది. నువ్వు ఓ సారి స్పృశిస్తే చాలుతల్లీ, ఇంక నువ్వు ఇవతలికి వచ్చెయ్" అన్నాడు.

మరుక్షణంలో పరదాలు ప్రక్కకి తొలగిపోగానే ఆ విద్యామందిరం ముందరి హాలు అందరి చూపుల్ని జిగేల్ మనిపించింది.

ఇలాంటి భవనాలు ఈ ప్రాంతాల్లో అసలు లేక పోలేదు. కాని ఇంత అందంగా ఇంత నవీన పద్ధతులలో ఉన్నదిమాత్రం ఇదే. హాలంతా పూలతోరణాలతో చిత్ర పటాలతో చక్కగా అలంకరింపబడి ఉంది. దానికి మూడు వైపులా మూడు పెద్ద పెద్ద గదు లున్నాయి. ప్రతిగదిలోనూ పాలిష్‌చేయబడ్డ చక్కని బల్లలు వరుసగా అమర్చి ఉన్నాయి. వాటికి ఎదురుగా ఉపాధ్యాయులకు మేజాలూ కుర్చీలూ వేసి ఉన్నాయి. గోడకి ఒక బ్లాక్ బోర్డు, భారతదేశం మ్యాపూ ఉన్నాయి. హాల్లోకి ప్రవేశించగానే అటూ ఇటూ ఉన్న గదులు రెండూ మరోకవిధంగా అలంకరింపబడి ఉన్నాయి. ఒకగదిలో ఆఫీసుకి అవసరమైన సరంజామా, బీరువాలనిండా

కాయితాలూ, పెన్సిళ్లూ, పలకలూ, విద్యాసాగర వాచకాలూ, ఒకప్రక్కన రాట్నాలూ—ఏకులూ కావలసినన్ని ఉన్నాయి. రెండో గదినిండా ఒఠ్ఠి బీరువాలు మాత్రమే ఉన్నాయి. వాటిల్లోకి పుస్తకాలు ఇంకా తెప్పించలేదు.

చండి ముందు లోపల ప్రవేశించగానే ఆమె వెనుక అందరూ హాల్లోకి ప్రవేశించారు. హరినారాయణబాబు మెల్లిగా చండిని అనుగమిస్తూ "నీ యీ పాఠశాలకి 'చండీ విద్యామందిరం' అని పేరు పెట్టించాను తెలుసా అమ్మా! ఎలా వుంది పేరు? సరియైన పేరే పెట్టాను కదూ?" అని అడిగాడు.

ఆ మాటనగానే చండి ముఖంలో ఎంతో సంతృప్తి కన్పడింది. అతడది గమనించి, "చూడు తల్లీ! లోకుల దృష్టికి మానవు డెంత దుర్బలుడుగానూ, తీసికట్టుగానూ కన్పించినా, అతడి పేరు నిర్మలమైనదీ శక్తివంతమైనదీ అయి ఉండాలి. అలా అయితే భగవంతుణ్ణి ఉద్దేశించి ఆ వ్యక్తి చేసే ప్రార్థన ఎన్నడూ వ్యర్థంకాదు. ఆ భగవంతుని ప్రేరణ వల్లనే అవసరమైన వ్యక్తులు పరుగెత్తుకు వచ్చి, అతడి పనులన్నీ నిర్వర్తించిపెట్టి పోతారు. నువ్వు స్వార్థంకోసం భగవంతుని మోాల ఏమీ అర్థించలేదు. దేశదౌర్భాగ్యం తొలగిపోయే మార్గం ఏమిటా అని నీ కోమలహృదయం తల్లడిల్లిపోయి నువ్వు కంట తడిపెట్టుకుంటూంటే భగవంతుడు మాత్రం స్థిమితంగా కూర్చోగలడా తల్లీ! ఈ పాఠశాలా ప్రతిష్ఠాపనకి గంభీరమైన మానసిక సాధనే హేతువు. నువ్వు నిజంగా 'స్వయంసిద్ధ' వి తల్లీ" అన్నాడు.

వివాహమై చండి అత్తవారింటికి వస్తూనే, అంతఃపురానికి సర్వాధికారిణియైన రాణీ మాధురీదేవి మనస్సుకు కలత కలిగించింది.

శోభనంనాటి రాత్రి అమాయకుడైన భర్త ముఖతః విన్న సంగతుల ననుసరించి, అత్తవారింట్లో తా నెలా మెలగాలో ముందుగానే ఓ నిర్ణయానికి వచ్చేసింది. భగవంతుడు తనని ప్రతిద్వంద్వులతో యుద్ధం చెయ్యటానికే సృష్టించాడా అనిపించిందామెకి. శ్యామాపురానికి వచ్చినప్పట్నుంచీ తానేమే అన్యాయాలకు అకృత్యాలకు అడ్డుపడిందో, వాటికన్నిటికీ ప్రతిఫలంగా ఎన్నోరకాల నిందలని భరించాల్సి వచ్చింది. అయితే యేం, వాటిని యేమీ లక్ష్యపెట్టలేదు. ఆనాటి రాత్రి భర్త చెప్పగా తాను విన్న గాధనుబట్టి, ఎంత పెద్ద ఆపద, విప్లవం, ఎన్నిరకాల తగాదాలు కలిసికట్టుగా రానున్నాయో గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదామెకి. భర్తకి ఆ యింట్లో ఏమాత్రం గౌరవం లేదు, ఆదరణ అంతకన్నా లేదు. ప్రతిష్ట అనేది అసలే సున్న... తానా పేద యింటిపిల్ల-అలాంటి అమాయకుడికి సహధర్మచారిణిగా ఎలా మసలుకోవటం? తన ఆత్మగౌరవానికి భంగం కలగదని మాత్రం ఎవరు చెప్పగలరు? ఇవన్నీ బాగా ఆలోచించుకుని, ముందుగానే ఓ నిర్ణయాన్ని తీసుకుని ఈ శౌశులీ జమీందారుల ప్రాసాదంలో అడుగుపెట్టింది చండి.

కాని ఆ యింట్లో మాధురీదేవిది మా చెడ్డ ప్రతాపం! ఆమె మాటకి తిరుగులేదు. ఆ యింటి యజమాని—తన

గుమాస్తాలూ—నౌకర్లూ అయ్యా అని పిలిస్తేనే తృప్తిపడే రకం. అంతేకాని వారిచేత రాజాగారనీ, జమీందారనీ పిలిపించుకోవటం అతడికి ఇష్టం ఉండేదికాదు. కాని 'రాజా' అని బిరుదుగల జమీందారు కూతురైన మాధురీదేవి, భర్త అలా పిలిపించుకోవటం అతడి ప్రతిష్ఠకు భంగం అన్నట్లు మధ్య మధ్య హెచ్చరిస్తూ ఉంటుంది. అతడి ఈ పొరపాటును తాను సర్దుబాటు చేస్తున్నట్లు వ్యవహరిస్తూ ఉంటుంది. తానీ యింట్లోకి వచ్చి ఈ సంసారనావ చుక్కానీని చేతపట్టుకునే రోజునే - పుట్టింటిదగ్గర తాను రాజకుమార్తెగానే ఉన్నానని, ఇక్కడికి వచ్చి రాణీ అయినానని - ఆశ్రితుల్ని, నౌకర్లనీ అందర్నీ పిలిచి చెప్పింది. అంచేత భర్త మినహా అందరూ ఆమెని రాణిగారనే పిలుస్తూంటారు. తల్లి ప్రతిష్ట కొడుక్కీ-దక్కింది. ఆమె ఆదేశం ప్రకారం-ఆమె కొడుకు నివారణుని అందరూ యువరాజాగారనే పిలుస్తూ ఉంటారు.

గోవిందుడి వివాహం రాణీ కంత యిష్టంలేదు. అయినా ఆమె ఒకరకంగా మనస్సును సమాధానపరచుకుంది. పేదవాళ్ళ యింటి పిల్లకనుక, ఇక్కడికిరాగానే ఈ ఐశ్వర్యం ఇదంతా చూసి నోరు నొక్కుకునే పడివుంటుంది. అలాంటి దాన్ని తన దాసిగా, ఆ మాటకొస్తే క్రీత దాసిగా చేసుకోవటంకూడా ఏమంత కష్టంకాదు. అంచేతనే మనస్సులోని మాలిన్యాన్ని బయటపెట్టుకోకుండా పైకి ఉత్సాహాన్ని వెలిబుచ్చింది. ఆనందాన్ని వ్యక్తపరిచింది. కాని అందులో కూడా దీర్ఘంగా నిట్టూరుస్తూ 'పిల్లవాడు వెర్రిబాగులవాడు కదా అని ఏదో పేదపిల్లని తెచ్చి కట్టాల్సి వచ్చింది. పైగా

ఆ పిల్లకొంచెం తలతిక్కవున్న పిల్లటకూడా. ఈ యింట్లో కలిసిపోతుందనే ఆశ లేదు. వాడి కది చివరకి గుదిబండ అవుతుందేమో!' అని మధ్యమధ్య తన విచారాన్ని నటించేది. అంతఃపురంలో పరిచారికలదగ్గర్నుంచి అందరూ అత్తాకోడళ్లు కలుసుకోగానే, ఆ కోడలి అదృష్టం ఎలా పరిణమిస్తుందో అన్న భయంతో నిట్టూర్చ సాగారు.

జంకూ గొంకూ అనేది లేక - ఎంతో ప్రతిభావంతురాలిగా కనిపించే చండి ముఖాన్ని తొలిసారిగా చూచినప్పుడే మాధురీదేవి మనస్సులో రవంత సంశయం బయలుదేరింది. క్రొత్తకోడలికి సహజంగా ఉండే అపరిమితమైన సిగ్గునీ, బెరుకుతనాన్ని దులిపేసుకుని చండి సింహద్వారం దగ్గిర మేనా దిగింది. ద్వారంలో అడుగు పెట్టగానే వారి ఐశ్వర్యాన్ని సూచించే వస్తువులు అక్కడ చాలా విరజిమ్మిఉన్నట్లు కన్పిస్తాయి. కాని ఈ పేదపిల్ల దృష్టిని అవేమీ ఆకర్షించలేదన్న సంగతిని రాణి ఒక కంట కనిపెడుతూనే వుంది. పైగా చండి ముఖం గాంభీర్యంతో గర్వంతో తొణుకుతున్నట్లుంది. మాధురీదేవి సంప్రదాయం ప్రకారం వధువుకి ఎర్రనీళ్ళు దిగతుడవగానే చండి - ఆమెకి భక్తి శ్రద్ధలతో పాదాభివందనం చేసింది. అక్కడ చేరిన ముత్తైదువులకందరికీ చేతులు జోడించి నమస్కరిస్తూ ఆచారం ప్రకారం అక్కడ పరిచిన ఆస్తరణాల మీదినుంచి నిస్సంకోచంగా లోపలికి వెళ్ళసాగింది. మామూలు ప్రకారం ఆసరాయిస్తూ ఎవరూ ఆమెను లోపలికి నడిపించుకు వెళ్ళవలసిన అవసరం రాలేదు. ఇతరు లెవరూ గమనించలేదుగాని, ఇతరు లెవరూ కనిపెట్టకుండా - జడభరతుడు

లాంటి భర్తను చండి తనతోపాటు చురుకుగా నడిపించి, తీసుకెళ్ళడం మాధురీదేవి మాత్రం కనిపెట్టింది. ఆమె అప్పుడే విస్తుపోయింది. 'ప్రస్తుతం ఈవంశానికి పెద్దకోడలిగా తనకుండే అధికారాలన్నిటిని ముందుగానే ఆయత్తం చేసుకుని, వెనుకటి పద్ధతులన్నీ తుడిచేసి, మహిమాన్వితమైన మహారాణిలాగా వస్తున్నట్లుందే ఈ పిల్ల! తన రాజ్యాధికారాన్ని లాక్కోటానికా?' అనికూడా అనిపించిం దామెకి. తనూ తొలిసారిగా ఈయింట్లోకి ఇంతకన్న అహంకారంతో అడుగుపెట్టిన సంగతి రాణికి గుర్తొచ్చింది.

ఇంక మామూలుగా జరుగవలసిన లాంఛనాల బాధ్యతంతా పరిజనుల కప్పగించి మాధురీదేవి తన గదిలోకి పోయి పడుకుంది. పరిచారికలు వెంటపడపోతే వారిని వెనక్కిపంపేసింది. తలగడలో తలదూర్చి నిర్జీవురాలిగా చాలాసేపు పడుకుంది. తనకి తెలియకుండానే తన కన్నీళ్లతో తలగడా అంతా తడిసిపోయేసరికి కంగారుగా లేచి కూచుంది. పైట చెంగుతో కన్నీళ్ళు తుడుచుకొని, "ఛి, ఛి, ఇదేమిటి? వేలెడింత ఉందోలేదో ఆపిల్లని ప్రతిద్వంది నిగా భావించి,ఏడుస్తూ కూర్చోవటమేమిటి నేను?" అనుకుంది మనస్సులో, బలవంతాన లేచి వచ్చి బయటవరండాలో నుంచుంది. అక్కడ నుంచుంటే కన్పించే ఈవివాహమహోత్సవంతాలూకు అలంకరణంతా ఆమెదృష్టికి పొగ క్రమ్మినట్లు కన్పించసాగింది. ఆమెలో ఆమెకే ప్రశ్న ఉదయించింది. ఎవరిదీ తప్పు? ఇదేం ప్రతీకారం?

కాస్సేపు ఆ వరండాలో అటూ ఇటూ పచారుచేసి, మళ్ళీ ఒకచోటుకి వచ్చి నుంచుంది రాణి. "అసాధ్యమైన ప్రతిన పట్టాననా నాకీ పరాజయం! నిజానికి వధువు నివారణుని ప్రక్క నిలబడవలసిందికదూ ఇవాళ!" వెంటనే భర్త అన్నమాటలు అశరీర వాక్కుల్లా ఆమె చెవులకి సోకాయి; 'ఈ రాదారి పడవను లాక్కుపోగలదనే స్టీంలాంచికి జతపరచడం'... రాణి హృదయం కళవళపడసాగింది. ఇంతవేగం గల ఈ స్టీంలాంచి సహాయంతో గంగూలీ వంశంలోని ఆ అయోమయపు గాడిద ఈ జమీందారీగద్దె నెక్కడానికి మెల్లి మెల్లిగా ముందుకు పోతున్నట్లు ఆమె భావనాదృష్టికి కన్పించసాగింది. మాధురీదేవి కంపించిపోతూ అరచేతుల్లో ముఖం దాచుకుంది.

మరుక్షణంలోనే "అమ్మా! విన్నావా, క్రొత్తకోడలి పొగరుమోతు మాటలు!" అని నివారణు డొచ్చి అడగటం చెవిని పడింది.

తనమనస్సులోని వేదనను అణచుకొని, ఆమె ఉలిక్కిపడి, కొడుకుకేసి తేరిపార చూసింది. కొడుకు ముఖం యింత వెలవెలపోవటం ఆమె యెన్నడూ చూడలేదు. ఆమెకి నోట మాట పెగిలిరాలేదు - కాని ఆమె చూపులుమాత్రం ప్రశ్నిస్తున్నట్లే ఉన్నాయి.

"ప్రధానం రోజున, నాన్నగారు రోక కొరడా ఆమెకి కానుకగా యిస్తూ, దీంతో ఓ గాడిదను లొంగదీసుకోవాలి అని చెప్పారుట! ఆ గాడిదను నేనే నని, నా కోసమే తాను

చూస్తున్నానని, అందరిముందు అనేసింది ” అని నివారణుడు తల్లితో ఫిర్యాదు చేసుకొన్నాడు.

మాధురీదేవి తన మనస్సులోని భావాన్ని బయట పడనీకుండా పైకి నవ్వుతూ “ ఇవాల్టి రోజున అనే మాటలన్నీ పట్టించుకుంటార్రా పిచ్చివాడా ? నువ్వు మరిదివిగనుక వేళాకోళమాడివుంటుంది ” అన్నది.

“నా కీ వేళాకోళాలూ అవీ తెలియవు. అది వొట్టి వేళాకోళం కాదసలు, ఎంత అహంకారంతో గర్వంతో అన్న దనుకున్నావ్ ? నేను ముందుగానే చెపుతున్నాను. ఆవిడకి గర్వభంగం చేయకపోతే నేను యువరాజునే కాదు” అన్నాడు నివారణుడు కోపంతో.

మాధురీదేవి తెల్లబోయి స్థాణువులా అలాగే కూచుంది. గుడ్లు అప్పగించి చూస్తూ నివారణుడ్ని వెనక్కి పిలిచి, అతడ్ని సమాధానపరచి పంపటానికి గొంతు పెగిలి మాట రానేరాలే దామెకి.

## 10

వధువుకి వ్యతిరేకంగా నివారణుడు రాణివద్ద ఫిర్యాదు చేసి వెళ్ళిపోయాడు. అంతే కాదు ఆమె చేసినదానికి తగిన శాస్తి చేస్తాననికూడా సగర్వంగా చెప్పి వెళ్లాడు. ఆ అప్రీతికరమైన విషయంలో తానెంతవరకు అపరాధో - ఆసంగతి పైకి చెప్పకుండా అతడు కప్పిపుచ్చినట్లే ప్రత్యక్షంగా చూసిన వారుకూడా యువరాజుగారి నేరం విషయమై ఏమీ నోరెత్త లేదు. కొంచెం ధైర్యస్థులు ఏదైనాసరే నిర్మొగమా

టంగా చెప్పగలరు. అని పేరున్నవారు ఇచ్చిన సాక్ష్యం మాత్రం ఇలా ఉంది. "ముందుగా యువరాజుగారు ఏదో కాస్త తొందరపడి నోరు జారారే అనుకోండి, అయితే మాత్రం వేళాకోళం అనే పేరుతో కోడళ్ళు చటుక్కున అంతమాట అనెయ్యటం మాత్రం ఏంబావుంటుంది ? వెయ్యి చెప్పండి లక్ష చెప్పండి. ఏమయినా ఆమె పేదయింటి పిల్ల. అందులోనూ క్రొత్త పెళ్ళికూతురు. అత డంటారూ ఆ యింటి మగబిడ్డ. అందులోనూ యువరాజు కదా !"

అసలింతకీ జరిగిన సంగతి యిది : పేరంటం వ్యవహారా లన్నీ ఇంచుమించు అయిపోతున్న సమయంలో అక్కడ చేరిన ఆడవాళ్ళలో కలవరం పుట్టింది. అక్కడికి అతి ముఖ్యుడైన పురుషు డెవరో వస్తున్నాడని తెలిసింది. అతడి పేరు వింటేనే ఆడవాళ్ళ కందరికీ అతి-చెడ్డసిగ్గు. "యువరాజుగారట ! యువరాజుగారు !" అంటూ అందరూ చెవులు కొరుక్కోసాగారు. ఇప్పటివరకూ మేలిముసుగులు లేకుండా స్వేచ్ఛగా ఆ ఆనందంలో మునిగిఉన్న వారందరూ వచ్చిన వ్యక్తి ఫలానా అతడని తెలిసేసరికి, కంగారు పడుతూ అవగుంఠనాలు మళ్ళీ సరిచేసుకొని ముఖాలు దాచుకున్నారు.

వధువు యింతవరకూ తల వంచుకొని అక్కడ జరుగుతున్న తంతులో లీనమై వుంది. పాముపేరు చెబితే ఎలా అదిరిపడతారో యువరాజు పేరు వినేసరికి చండికూడా అలాగే ఉలిక్కిపడి, ద్వారం కేసి తీవ్రంగా చూస్తూ కూచుంది. ఆ రోజున భర్త చెప్పినమాటలు ఆమె యింకా మరిచిపోలేదు. "అలా చెబితే ఇంకేమైనా ఉందా, చిన్న జమీందారు

వచ్చి వీపు తోట ఒలవడే! ఒక్కొక్కరోజున కొట్టాడంటే''
ఇప్పుడా వ్యక్తే తన ఎదుటికి రాబోతున్నాడు.

ముఖవైఖరిలో, నడకలో — ఒకవిధంగా అన్నమాటే
మిటి? అన్ని విధాలా తన అభిజాత్యాన్ని వెల్లడిచేసుకుంటూ
నివారణుడా హాల్లోకి వచ్చాడు. అక్కడున్న స్త్రీలంతా
హడావిడిగా అవగుంఠనాలు సరిచేసుకోవటం అతడి కంట
పడింది. అతడు అతి మొరటుగా "నే నేం పెద్దపులి ననుకు
న్నారా యేం? నన్ను చూడగానే అంతభయంతో ముడు
చుకుపోతా రెందుకు?'' అన్నాడు.

ఇంకాకూడా ఏదో అనబోయాడు నివారణుడు. కాని
సరిగ్గా అదేసమయానికి నవవధువు విశాలనేత్రాల్లోని తీక్ష్ణ
దృష్టి - విచిత్రమైన అతడి చూపులతో తారసిల్లింది. విచి
త్రమైన చూపు అనటంలో అర్థం లేకపోలేదు. నివారణుడి
కనుగ్రుడ్లు పిల్లిగ్రుడ్లులాగా విచిత్రంగా ఉంటాయి. ఈ అంద
మైన యువకుడి ఆకృతిలో అవలక్షణమనుకున్నా, ప్రత్యేకత
అనుకున్నా అదే.

తమ జమీందారీలోని ఓ సామాన్య గృహస్థుని
కూతురు ఈ వంశానికి కోడలనే గౌరవాన్ని పొందగలిగింది.
కాని తమ వంశానికి కళంకం లాంటివాడు - మతిలేనివాడూ
అయిన తన అన్నతో ఈమెకి జత ఎలా కుదుముతుందా అని
ఆలోచన వచ్చేసరికి అతడిలోని కుతూహలము, కొంటె
తనమూ అన్నీ ఒక్కసారి ఈ ఆడవాళ్ళందరి యెదటా పైకి
ఉబికాయి. తాను అక్కడికి రాగానే వధువుచూపులు, తన
చూపులు తారసిల్లుతాయని గాని, ఆమె నిస్సంకోచంగా

మేలిముసుగును పక్కకి తొలగించుకొని తనకేసి తేరిపార చూస్తుందని గాని అసలతడి ఊహాకు తట్టనే లేదు. సంకోచ రహితమైన ఆమె తీక్షణదృష్టి, ఆ సుందరమైన ముఖం సర్వావయవాల్లోనూ అనవద్యమైన ఆ లాలిత్యం చూచేసరికి నివారణుడి బుర్రంతా పురుగులు తొలిచినట్లు అయింది. ఒక్క క్షణం వధువు ముఖంకేసి రెప్ప వాల్చకుండా చూసి, ''ఏమయినా మా పిచ్చాడికి మంచి పెళ్ళామే దొరికింది. కోతి తల కాయికి బంగారుకుచ్చుల కుళాయి తొడిగినట్లే ఉంది సుమా!'' అన్నాడు వెటకారంగా.

పరాయి ఇల్లు, పరిచయం లేనిచోటు, పక్కనెవరూ ఆత్మీయులైనా లేరు... తాను ఇలాంటి నిస్సహాయ స్థితిలో ఉన్నానన్న సంగతికూడా చండి ఆ క్షణంలో మర్చిపోయింది. నిష్టురుడూ, కుత్సితుడూ అని తాను ఇన్నాళ్ళనుంచి అనుకుంటున్న వ్యక్తి యిప్పుడు ప్రత్యక్షంగా ఎదుట పడేసరికి అతడ్ని చూడటానికి ఆమెకళ్ళు రెపరెప లాడాయి. కాని ఒక రెప్పపాటులోనే అతడు అనాగరికుడులా తనను అఘాతపరచ గలడన్న ఆలోచనమాత్రం ఆమెకి రాలేదు. ఉత్తేజముతో ఆమె సర్వావయవాలు, కండరాలూ ఉబికి ఎర్రబడ్డాయి. ఆమె హృదయంలో రగులుతున్న జ్వాల కళ్ళలో ప్రస్ఫుటంగా సాగింది. ఆ ఉజ్జ్వల దృష్టి భర్త ముఖంమీదికి ప్రసరించగానే ఆమె నిలువెల్లా వణికి పోయింది. భర్తముఖం కాలిన కాగితంలా వివర్ణమైపోయింది. గజగజ లాడిపోతున్నాడతడు. అతడినోట మాటలేదు. అతడి కాతర దృష్టిలో ఏదో ముప్పు మాత్రం ముందుకు దూకుతున్నట్లుంది.

భర్త చూపులతో తన చూపులు కలియగానే చండి దీర్ఘంగా నిట్టూర్చి, తన ఉద్రిక్త ముఖాన్ని కిందికి వంచు కుంది. తల క్రిందికి వంచుకుంటూనే అవగుంఠనాన్నికూడా ముందుకు లాక్కుంది.

నివారణుని మేనమామకూతురు మృణాళిని వధూవరు లకు దగ్గరగానే కూర్చునివుంది. ఆమె పదిహేడేళ్ళ పడుచు. చక్కదనాల కుప్పేకాకుండా చదువుకున్న భామ. బస్తీ బడాయి, అభిజాత్యం తాలూకు అహంకారం, ఆమెలో అడుగడుగునా వ్యక్తమవుతూ ఉంటాయి. రాజా అనే బిరుదం ఉన్నాయన మనుమరా లసలామె. కాబోయే భర్త కూడా మరెవరోకాదు. విఖ్యాతుడయిన ఓ బారిష్టరుకొడుకు. అతడుకూడా విదేశాలకు పోయి బారిష్టరీ చదువుతున్నాడు.

ఇలాంటి పల్లెటిదిక్కు నుండే స్త్రీలల్లో ఆమె స్థానం ఆరడుగులెత్తున ఉండటం అసహజం కాదు. ఆమె ఎవరితో పడితే వారితో అతిగా మాట్లాడదు. ఆత్మ మర్యా దను కాపాడుకోవటంలో అప్రమత్తురాలయే ఉంటుంది. మాధురీదేవి కీ మేనకోడలంటే ఆంతర్యంలో చాలా అపేక్ష. 'శ్రీమంతుల బిడ్డలకి అభిజాత్యపు అహంకారం మరింత అందాన్ని చేకూరుస్తుం' దంటుంది ఆమె. విదేశాలనుంచి భర్త వచ్చేంతవరకు చక్కనిచుక్క అయిన మేనకోడల్ని రాణిగారు తనదగ్గిరే ఉంచుకో తలచుకుంది.

వధువు చటుక్కున అవగుంఠనాన్ని సవరించుకోవటం చూసి ముఖం పక్కకితిప్పి నవ్వుకుని, "మాబావ ఒక్కమాటతో ఆవిడ్ని సిగ్గుతో ముడుచుకు పోయేట్లు చేశాడే!" అంది.

నివారణుడు వధువు కేసి వంకరచూపు చూసి, "మన మేం చెయ్యగలము ఆవిడ సాహసం ముందు ?... కాని చివరి కలాంటి ఆవిడకూడా మూరెడుముసుగు ముందుకు లాక్కొని మిగతా వాళ్ళతో కలిసిపోయింది. అదీ చిత్రం! అలాకన్ను గిలికి చూశాక ఇంక ఆ సిగ్గు నప్పదు. దాన్ని వదిలించా ల్సిందే. ఆ మేలిముసుగును ముందు నువ్వు ప్రక్కకు తప్పించు"అన్నాడు నివారణుడు ఆనందంతో తుళ్ళిపడుతూ..

నివారణుడి మాటప్రకారం మృణాళిని వధువు మేలి ముసుగు అంచుమీద చెయ్యి వెయ్యగానే ఆమె ముంజేతి మీద చండి చెయ్యి యాదాలాపంగా పడింది. మరుక్షణం లోనే ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లు మృణాళిని శరీరం యావత్తూ బిగుసుకుపోయినట్లయి 'అమ్మో' అని కేకేసిం దామె. ఆమెకి ఫిట్సు వస్తూ ఉంటాయి అప్పుడప్పుడు. అలాగే ఇప్పుడూ ఫిట్ వచ్చిందనుకున్నా రందరూ - ప్రక్క నున్న వాళ్ళందరూ కంగారు పడిపోయారు. కాని కాస్సేపటికల్లా ఆమెలో ఆబెదురు పోయింది. మళ్ళీ మామూలు మనిషయి అవగుంఠనవతియైన వధువు కేసి భయ సంశయ దృష్టితో చూసింది.

"ఏం జరిగింది మ్రినా? అలా బేజారయి పోయా వేమిటి?" అని అడిగాడు నివారణుడు.

మృణాళిని శరీరం అప్పటికీ ఇంకా గజ గజ వణుకు తూనే ఉంది. ఆవణుకు ఆమె కంఠంలోకూడా వ్యక్తం అవు తోంది. ఆమె నెమ్మదిగా సమాధానం ఇచ్చింది. "వధువు అవగుంఠనాన్ని తొలగించుదా మని పట్టుకోగానే నా శరీర

మంతా ఒక్కసారి ఝల్లుమంది. ఎవరో నా నరాలు లాగి వేస్తున్నట్లు అనిపించింది. 'ఫిట్' రాబోతోందేమో అను కున్నా, కాని అది కాదు. ఆమె ఏదో కిటుకు చేసి ఉంటుం దనుకుంటా."

నివారణుడు వ్యంగ్యంగా "అవునవును. ఆయు ర్వేదవైద్యుడి కూతురటగా! మంత్ర తంత్రాలు చాలా తెలిసిందయి ఉంటుంది. కాని నువ్వు భయంతో పక్కకి తప్పుకున్నావు. అవగుంఠనాన్ని లాగెయ్యనే లేదు" అన్నాడు.

"ఇంకానా? ఇంక నా వల్లకాదు బాబూ! నీ కంత కోరికగా ఉంటే నువ్వే వెనక్కి లాగెయ్" అన్నది మృణాళిని.

నివారణుడు తీక్ష్ణంగా "మేలిముసుగు తీస్తావా? లేక నా చేతుల్తోనే తీసెయ్య మన్నావా?" అని అడిగాడు.

వధువు మాట్లాడ లేదు. ప్రాణం లేని ప్రతిమలాగా నిశ్చలంగా కూచుని ఉంది.

మృణాళినికూడా — "నీ బడాయి చూ స్తే చాలా చోద్యంగా ఉందే? మరిది అంటే అంత సిగ్గున్న దానివే అయితే — అతడు గుమ్మంలోకి రాగానే ముఖం మీద ముసుగు తప్పించుకుని అలా ఎందుకు చూశావో చెప్పు మరి!" అని ఓ విసురు విసిరింది.

ఈసారి అవగుంఠనంలోంచి వధువు కంఠస్వరం ఖంగున విన్పించింది. "నే నలా ఎందుకు చూశానో మీకు తెలుసు కోవాలని ఉందా?"

చండి అలా అనడంతో అక్కడున్న వారందరికి అప రిమితాశ్చర్యం, ఆపుకోలేని కుతూహలమూ కలిగాయి.

ఆమె వెంటనే మళ్ళీ నదురూ బెదురూ లేకుండా "మీ నాన్నగారు నన్ను చూడటానికి వచ్చినప్పుడు ఒక కొరడాని కానుకగా యిచ్చారు" అని ఒక క్షణం ఆగింది.

ఎవరినోటా మాట లేదు. ఆమె ఇంకా ఏమన బోతోందో అని అందరూ చెవులొగ్గి పూరుకున్నారు.

"తమ యింట్లో ఒక గాడిద ఉన్నదని, ఆకొరడాతో ఆ గాడిదను లొంగదీసుకోవాలని చెప్పారు. ఆ గాడిద ఎలాం టిదా అన్న కుతూహలంకొద్దీ అలా చూశాను."

వధువు ముఖతః ఈమాటలు రావడం విని అందరూ శిలాప్రతిమలై పోయారు. మరోక్షణం పోయాక మేలిముసు గుల్లోంచి నివారణుడి ముఖంకేసి, చాటుగా చూశారు. అతడి అందమైన ముఖం - ఎవరో వచ్చి తారు పులిమినట్లు నల్లబడి పోయింది.

# 11

అత్తవారింటికి కొత్తగా వచ్చిన కోడల్ని చక్కగా ముస్తాబుచేసి, మంగళ వాయిద్యాలు మోగుతుండగా అంతః పురంలోని ధనాగారానికి తీసుకెళ్ళటం ఈ గంగూలీ వంశీ యుల సాంప్రదాయం. ఆ గదిలో ఓ పెద్ద ఇనుపమందసంలో దుర్లభములైన రత్నాలు, విలువగల బంగారునగలు భద్ర పరచి ఉంటాయి, శుభముహూర్తంలో నూతన వధువు

యెదుట ఆ మందసాన్ని తెరిస్తే అందులో ఉన్న ఆభర ణాల్ని ఆమె చేత్తో ఒకసారి స్పృశించాలి.

ఆ సంప్రదాయం ప్రకారం మాధురీదేవి - కొంత మంది పేరంటాండ్రను పిలిచి శుభలగ్నంలో చండిని ముస్తాబు చేయించి ఆ మందసం ఉన్నచోటుకు తీసుకెళ్ళింది. ఆ మంద సాన్ని దానికి తగిన పెద్ద పెద్ద తాళాలతో బిగించికూడా ఉంచారు.

యజమాని ఆజ్ఞప్రకారం దుర్గాదాసనే నౌకరు కుఱ్ర వాడు తాళాలగుత్తి తీసుకొచ్చి ముందు తాళాలు తీశాడు. మరొకప్పు డెప్పుడైనా ఈ మందసాన్ని తెరవవలసిన అవ సరం వస్తే, జమీందారుగారి సన్నిహిత భృత్యుడు వస్తాదు అయిన పంచాననుడు తాళాలు తీసుకొచ్చి తీసి, ఆ మూత పైకి ఎత్తుతాడు.

దుర్గాదాసు తాళాలన్నీ తీసి, ప్రక్కకి తప్పుకొని నిల బడగానే మాధురీదేవి కొంచెం విసుగ్గా "పంచాననుడు వచ్చి నట్లు లేదు-దీనిమూత ఎవరెత్తుతారు పైకి?" అని అడిగింది.

"దీన్ని తెరవటాని కీ సారి వస్తాదును పంపాల్సిన అవసరం లేదని బాబుగారు సెలవిచ్చారు" అని దుర్గాదాసు సవినయంగా మనవి చేశాడు.

రాణి కనుబొమలు చిట్లించి - "అయితే నువ్వే దీన్ని తెరిచేంత మొనగాడి వైనా వనుకుంటాను" అన్నది.

ఆ కుఱ్రవాడు భయపడుతూ "నేనా! ఇంత దయ్యా మంత మూతని నే నెక్కడ ఎత్తగలను రాణీగారూ? రెండు

చేతులతో నా బలమంతా ఉపయోగించినా అంగుళం కూడా పైకి లేవదు'' అన్నాడు.

''అయితే ఇహనేం వహిల్యాణ్ని పంపి తెరిపించాల్సిన అవసరం లేకపోతే - దొరగారినే వచ్చి తెరవమని చెప్పు - వెళ్లు'' అని గద్దించింది రాణి.

చండి వారిద్దరి సంభాషణా శ్రద్ధగా విన్నది. ఈ మూతను పైకి ఎత్తించటంలో యజమాని మనస్సులోని అభిప్రాయ మేమైందీ గ్రహించి, తనలో తాను నవ్వుకుంది. కాని, ఆ సంగతి బయట పెట్టకుండా అత్తగారికేసి చూసి, ''మామగారు చెప్పిందీ యుక్తంగానే ఉంది అత్తయ్యా. దీన్ని తెరవటానికి అంతఃపురంలోకి వస్తాదు రావాల్సిన అవసరం ఏముంది? మనం తెరవలేమా?'' అన్నది.

భర్త చెప్పిపంపిన మాటలు వినేసరికే రాణిగారి కసలు మహా అభిమానంగా ఉంది. ఇహ ఈ కోడలి మాటలు వింటూంటే ఆమెకి ఒళ్ళు మండిపోయింది. ఆమె పైకి యేమీ అనలేదు కాని కోడలికేసి మహాపదునుగా చూసింది. ఆమె పెదవి కదల్పకపోయినా ఆ చూపులో ఆమె అభిప్రాయం స్పష్టంగా వెల్లడయింది. ఆమె జ్వాలాదృష్టిలోని ఆంతర్యాన్ని ఆమె మేనకోడలు మృణాళిని మాటల్లో వెల్లడించింది. ఆమె వధువుకేసి ఈసడింపుగాచూస్తూ ఎకసక్కెంగా అన్నది —— పది మంది యెదుట మాట్లాడుతున్నప్పుడు - కాస్త వెనకా ముందూ పారచూచుకొని మాట్లాడుతూ ఉండాలమ్మా కొత్తకోడలా! చేతుల్లో కాస్త సత్తువుంటే ఛటుక్కున పైకిఎత్తెయ్యటానికి - మీ పుట్టింటివారి యింట్లో

ఉండే జాజిచెక్కల పెట్టెలాంటిదనుకున్నావా యేం ? రెండు మణుగుల బరువున్న ఈ మూత పైకెత్తా లంటే - మనం నువ్వులూ, తెలకపిండీ తింటూ రెండేళ్ళు తాలింఖానాలో కసరత్ చెయ్యాలి.''

అరక్తమైన చండిముఖంలో అలవోకగా ఓచిరునవ్వు మెరిసింది. ''నీ మాటలు నిజమే చెల్లీ! కాని అసలు సంగతి మరిచిపోతున్నావు నువ్వు. ఈ వంశ మర్యాదను కాపాడుతూ ఈ యింటికి కోడలుగా వచ్చే ఆమె - కులదేవత లాంటి ఈ మందసాన్ని తెరవగల యోగ్యతనుకూడా తెచ్చుకో గలిగినదై ఉండాలి. మామగారి ఆదేశాన్ని శిరసావహించి; వారి ఆశీర్వాదంతో, మా పుట్టింట జాజిచెక్కల పెట్టెని తెరచిన చేత్తోనే ఈ ఇనుప మందసాన్నికూడా తెరుస్తాను. వస్తాదుని పిలిపించవలసిన అవసరం వాస్తవంగానే లేదు.''

చండి తనసహజమైన ధోరణిలోనే ఈ రెండుమాటలూ అని, తాళాలు తీసిఉన్న - ఆ కబంధ శరీరం లాంటి ఆ యినుప మందసం పైతలుపును రెండుచేతుల్తో చులాగ్గా ఎత్తి వెనుక నున్న గోడకు ఆన్చింది.

దోర్దండ ప్రతాపుడైన జమీందారుగారి గృహిణి - అంతఃపురంలో రాణిగారు- అయిన మాధురీదేవి లగాయతు అక్కడ ఉన్న చిన్నా-పెద్దా, మొత్తం యాభైమంది స్త్రీలూ, వెనుక నిలబడి ఉన్న దాసీలూ - వంటలక్కలూ - యావన్మందీ ఆమె చర్యకు ఆశ్చర్యపోతూ గుడ్లప్పగించి చూడసాగారు. ఈ నవవధువు ఈ మందసం తలుపును నిజంగానే తనచేతుల్తో ఎత్తిందా ? లేక వీరి కులదేవత ఆమె హస్తాల్లో

ప్రవేశించి, ఆమె గౌరవాన్ని కాపాడిందా? మృణాళిని మొహం ముడుచుకు పోయింది.

అహంకార పూరితమైన రాణిముఖం నల్లగా బొగ్గయింది. నౌకరు కుర్రాడు దుర్గాదాసు వధువు నుద్దేశించి, తలవంచి నమస్కరిస్తూ, "నమస్కారాలు తల్లీ ! ఇట్లాంటి యిది నే నెప్పుడూ చూడలేదు'' అన్నాడు.

చండి ఎవరి స్తోత్రాలనీ చెవి కెక్కించుకోకుండా రాణి మాధురీదేవి నుద్దేశించి, ఇహ నిప్పు డేం చెయ్యాలి అత్తయ్యా'' అని అడిగింది.

గృహిణి ఇప్పటివరకూ నవవధువును వీలైనంత వరకు తప్పించుకుని తిరుగుతోంది. ఉభయులు ఏదో ముక్తసరిగా మాత్రమే మాట్లాడుతున్నా రింతవరకు... మరీ ముఖ్యంఅనుకున్న మూడునాలుగు ప్రశ్నలే ఆమె కోడల్ని అడిగింది. ఆ ప్రశ్నలికి ఆమె చెప్పిన సమాధానం అత్తగారి కంతగా నచ్చలేదు. ఇక్కడికి నౌకరు దుర్గాదాసు తాళాలు తీసుకుని రావటం - అతడు చెప్పిన మాటలు, ఈ సందర్భంలో కోడలి ప్రవర్తన - ఇవన్నీ తనని అఘాతపరచటానికే సంఘటిల్లినట్లు కన్పించాయి ఆమెకి. ఆమె కోపమంతా యజమానిమీదికి పోయిపడింది. ఈ పరిస్థితిలో వధువు వేసిన ప్రశ్న ఆమెని మామూలు పరిస్థితికి తీసుకొచ్చింది. దాంతో పాటు ముఖంలోని భావం కప్పిపుచ్చుకోడానికి, బలవంతాన నవ్వు తెచ్చిపెట్టుకుని, "ఆ సంగతే ఆలోచిస్తూంటే ఏమీ పాలుపోకుండా ఉంది. ముందుగానే తెలిసి ఉంటే ఊళ్ళో స్త్రీ

లందర్నీ ఆహ్వానించి - నీ చేతుల్లోని సత్తువను వారి అందరి యెదుట ప్రదర్శించే దాన్ని'' అన్నది.

చండి చిరునవ్వు నవ్వి - ''ఈ భాగ్యానికి మీ రింత ఆలోచించటం దేని కత్తయ్యా! ఇవాళరాత్రి వెయ్యిమందిని విందుకు పిలిచారటగా! వారికందరికి వడ్డన చెయ్యటానికి పంపండి నన్ను. దాంతో వారికి నా చేతుల్లోని బలం ఇంత కన్న స్పష్టంగా తెలుస్తుంది. దానివల్ల మీకుకూడా కొంత శ్రమ తప్పుతుంది'' అన్నది.

మాధురీదేవి ముఖంలోని నవ్వు కాస్తా మాయమై పోయింది. ఆమె ఈసారి కొంచెం గంభీరంగా, ''సరేలే, ఆ యేర్పాటేదో అప్పుడు చూచుకోవచ్చు. ముందు ఇక్కడీ గదిలో జరగవలసిన పని కానియ్'' అన్నది.

తర్వాత ఆ మందసంలో భద్రపరచి ఉన్న ఆభరణా లను చండి స్పృశించింది. సరిగ్గా అదేసమయంలో గంగూలీ వంశీయుల లక్ష్మీభాండారం మంగళవాయిద్యాలతో మా ర్మోగిపోయింది.

## 12

వివాహంనాటి రాత్రి మాట్లాడుకున్నాక - మళ్ళీ ఈ విచిత్ర దంపతులు కలుసుకొని మాట్లాడుకొనే అవకాశం రాలేదు. ఆ అవకాశం మళ్ళీ పూలపాన్పునాటి రాత్రి లభించింది.

అంతఃపురంలో గోవిందుడి తల్లి నివసించిన భాగం నవవధువుకోసం యజమాని ఆదేశించిన పద్ధతిని అలంకరింప

బడింది. మాధురీదేవి తొలిసారిగా ఈ అంతఃపురంలో అడుగుపెట్టినప్పుడు ఈ భాగంలో కొద్దిరోజులు మాత్రం ఉంది. లోకాంతరగతురాలైన తనసవతిస్మృతిని భర్తహృదయంలోంచి చెరిపెయ్యటానికి – ఆమె పట్టుపట్టి, అంతఃపురంలో మరొక వైపును ఆధునిక పద్ధతిని ఓ ప్రత్యేక భవనంగా తయారు చేయించుకుంది.

వాడుకోకుండా పాడుపెట్టిన భవనం – మళ్ళీ ఇన్నాళ్ళకు బాగుచేయించబడి – చక్కని దీపాలతో కళకళలాడుతూ నూతనదంపతులకు అభ్యుదయాన్ని చేకూర్చేదిలా ఉంది. తనకు కేటాయించిన ఈ భవనంలోని ఏర్పాట్లన్నీ చూసి, చండి చాలాతృప్తి పడింది. శయనగృహంలో అమర్చబడిన మంచం దానిమీదపరుపు, తలగడలూ, దుప్పట్లూ అన్నీ చాలా చక్కగా ఉన్నాయి. ఆ పక్కమీద ఒత్తుగా పూలు చల్లి ఉన్నాయి. గదిలో క్రింద విలువైన పారశీకపు తివాచీలు పరచబడ్డాయి. గోడల్ని చక్కని చిత్రపటాలున్నాయి. గుమ్మాని కెదురుగా గోడని చిరునవ్వు తొణికిసలాడుతున్న ఓసుందరాంగి తైలచిత్తరువుంది. గుమ్మంలో నుంచుని చూస్తే – ఆ చిత్తరువులోని స్త్రీ మధురమందహాసంతో అభ్యాగతులను ఆహ్వానిస్తోందా అనిపిస్తుంది. ఎక్కడా దొరకని రకరకాల పుష్పాలతో ఈ పడకగది చక్కగా అలంకరించబడి ఉంది. క్రిందపరచి ఉన్న తివాసీల మీద అక్కడక్కడ చిన్న చిన్న వెండి పూల తొట్లలో పూలగుత్తులు అమర్చబడ్డాయి.

# స్వయంసిద్ధ

శయనమందిరం ప్రక్కనే పుస్తకాగారం, పెద్ద పెద్ద బీరువాలనిండా రకరకాల పుస్తకాలు... మధ్య నొక మేజా, చుట్టూ కుర్చీలూ, దాని ప్రక్కనే డ్రాయింగు రూమ్. ఆ గది సోఫాలతో అలంకరించబడింది. దానికటువైపున టాయ్ లెట్ రూమ్, రకరకాల విలాస వస్తువులతో - సువాసన ద్రవ్యాలతో గదంతా పరిమళిస్తూ ఉంటుంది. దీని ప్రక్కనే దంపతుల భోజనశాల ... ఆ డాబామీద చక్కగా అమర్చిన పూలకుండ్లు - క్రింద మనోహరమైన ఉద్యానవనం.

రాజాంతఃపురాల్లో-ఎవరికి వారికి ప్రత్యేకమైన భవనాలుంటాయని నవలల్లో చదివింది చండి. ఇక్కడికి వచ్చాక కథల్లో విషయాలుకూడా యథార్థాలై ఉండొచ్చు నని తోచిందామెకి. చక్కగా ముస్తాబయిన దంపతులతోపాటు చాలామంది స్త్రీలు చేరారాపడకగదిలో. అక్కడ ఆచారం ప్రకారం జరగవలసినతంతు అంతా ముగిసినా వాళ్లెక్కడా ఇంకా కదిలే ధోరణిలో ఉన్నట్లు కన్పడలేదు. వధువు ముఖంలో రవంత చికాకు వ్యక్తం అవుతున్నా దాన్ని వీళ్ళెవరూ గమనించినట్లే లేరు. వధువు మాట తెనోనే వీరు గుడ్లప్పగించి, చెవులు దోరగించుకుని విస్తుపోతూ విన్నారు. కాని ఆమె వరుడితో ఎలా మాట్లాడుతుందో ఇంతవరకు ఎవరూ వినలేదు. అంచేత అది విని, ఆ మనసుకూడా తీర్చుకోటానికి అందరూ సభతీర్చి కూచున్నారు. ఈ యింట్లో ఏం జరిగినా ముందడుగు వేస్తూండేది మృణాళినే. ఆమె మాట కాస్తా ముఖానే అనేసింది. "ఇహ మీ రిద్దరూ రెండు మాటలు మాట్లాడుకొంటే విని వెళ్ళిపోతాం మేము. ఈ ఉత్సవం

కూడా మధురంగా సమాప్తమయిన ట్లవుతుంది'' అన్నది మృణాళిని.—

వధువు సమాధాన మేమీ చెప్పలేదు. కాని ఈ యింట్లో ఎవరేమి మాట్లాడినా - వాళ్ళ యెదుట ఎన్నడూ జవాబు చెప్పి ఎరుగనివాడు - ఆ నిరీహుడు, ఆ 'జడభరతుడు' నవ్వుతూ మాట్లాడేశాడు. "అయితే మీ కింకా తెలియదన్నమాట! ఆనాటి రాత్రే మేం ఎన్నెన్ని సంగతులు మాట్లాడు కున్నామని? అబ్బో! చాలా చాలా మాట్లాడు కున్నాం. తెల్లవార్లూ అలాగే కూర్చొని ఎన్నెన్ని మంచి మంచి కథలు —''

గోవిందు డలా మాట్లాడుతుంటే అందరి ముఖాల్లోనూ చటుక్కున మెరుపుతీగె లాంటి నవ్వు మెరిసింది. మృణాళిని కూడా ముఖం ప్రక్కకుత్రిప్పుకొని, నవ్వుకుని, ''ఏమి టంటున్నావు వెంగళప్ప బావా? అన్ని సంగతులు మాట్లాడుకున్నారా ఆరోజురాత్రి? కథలుకూడానా? ఓయబ్బో...!'' అంది.

గోవిందుడి ముఖమూ — కళ్ళూ ఉత్సాహంతో మెరిసిపోయాయి. ఎంతో ఉల్లాసంతో "ఆ కథలు విన్నారంటే మీ రంతా వెర్రిమొహం లేసుకుని చూడాల్సిందే! వా టన్నింటి లోకి భలే కథ — ఆ రాజు కూతురు విద్యావతి కథ — అది ఎంత బావుందని! ఓహ్!'' అన్నాడు.

మృణాళిని పరిహాసంగా ఆకథ చెప్పిం దెవరు బావా? ఆవిడా? నువ్వా? అని అడిగేసింది.

గోవిందుడు సగర్వంగా "ఆ-వి-డే'' అన్నాడు.

ఇంతసేపటి కిప్పుడు ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. వధువు అసహిష్ణుభావంతో భర్త కేసి పదే పదే సాభిప్రాయంగా చూసింది. కాని ఆ మాటల ఉత్సాహంలో అతడు భార్య ముఖం కేసి చూసే అవకాశాన్ని కల్పించుకో లేదు. చూపులు కలియగానే వధువు చూపుల చురుకుదనానికి అతడి ఉత్సాహమంతా ఉఫ్‌న ఎగిరి చక్కా పోయింది. మరుక్షణంలోనే అతడు గొంతు తగ్గించుకుని, "బాబోయ్! నువ్వుకూడా చూపుల్తో బెదరకొడుతున్నావ్?" అన్నాడు జాలిగా ...

గోవిందుడి మాటలకు అక్కడున్న స్త్రీలంతా గొల్లున నవ్వారు. మృణాళిని వధువు కేసి చూసి, "అయితే పెళ్ళి నాటి రాత్రే మా పెద్దబావ తెలివితేటలు ఎంతలో ఉన్నదీ పట్టి చూశావన్నమాట!" అన్నది.

చండి ఆమె అడిగిందానికి తగినట్లు కొంచెం సూటీ పోటీగా — "ఇంత గొప్పవిషయం నీ బుద్ధి కెలా తట్టిందో తెలియకుండా ఉందే!" అన్నది.

ఆ మాట కొంచెం గ్రుచ్చినట్లున్నా మృణాళిని ఆ భావాన్ని బయట పడకుండా - మామూలుగా మాట్లాడుతున్న భంగిమలోనే "ఆ మాటల ధోరణే చెప్తోందిగా! మామూలుగా ఎప్పుడూ ఎంత గిల్లినా మాట్లాడకుండా స్తబ్ధులా ఉండేవాడు - ఇవాళ తనకు తానై కల్పించుకుని మాట్లాడుతున్నాడు ఇది నీ చేతి చలవో, నీ స్పర్శ ప్రభావమో అంతుపట్టకుండా ఉంది" అన్నది.

చండి చిరునవ్వు నవ్వి, "మీ బావను మీ రంతా కలిసి, బుద్ధిపూర్వకంగా ఏ మాయదండంతోనో స్పృశించి నిద్రపోయేట్లు చేశారుగా! తర్వాత హఠాత్తుగా ఓ శుభ లగ్నాన ఏ స్వర్ణదండం స్పర్శవల్లనో ఆ నిద్రమత్తు వదిలి పోయిందనుకో, అందులో నా తప్పు ఏముంది?" అన్నది.

చండి మాటలు ఒక్కక్షణం అందర్నీ విస్తుపోయేట్లు చేశాయి. మృణాళిని ఆ మాటా, ఈ మాట అని చండిని చిన్నపుచ్చుదామని వచ్చిం దసలు. కాని తనకే దెబ్బమీద దెబ్బ తగలటంతో ఆమెలో కాఠిన్యం కరుడు కట్టసాగింది. ఇంతమంది స్త్రీల యెదుట ఆమె తెల్లబోతుందా! అందు చేత ఈసారి నోటికొచ్చిన మాటేదో గట్టిగానే అనేసింది. "తప్పుపట్టటం కాదిది, ఘనతను కట్టిపెట్టటమే! అకటా వికటపు రాజుకు - అవ్యక్తపు ప్రధానిట! కాని మా అకటా వికటపు బావకి దొరికిందిమాత్రం స్పర్శవేదిలాంటి పెళ్లాం."

వధువు నవ్వుతూ "ఇంకమీదట నిజంగానే అనుకోని సంఘటనలు జరిగితే అందుకు నన్నుమాత్రం తప్పు పట్టొద్దు" అన్నది. మృణాళిని కీసారి సమాధాన మేమీ తోచలేదు. ఆమె తరఫున బయటనుంచి వచ్చింది సమాధానం. "మెదల కుండా ఊరుకున్నావేం మీనా? చెప్పలేక పోయావా? 'అలాంటి భయం ఇక్కడేంలేదు - నాటువైద్యుడి కూతురు ఏం చేస్తుంది మహాచేస్తే మందు లేవైనా పెట్టి మనస్సు విరుస్తుందేమో అని'... !"

బయటకు చూసి అందరూ విస్మితులయినారు. నివారణుడు గుమ్మంలో నుంచుని ఉన్నాడు. అక్కడున్న స్త్రీలు

కంగారుగా అవగుంఠనాలు సవరించుకున్నారు. చిన్నపోయిన మృణాళిని ముఖం ఉత్సాహంతో ఉజ్జ్వలమైంది. ఆమె నివారణుడు అన్నమాటకు వత్తాసు యిస్తూ "మా చిన్న బావ అన్నమాట రైటే. జమీందార్ల యింటి ఆడబడుచువే అయినట్లయితే నువ్వామాట అన్నా ఒప్పుతుంది" అన్నది.

చండి కంఠస్వరానికి అక్కడున్న వాళ్ళంతా చకితులయినా రీసారి. ఆమె రోషంగా "మనం మనం మాట్లాడుకుంటున్న ఈ ప్రసంగంలోకి తండ్రుల్ని తాతల్ని తీసుకురానవసరం లేదు చెల్లీ!" అన్నది.

ముఖం కందగడ్డలా చేసుకుని మృణాళిని నివారణుడికేసి చూసింది. వాళ్ళిద్దరి కళ్ళూ ఏం మాట్లాడుకున్నాయో యేమో, మరుక్షణంలో ఆమె నిర్లక్ష్యంగా "తక్కువ వంశములో పుట్టి, పెద్ద పెద్ద మాటలు మాట్లాడితే వంశాన్ని గురించి ఏదో ఓ మాట అనకమానరు. తండ్రి చేతులు చూసి ఏవో రెండు మిరియాలమాత్ర లిచ్చే వాడయినప్పుడు కూతురు పెద్దమాటలు మాట్లాట్టం ఒప్పదు" అన్నది.

ఆ మేనత్త మేనమామ బిడ్డల మర్యాద తెలియని ప్రవర్తనకీ, కటువైన మాటలకీ చండి చూపులు నిప్పులు క్రక్కాయి. ఆమె మృణాళిని ముఖంమీద చూపులు నిలిపి, తాను అనే మాటలు నిష్కర్షగా అనేసింది. "మా నాన్న మాత్రలు అమ్ముకొని బ్రతికే వాడన్న మాట అక్షరాల నిజమే, కాని అప్పుల్లో మునగటంవల్ల కూతుర్ని అమ్ముకుని ఆయన వంశగౌరవానికి భంగం కలిగించలేదు. ఆ దృష్టితో

చూస్తే, అడుగులోత్త అయిన పెద్ద గంగాళంకన్న, నీళ్ళు నిలిచే చిన్న కుండ ఉత్తమమయినది గదూ ?''

తా నెంత రూఢంగా మాట్లాడినా, వధువు జవాబుతో ఇంత తీవ్రంగా అఘాతపర్చి, తనని తల వంచుకునేట్లు చేస్తుంది అని మృణాళిని అనుకోలేదు. ఈ ఇంటికి వచ్చిన ఈ రెండురోజుల్లోనే - ఈ వంశపుగుట్టంతా ఆమె తెలుసుకుందనికూడా తెలియదామెకి. ఆమె వివర్ణముఖాన్ని పైకెత్తి నివారణుని కేసి నిస్సహాయు రాలిగా చూసింది.

నివారణుడు ఇవాళ ఏమయినా సరే చండి తత్వం అసలెలాంటిదో తేల్చుకుందామనే లెక్కలోనే వచ్చాడు. ఆమె పితృవంశాన్నీ, వారి వృత్తినీ ఎత్తిపొడిచి ఆమెని విస్తుపోయేట్లు చేసి, తనకి మొదటి రోజున చేసిన అవమానానికి ప్రతీకారం చెయ్యాలనే కసితో వచ్చా డతడు. కాని ఆ మాటమీద, ఆ మాటమీద తండ్రి ప్రసక్తి రాగానే - దానికి బదులుగా వధువు ప్రయోగించిన బాణం - దానికి లక్ష్యస్థానం ఏదైనదీ మృణాళినితోపాటు నివారణుడుకూడా త్రుటిలోనే గ్రహించాడు. మృణాళిని తెల్లబోయి, నివారణుడి కేసి గ్రుడ్లప్పగించి చూడసాగింది. కాని వధువు కన్పరచిన స్పర్ధతో అతడి ధైర్యం దిగజారిపోయింది.

“నువ్వు యింత నిర్లక్ష్యంగా అన్నమాట ఎవరికి తగిలేది తెలిసే అన్నావా ?'' అని గర్జించాడు.

చండి ముఖం ప్రక్కకు తిప్పుకుని, ఏమాత్రం త్రోణక్కుండా ''నేను ఎవర్నీ పేరెత్తికానీ, ఎవర్నీ కించపరచాలనే ఉద్దేశంతో కాని అనలేదామాట. కాని ఘరానా వంశం,

ఘరానావంశం అని గొంతు చించుకొనే వారికిమాత్రం నేను చెప్పదలచిం దిది - దీపంఅడుగునే చీకటుంటుంది. ఘరానా వంశీయులే అనేక సందర్భాలలో కూడని పనులు చేసి నలుగురి నోళ్లలోనూ పడతారు. కనక వంశాన్ని గురించి గొప్పలు చెప్పుకోటం చాలా పెద్దపొరపాటు అంటున్నాను" అన్నది.

చండి మాటలు నివారణుడికి మరింత తిక్క ఎత్తించాయి. అత డీ సారి గ్రుడ్లెర్ర జేసి, తర్జనితో బెదరిస్తూ, "నువ్వు అన్నమాటను కప్పి పుచ్చుకో చూస్తున్నావు కాని, నీ ఆట లిక్కడ సాగవు. నేను చెబుతున్నాను. నువ్వు మా మాతా మహుణ్ణి కించపరచటానికే అన్నా వీ మాట. అన్నావా? లేదా? ఆఁ? అనలా?" అని ఉరిమాడు.

నివారణుడి ఉరుములకు స్త్రీ లంతా భయపడి చండీ ముఖం కేసి చూశారు. ఆమె ముఖంలోమాత్రం భయ చిహ్నాలేవీ కన్పించ లేదు. ఆమె క్రితంసారిలాగానే ఈసారి కూడా అవిచలిత కంఠంతో — ఇంకొంచెం నిష్కర్షగా— "నేను మీ మాతా మహుని పేరెత్తి ఏమీ అనలేదు. ఆయన పేరెత్తింది మీరే. కాని ఇప్పుడు చెప్తున్నాను. ఆయన నిజంగానే అలాంటి పని చేసి ఉన్నట్లయితే - ఆయన మనుమరాళ్లూ, మనుమలు అందుకు నిజంగా సిగ్గు పడడం భావ్యం" అన్నది.

"ఏమిటి? నువ్వు మా తాతగారు చేసినపనికి తప్పులు ఎంచేపాటి దానివా?"

"మా నాన్న చేసే వృత్తి సంగతి తీసుకొచ్చి ఆయన్ని కించ పరిచే అధికారం మీ కెవరిచ్చారు? అని నేనూ అడిగితే?"

"మీ నాన్న మా సంస్థానంలోని ప్రజల్లో ఒకడు. అతడ్ని గురించి విమర్శించే అధికారం కచ్చితంగా ఉంది మాకు."

"అయితే నా సమాధానంకూడా వినండి. 'నేనూ తగుదు' నంటూ రాజు వేషం వేసుకొని వచ్చేవాళ్లు చేసే అన్యాయాల్ని ఖండించడానికి నాకూ హక్కుంది. ..."

ఇంతలో మృణాళిని నివారణుడ్ని చెయ్యి పట్టుకుని గట్టిగా లాగుతూ, "ఊరుకో బావా! ఇంక రగడ పెంచి లాభం లేదు. ఈవిడతో మాట్లాడి నెగ్గలేవు నువ్వు" అని మొత్తుకుంది.

నివారణుడు కోపంతో ఉడికి పోతున్నాడు. వధువుకి ఘాటైన సమాధానం చెప్పుదా మనుకుంటే అతడి మాటల తూణీరం ఖాళీ అయింది. అంచేత అతడా మాటల చాట లోంచి కొంచెం పెడతిరిగి "నీ కింత అహంకార మయితే సహించి ఊరుకోము మేము. ఆ రోజునా ఇలాగే నన్ను అందరి యెదుటా గాడిదన్నావు" అన్నాడు.

చండి మొదలకుండా ఊరుకుంది ఈ మాటకు సమాధానం ఏమీ చెప్పలేదు. కాని ఆ గదిలో ఉన్న వారి నందర్నీ చకితుల్ని చేస్తూ ఆ మాటకు గోవిందుడు సమాధానం ఇచ్చాడు. "గాడిద అని యెందుకు అనకూడదురా? అన్నని పట్టుకుని వెంగళప్పని అల్లరి పెట్టిన వాడివి, వదిన

గారి మేలిముసుగు పట్టుకుని లాగబోయిన వాడివి, బిగ్గరగా కేకలు పెడుతూ ఇక్కడ చేరిన ముత్తయిదువుల చెవులు చిల్లులు పడేట్లు చేస్తున్నవాడివి - నువ్వు గాడిదవి గాక ఎవరివి మరి?''

చండి ఉజ్జ్వల దృష్టితో భర్త ముఖంకేసి చూసింది. నివారణుడు - మృణాళిని మళ్ళీ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. ''నోరూ వాయీ లేని పిచ్చాడు కూడా చిలక పలుకులు పలకటం నేర్చుకున్నాడల్లేఉందే! చచ్చాం. నోరు మహావడిగా లేస్తోంది! నెత్తిన పసుపు గింజలు పడ్డప్పటినుంచీ వీపున బెత్తం పడటం లేదుగా! ఈ విసురంతా అందుకనేనల్లే ఉంది;'' అన్నాడు నివారణుడు ఎకసక్కెంగా.

గోవిందుడి నోటితాళం ఊడింది దివాళ. నివారణుడి మాటలకు ఇవాళ వెంటనే నిర్భయంగా జవాబిచ్చాడు. ''నిన్ను గాడిద అనటంలో తప్పేమీ లేదు. ఇంతమంది ఆడ వాళ్ళమధ్యనిలబడి నువ్వే చెప్పావుగా 'అన్నని కొట్టే ఘనుడి' నని! నువ్వు గాడిదవే! 'గాడిదతల' బుట్టబొమ్మ ఒకటి నీ మొహానికి తగిలిస్తే నీకు తగి ఉంటుం దనిపిస్తోంది. మే మంతా నీ వెనకాల 'గాడిద, గాడిద' అంటూ చప్పట్లు చరుస్తూ గేలిచేస్తాం.''

చండి గోవిందుడి ముఖం కేసి తీవ్రంగా చూసింది. మళ్ళీ భార్యా భర్త లిద్దరి చూపులు కలియగానే గోవిం దుడి ఉత్సాహంకాస్తా దిగజారిపోయింది. తానుకూడా గాడిదలాగు అరుస్తూ తప్పు చేశాను కాబో లనిపించిం దత

డికి. మనస్సులోని ఉత్సాహాన్ని అణచుకొని, చటుక్కున మాట్లాడటంకూడా ఆపివేశాడు.

కాని నివారణుని ఉత్సాహంమాత్రం రెచ్చిపోయింది. ఇప్పటి వరకూ అన్నగారిని శాసిస్తూనే వచ్చాడు. అలాంటి వాడివాళ పెళ్ళాం కొంగుపట్టుకుని వేలాడుతూ అందరి యెదుట హేళన చేస్తాడా! అతడి కళ్ళు రెండూ అహంకారాన్ని చిందుతున్నాయి. వధువుమీద వచ్చిన కోపమంతా గోవిందుడిమీద చూపిస్తూ "ఇవాళ నీ చెవులు రెండూ మెలిపెట్టి ఈ గదిలోనే నీమీదఎక్కి స్వారిచేస్తా రాస్కెల్ ఏమనుకున్నావో!" అన్నాడు.

అతడి మాటలకి చండికి ఒళ్ళు మండిపోయింది. కాని ఆ కోప మంతా వెళ్ళకక్కకుండా, పైకి చిరునవ్వు నవ్వి - "స్వారీ చెయ్యటానికి సరియైనచోటు మైదానం — ఇది మైదానం కాదన్న సంగతి గుర్తుంచుకోండి. ఇక్కడికి వచ్చిన గౌరవనీయులైన గృహిణు లంతా కళవళపడుతున్నారు. సభ్యత, మర్యాద నేర్చుకుని కాని స్త్రీలతో మాట్లాడకూడదన్న వివేచనయినా లేదు మీకు" అన్నది.

నివారణుడు ముఖం మాడ్చుకుని, "నువ్వు ఆడదానివి, పెళ్ళికూతురివి అయిపోయావు కాని లేకపోతేనా?" — అంటూ రంకెలు వెయ్యసాగాడు. ఆమె కంఠస్వరాన్ని సరళంగా మార్చుకుని, పరిహాసధోరణిలో — 'ఏంచేస్తావ్? నా వీపుమీదకూడా బెత్తాలు విరగగొట్టేవాడి వనుకుంటా. ఆ రోజున నిన్ను 'గాడిద' అని అన్నాను కాని, ఇవాళ నీ

ప్రవర్తన, నిన్ను అలా అనటం గాడిదనుకూడా అవమాన పరచటమే అనిపిస్తోంది'' అన్నది.

ఇంతలో మృణాళిని ఏడుపు గొంతుతో, "ఏమిటి బావా! నువ్విక్కడ ఇలాగే నిలబడి ఆమె మాటలనన్నిటినీ సహిస్తావా? ఇంక నిన్నిక్కడ ఒక్క క్షణం ఉండనివ్వను— ఏమయినా సరే... ఊఁ. పద. వెళ్ళు యిక్కడనుంచి..." అంటూ విలవిల లాడింది. నివారణుడు వధువుకేసి తీక్ష్ణంగా చూస్తూ "నీ కిదంతా ఏం చూచుకున్న అహంకారమో తెలిసిపోయింది. కాని నేను చెపుతున్నా - నీ గర్వం అణచి తీరుతాను. ఇప్పుడింత కొమ్మెక్కి కూచున్న దానివి రేపేవచ్చి కాళ్లమీద పడతావ్. ఆఁ. ఇక్క డెవరున్నారో వాళ్ళందరి పేర్లూ నువ్వు రాసుకో మీనా! వీ ళ్ళంతా నాన్నగారి దగ్గిర సాక్ష్యం ఇవ్వాలి'' అన్నాడు.

చండి నవ్వుతూ ద్వారం కేసి చూస్తూ, "ముల్లా పరుగు మసీదు దాకానే! కాని మీ బావకి ఈ సలహా ముందే ఎందు కిచ్చావు కాదు మృణాళినీ!'' అన్నది.

మృణాళిని ముఖం ముడుచుకుని, "ముల్లాని ఎరుగను, ఆ మసీదుని యెరుగను. కాని తొందరపడకు, రేపు కళ్ళ నీళ్లతో కాళ్ళ పారాణి కరిగిపోతుంటే అప్పుడు తెలిసి వస్తుంది'' అన్నది.

చండి చప్పున వచ్చి ఒక చెయ్యి మృణాళిని భుజం మీద వేసి, రెండో చేత్తో ఆమె నోరు మూస్తూ పరిహాస ధోరణిలోనే —కాస్త దయ ఉంచి, నోరు జారకమ్మా! నోరు జారకు. ఇవాళ మా పూలపానుపు రాత్రి. పరిహాసాలు

తప్ప మరొకమాట అనటం పాపం! కనుక కొంచెం సావధా నంగా ఉండు" అన్నది.

మృణాళిని శరీరమంతా కొయ్యబారిపోయింది. మెడ అటూ యిటూ తిప్పలేకపోయింది. నోట్లోంచి మాట పెక ల్చుకో లేకపోయింది. విద్యుత్ స్పర్శ సోకినట్లు మొహం వేలవేసుకుని చండికేసి చూడసాగింది. ఒక్క నిమిషం అయ్యాక చండి ఆమె భుజంమీదనుంచి చెయ్యి తీసేసి, ఆమెకి విముక్తి కలిగించింది. తర్వాత అక్కడి స్త్రీల కేసి చూస్తూ "మీరు ఆవిడతో వెళ్ళి మీపేర్లు ఇవ్వండి. రేపు మీకందరికి సమను లొస్తాయి" అన్నది.

ఆ స్త్రీలలో ఒకామె "మే మంతా మీ పక్షమే. కావాలంటే ఇప్పుడే వీరందర్నీ కదిలించి చూడండి" అన్నది.

"మరిది మిమ్మల్నందరిని సాక్ష్యం వేసుకుంటా నని చెప్పి వెళ్ళాడు, వినలేదూ? మీరు అతడి తరఫునే సాక్ష్యం యివ్వండి. నా సాక్ష్యం ఏదో నా కుంది" అన్నది చండి.

మృణాళిని ఇప్పటికి గుక్క తిప్పుకుని- "ఈమె నా మెడ మీద చెయ్యి వేసింది. నా నోరు నొక్కేసింది. మీ రంతా చూశారుగా! మీ రంతా ఈ సంగతి జమీందారుగారి దగ్గర చెప్పాలి" అన్నది.

అక్కడి స్త్రీ లంతా మనస్సులో నొచ్చుకున్నారు. కొందరు "పూలపాన్పు నాటి రాత్రి గదిలోకి వచ్చి ఇంత అసహ్యంగా ప్రవర్తించా రేమిటి?" అంటూ అసహ్యించు కున్నారు.

స్త్రీలు రణగొణధ్వని చేసుకుంటూ మృణాళినితో సహా అందరూ వెళ్ళిపోయారు. చండి కప్పటికి విముక్తి లభించింది.

# 13

అందరూ వెళ్లిపోయిన ఒక క్షణానికి చండి కూడా ఆ గదిలోంచి బయటికి వచ్చింది. ఈ భవనం వాకిలిముందు యిద్దరు పరిచారికలు కూచుని, కూచునే కునికిపాట్లు పడుతున్నారు. ఈమెను చూడగానే వాళ్లు చటుక్కున లేచి నిలబడి, "ఏమి కావాలి అమ్మగారూ ?" అని అడిగారు.

"ఏమీ అక్కర్లేదు. ఇంక మీరు నిద్ర పొండి" అన్నది. చండి. వాళ్లు విస్తుపోయి ఆమె కేసి చూస్తూ "రాత్రి ఒక వేళ ఏదైనా అవసరమొస్తే - మేము రాత్రి అంతా వంతు ప్రకారం మేలుకుని ఉండాలి ఇక్కడ. ఒకరం కాస్సేపు నిద్దరోతే ఇంకొకరం మేల్కొంటాము" అన్నారు.

"మీ రిలా రాత్రి తెల్లవార్లూ ఇక్కడ పడి ఉండాల్సిన అవసరం లేదు. ఏదైనా అవసరమొస్తే అది నేనే సర్దుబాటు చేసుకోగలను. నేనేం అవిటిదాన్ని కాను వెళ్ళండి మీరు."

వాళ్లు తెల్లబోతూ అక్కడ నుంచి వెళ్ళిపోయారు. చండి స్వయంగా తలుపులు వేసేసి, తన గదిలోకి తిరిగి వచ్చింది. గోవిందుడు మంచంమీదనే కూచుని ఉన్నాడు. వధువు మెల్లిగా అతడి యెదుటికి వచ్చి, చిరునవ్వుతో అతడి

ముఖంకేసి చూసింది. గోవిందు డిప్పటిదాకా - తా నివాళ ఇన్ని మాటలు మాట్లాడటం తప్పా - ఒప్పా అని ఆలోచిస్తూ కూచున్నాడు.

చండి తనకేసి శాంతంగా చూడటంతో, ధైర్యం చేసి ఎలాగైనా ఆమె నడిగి తన సందేహం తీర్చుకోవాలని ఆదుర్దా పడసాగాడు. కొంచెం ముందుకు వంగి, ఎంతో ఆసక్తితో —"నువ్వే చెప్పు — నే నివాళ ఇన్నిమాటలు మాట్లాడటం తప్పు చేసినట్లా - లేక మంచిపని చేసినట్లా?" అని అడిగాడు.

"మీరుచేసింద మంచి అవునో కాదో మీరే ఆలోచించుకొని తెలుసుకో లేరా ?" అని గంభీరంగా జవాబు ఇచ్చింది చండి.

గోవిందుడు నిరుత్తరుడై చండి ముఖంకేసి చూస్తూ ఊరుకున్నాడు. అతడి మ్లాన దృష్టి మాత్రం 'నే నా మాత్రం తెలుసుకో గలిగితే ని న్నెందుకు అడుగుతాను?' అన్న భావాన్ని వ్యక్తం చేస్తున్నట్లుంది.

వధువు భర్త ముఖభంగిమకేసి ఓరగా చూస్తూ "పెళ్లినాటి రాత్రి సంగతి ఎవరు చెప్పమన్నారు మిమ్మల్ని? వచ్చిన పేరంటాళ్ళంతా అలా వేళాకోళాలు పట్టిస్తున్నా మీరు గ్రహించలేదూ?" అని అడిగింది.

"ఓహో ! అందుకనా నువ్వు అప్పుడే కళ్లతో గద్దించావ్ ? కాని ఆ మాటలు ఎవరితో చెప్పకూడదని నువ్వు నాతో చెప్పలేదుగా ! నువ్వు ఆ మాట చెప్పి వున్నట్లయితే నే నసలు చెప్పే వాణ్ణి కాను. ఇంకెప్పుడూ చెప్పను."

"మనస్సులో ఉన్న విషయాలన్నీ పైకి చెప్ప కూడదు. భార్యాభర్తలిరువురూ చెప్పుకున్న మాటలు బయటవాళ్ల చెవిని పడనీయకూడదు. ఇహనుంచి మీరు నేను చెప్పినమాటలు ఎవరితోనూ చెప్పకూడదు. మీ మన స్సులోనే దాచుకోవాలి. తెలిసిందా?"

"తెలిసింది - తెలిసింది. పెళ్ళాం చెప్పిన మాటలు ఎవరికీ చెప్పకూడదు. అలా చెప్పటం తప్పు. ఇంక నేనెవ్వ రికీ ఎప్పుడూ చెప్పను."

"వీలైనంతవరకు చెప్పకుండా ఉండటమే మంచిది. ఏదైనా చెప్పవలసి వస్తే వెనకా ముందు ఆలోచించుకుని మరీ చెప్పాలి. ఇవాళ మీ రన్న మాటల్లో ఒక్కదానికి మాత్రం నాకు చాలా సంతోషం వేసింది."

"సంతోషమా? నిజమే? వాహ్వా! భలే!"

"కాని ఏ మాట అని అడగ లేదేం?"

"చెప్పు - చెప్పు నువ్వు మంచిదానివి - చెప్పు."

మీ తమ్ముడు 'గాడిద' ప్రసక్తి తీసుకొచ్చి నప్పుడు మీరు చెప్పిన జవాబు ... భలే జవాబు చెప్పారు."

"చెప్పనూ! అప్పు డెంత కోపం వచ్చిందనీ నాకు!"

"అయితే మీకు కోపం అనేది వస్తూ ఉంటుం దన్న మాట?"

"ఇదివరకు వచ్చేది కాదు. కాని ఇప్పుడు వస్తోంది. నిన్నెవరైనా ఏమైనా అంటే ఇలాగే కోపం వస్తుంది. ఆ కోపంలో ఏం చేసేవాడినో తెలియదు నా కిప్పుడు. కాని నువ్వు మళ్ళీ కళ్ళెర్ర చేసి చూశావుగా —"

"మీరు తెలివి తక్కువ వాళ్లలాగా మరీ గొడవ చెయ్య సాగారు ఆడవాళ్ల యెదట అలా చప్పట్లు చరిచి, అరవటం మొదలెడితే మిమ్మల్నే తప్పు పడతారు."

"సరే అయితే ఇహ నే నెప్పుడూ ఆడవాళ్ల యెదుట బిగ్గరగా మాట్లాడను.

"ఇవాళ మన పూల పానుపు —— తెలుసుగా?"

"అది కూడా తెలియదంటావా? ఇన్ని పూలు - ఇంత హడావుడీ —"

"సరే కానీండి. ఈ పెద్దఫొటో ఎవరిది? మీ అమ్మ గారిదా?"

"ఆఁ. ఆఁ. ఆవిడే మా అమ్మ."

"మీ కావిడ గుర్తు ఉన్నారా?"

"ఎలా గుర్తు ఉంటుంది? మా అమ్మ చనిపోయే నాటికి నేను మరీ చిన్నవాణ్ణిగా!"

"ఈ గదిలో ఉన్న ఫొటో లన్నిటికి ఇవాళ పూల దండ లేశారు. ఈ ఒక్క ఫొటోకి మాత్రం వెయ్య లేదు. ఎం చేత వెయ్యలేదో తెలుసా?"

"నా కేం తెలుసు? బహూశా మరిచిపోయా రేమో!"

"కాని వాళ్లు చేసిన పొరబాటును మనం చక్క దిద్దాలి. ఇంట్లో దండల కేం కొదువ లే దివాళ. మీరు లేచి వెళ్లి ఓ దండ తీసుకొచ్చి మీ అమ్మగారి ఫొటోకి మీరే స్వయంగా వెయ్యండి."

గోవిందుడు మంత్ర ముగ్ధుడిలాగా మంచంమీది నుంచి లేచాడు. ఇవాళ గదిలో ఎక్కడ పడితే అక్కడ

కావాల్సి నన్ని దండలున్నాయి. వాటిల్లో ప్రశస్తమైన దండ ఒకటి చండి ఏరి తీసుకొచ్చి భర్త చేతి కిచ్చింది. ప్రక్క గదిలోంచి తానే ఓ కుర్చీ తీసుకొచ్చి ఆ ఫోటో ఉన్న గోడ దగ్గరగా వేసింది. గోవిందుడు ఆ కుర్చీమీద యెక్కి తల్లిఫోటోకి ఆ పూలదండ వేశాడు.

చండి ఆ కుర్చీ పక్కకు నెట్టి భర్త చెయ్యి పట్టు కుంది. ఇద్దరూ ఆ ఫోటోఎదుట నతజానువులై కూచుని "మే మిద్దరం ఈ శుభరాత్రివేళ ముందుగా నీ ఆశీర్వాదాన్ని కోరుతున్నాం తల్లీ ! మాకు మనోబలాన్ని ప్రసాదించు. నీ ఆశీర్వాదం వల్ల మేము జ్ఞాన వంతులం కావాలని భక్తి పూర్వకంగా ప్రార్థిస్తున్నాం" అంటూ నమస్కరించారు.

వ్రతంచేసేవారు పురోహితుడు అనమన్న మంత్రాల నన్నింటిని ఎలా అంటారో అలాగే చండి అనమన్న మాటల నన్నింటిని గోవిందుడు తు. చ. తప్పకుండా గద్గదకంఠంతో ఉచ్చరించాడు. "రోజూ మనం ఉదయం సాయంత్రం ఇలాగే ప్రార్థిద్దాం. తర్వాత ఉత్తమవిజ్ఞానాన్ని పొందటానికి కఠోర మైన సాధనను అవలంబిద్దాం" అన్నది చండి.

గోవిందుడు జిజ్ఞాసా దృష్టితో చండి ముఖం కేసి చూడసాగాడు. చివరిమాటలు అతడికి సరిగ్గా బోధపడలేదు. అది చండి గ్రహించి, "నా మాటలు మీకు సరిగ్గా బోధ పడలేదల్లే ఉంది. కాని నోటితో చెపితే బహుశా మీరు అర్థం చేసుకోలేరేమో ! మనం సాధన మొదలెట్టాక ఒక్కొ క్కటే అన్నీ మీకే అర్థమవుతాయి. కాని ఆ సాధనక్రమా నికి ఈ శుభరాత్రి సమయాన ఇదేప్రారంభం. ఇవాళ నుంచే

మన సాధనకు కంకణబద్ధులం కావాలి. పదండి. మన పుస్తకాల గదిలోకి వెడదాం'' అన్నది.

ఏమిటో ఇంక తనని పైన శాసించే పెద్ద లెవరూ లేనట్లు తనే ఈ యింటికి సర్వాధికారిణి యైనట్లు - అంత నిస్సంకోచంగా - అతి సహజమైన ధోరణిలో - చండి మంత్రముగ్ధునిలా ఉన్న భర్తని చెయ్యి పుచ్చుకుని పుస్త కాల గదివైపుకు తీసుకెళ్ళింది.

# 14

కచేరీలో పని అయిపోయినా ప్రైవేట్ రూంలో దివాన్‌జీతో *జమీందారుగారి సంభాషణ ముగియ లేదు. హరినారాయణబాబు పెద్ద బాలీసుకి చేరగిలపడి కూచుని, హుక్కా పీలుస్తూ కోడలి గుణగణాల్ని గురించి గొప్పగా చెబుతున్నాడు. అతడు చెపుతున్న వన్నీ బల్లమీద పరిచిన తివాసీ అంచున కూచుని ఉన్న రాధానాధబాపూలీ అతి శ్రద్ధగా వింటున్నాడు. ఇలాంటి సమయంలో నివారణుడు బుంగ ముఖం పెట్టుకొని ఆ గదిలోకి వచ్చాడు.

హరినారాయణబాబు తన సంభాషణను చటుక్కున ఆపి, నివారణుడికేసి ఆశ్చర్యపోతూ చూచాడు. నివార ణుడు రోజూ నియమంగా కచేరీకి వస్తాడు. తనకి ప్రత్యే కంగా ఉన్న గదిలో కూచుని, కచేరీవ్యవహారాలు చూస్తూ ఉంటాడు. రోజూ వచ్చే మహాజర్లను, ఫిర్యాదుల్ని నివా రణుడు చదివి, వాటిమీద తన అభిప్రాయాన్ని సూచనప్రా యంగారాసి జమీందారు దగ్గిరకు పంపిసూ ఉంటాడు.

తర్వాత జమీందారు ఖాటని స్వయంగా పరిశీలించి, దివాన్‌జీ సలహాకూడా తీసుకుని పరిష్కరిస్తూ ఉంటాడు. ఇవాళ నివారణుడు కచేరీకి రాలేదు. అతడు రాలేదన్న సంగతి హరి నారాయణబాబుకి తెలియక పోలేదు. కాని ఆ సమయంలో తన గదిలోకి నివారణుడు రావటం, పైగా ముఖం అలా ఉండటం - విచక్షణుడైన ఆ భూస్వామి బుర్రలో సంశయాల్ని రేకెత్తించాయి.

అతడు ఒక్క క్షణం నివారణుడి కేసి రెప్ప వాల్చకుండా చూసి, "ఇలాంటి అసమయంలో ఇక్కడి కొచ్చావెందుకు నివారణ్ ? ఇవాళ కచేరీకి వచ్చి కూచోలేదుటగా: వంట్లో కులాసాగా ఉందా ?" అని అడిగాడు.

నివారణుడు మామూలుగా తన కటువైన ధోరణిలోనే జవాబు చెప్పాడు. - "చిత్తం నా వంట్లో అయితే బాగానే ఉంది; కాని మనస్సే బాగా లేదు. అందు చేతనే ప్రొద్దున మేడదిగి కచేరీకి రాలేకపోయాను. మీరు పైకి వస్తారేమో అని ఇంతసేపూ ఎదురుచూస్తూ కూచున్నాను. మీరు రావటం ఆలస్యం అవటంచూసి, గత్యంతరం లేక ఇహ నేనే ఇక్కడికి వచ్చేశాను."

నివారణుడు ఈ మాటలన్నీ ఇలా ఒక్క గుక్కలో చెప్పేశాడు. తాను చెప్పబోయే విషయాని కిది భూమిక అన్నట్లు ... అసలు సంగతింకా అలా గుంభనగానే ఉంది. అది చెప్పటానికే ఈ వేళగాని వేళ్ళ పరుగెత్తు కొచ్చింది.

కొడుకు ముఖ కవళిక - అతడి మాటల్లో ప్రచ్ఛన్నంగాఉన్న అభిమానమూ పసికట్టి - అత డీ అసమయంలో

ప్రీతికరమైన విషయాలు మాట్లాడటానికి రాలేదని గ్రహిం చాడు తండ్రి. కొడుకు స్వభావం తండ్రికి తెలియనిది కాదు. అంచేత పైకి కృత్రిమమైన కుతూహలాన్ని వ్యక్తపరుస్తూ "అయితే ముఖ్యమైన సంగతేదో ఉండి ఉంటు దనుకుం టాను?" అన్నాడు.

"చిత్తం!"

"అయితే నుంచున్నా వెందుకు కూచో. ఆ విషయం ఏమిటో చప్పున చెప్పేసెయ్. ఇప్పుడు టైము చాలా అయింది. అదేమిటో వినాలని చాలా కుతూహలంగా ఉంది."

నివారణుడు దివాన్ కేసి వక్రంగా చూసి, అప్రసన్న భావంతో - "నేను చెప్ప దలచిన మాటలు మీతోనే ... మీ కొక్కరికే చెపుదామని ఉంది." అన్నాడు.

నివారణు డీ మాట అనగానే దివాన్‌జీ లేవబోతూ "ఐతే ఇంక నే వెళ్ళి వస్తాను. మీ మాటలు కానివ్వండి" అన్నాడు సంకోచిస్తూ.

హరి నారాయణబాబు చెయ్యెత్తి వద్దని వారిస్తూ, "బావుంది లక్షణం! ... మన సంభాషణ ఇంకా పూర్తి కాందే నీవు లేచివెళ్ళట మేమిటి బాపూలీ?" అన్నాడు. తర్వాత కొడుకు వైపుకి తిరిగి తీక్షణంగా చూస్తూ "మన ఎస్టేటుకి సంబంధించినవి కాని, మన గృహానికి సంబంధిం చిన వ్యవహారాలు కాని మన దివాన్ గారి యెదుట చెప్ప కూడనివంటూ ఏవీ లేవని నీకు తెలుసుగా నివారణ్! ఇంక ఊరికే తాత్సర్యం చెయ్యక చెప్పతలచిం దేమిటో చెప్పు" అన్నాడు.

నివారణుడి ముఖం వివర్ణ మయింది. సుసమర్థుడైన దివాన్ బాపూలీమీద అతడి కేనాడూ అంత గౌరవం లేదు. తండ్రి అతడ్ని అత్యంత ఆత్మీయుడిగా భావించటం - పుత్రుడి ద్వేషపూరిత హృదయానికి కొంచెం కష్టంగానే ఉండేది. ప్రభు - భృత్య సంబంధం మాత్రమే ఉండవలసిన చోట - ఇలాంటి కృత్రిమమైన ఆత్మీయతా భావం - ఇసుకతో కట్టిన గోడలాగా, పేక మేడ లాగా బలంలేనిదే అవుతుంది. అంచేత నివారణుడు ఎన్నడూ అతడి యెడ గౌరవంగా ప్రవర్తించేవాడు కాదు. అదీ కాక ఆఫీస్ ఎడ్మినిస్ట్రేషన్ విషయంలోకూడా దివాన్‌తో అతడికి అభిప్రాయ భేదాలున్నాయి. అలాంటి దివాన్ ఎదుట తండ్రి ఇలా నిగ్గ తీసి అడగటం - కొడుకు మనసుకు అఘాతంగా తగిలిందంటే ఆశ్చర్య మేమీ లేదు. సహజమే ...

కాని ఇవాళ నివారణుడు దేనికైనా సిద్ధపడే వచ్చాడు. నిన్నగాక మొన్న వచ్చిన ఆ ప్రగల్భురాలైన వధువు తలవని తలంపుగా తమ సంసారంలో ఒక చిన్న విప్లవాన్ని లేకెత్తిస్తోంది. ఇప్పటివరకూ నిరాఘాటంగా సాగిపోతున్న తమ (తల్లీకొడుకుల) శాసన శకటానికి అడ్డుగా వచ్చి నిలబడబోతోంది. అలాంటి ఆమెమీద తన తండ్రికి మనస్సులో ఎలాంటి అభిప్రాయం ఉన్నదీ ఇవాళ ఎలాగో అలా మథించి అయినాసరే తెలుసుకోవాలి. అంచేత ఇహ దివాన్ అక్కడున్నా అతడ్ని నిర్లక్ష్యం చేసి, నివారణుడు తన విషమసమస్యా పరిష్కారాన్ని గురించి యోచించ సాగాడు.

ఇంక తర్వాత ఉపోద్ఘాత మేమీ లేకుండానే "నేను మీతో ఓ పెద్ద ఫిర్యాదు చెయ్యటాని కని వచ్చాను" అన్నాడు తండ్రితో.

నివారణుడు ఒకవేళ కత్తి చూపించి, 'మిమ్మల్ని ద్దర్నీ ఖూనీ చెయ్యటానికి వచ్చాను' అని అన్నా ఆ గదిలో తివాసీలమీద కూచున్న వృద్ధు లిద్దరూ ఇంత ఉలిక్కి పడేవారు కారేమో! నివారణుడి నోటిమీదుగా 'ఫిర్యాదు' అన్న మాట వినేసరికి ఉభయులూ విస్మితు లయినారు. నిజంగా విస్మితులవటానికి హేతువుకూడా వుంది ఇంతవరకూ జమీందారుకాని, దివాన్ కాని, ఎవరూ ఈ బేఫర్వా యువకుడు ఒకర్ని గురించి ఫిర్యాదు అంటూ చెయ్యటమనేది యెరుగరు. నివారణుడికి విరుద్ధంగా ఎన్నోసార్లు - ఎన్నో చోట్ల నుంచి ఫిర్యాదులు రావటం జమీందారుగారికి తెలుసు. కాని అత డెన్నడూ ఫిర్యాదు చేసి యెరగడు. ఎవరయినా అతడి కోపానికి గురి అయినారో వారిని తండ్రికి తెలియకుండా తానే విచారిస్తాడు. వాళ్ళకి తన ఇష్టం వచ్చిన శిక్ష విధిస్తాడు నిస్సంకోచంగా. అందాకా యెందుకు - ఎప్పుడైనా దివాన్‌జీ అతడి యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించినా సరే - తండ్రి దగ్గరకు రాకుండానే నిర్లక్ష్యంగా 'జ్ఞాపకం ఉంచుకోండి. సింహశాబకాన్ని నేను. నాతో మాట్లాడేటప్పుడు ఎప్పుడూ మర్యాద తెలుసుకొని మరీ మాట్లాడండి' అని అంటాడు. కొడుకు దుండగా లన్నీ ఎప్పటివప్పుడు తండ్రి చెవిని పడుతూనే ఉండేవి. కాని, శిక్షించటం విషయంలో మాత్రం అతడు కొంచెం ఉదాసీనంగా ఉండేవాడు.

వ్యంగ్యంగా 'వాడి పేరే నివారణుడసలు. కనుక ఎవరు వారించ బోయినా వాడు సహించడు' అనేవాడు.

పుత్రుడి విషయంలో జమీందారుగారి దౌర్బల్యాన్ని గురించి ఎన్నో వదంతులు, కథలు ప్రచార మయినాయి. ఎన్నో ఆకాశ రామన్న ఉత్తరాలు కూడా వచ్చేవి అతడికి. కాని అనుచిత వాత్సల్యం చూపించడం అనే దోషం తన యందు ఉన్నదని హరినారాయణబాబు తెలుసుకున్నా - ఈ దుండగుడైన కొడుకుని వారించటానికి కాని, శాసించటానికి కాని, అత డెన్నడూ వృథా ప్రయాస పడలేదు. ఈ విషయంలో ఆయన మనస్సులో నిగూఢంగా ఉన్న అభిప్రాయ మేమిటో ఆయనకే తెలియాలి.

అలాంటి దుర్దాంతుడైన నివారణుడు ఇవాళే మొట్ట మొదటిసారిగా 'ఫిర్యాదు' చెయ్యటాని కని అతడి ఎదుటికి వచ్చి నిలబడ్డాడు. అతడు కొంచెంసేపు అలా స్తబ్ధుడైపోయి నివారణుడి ముఖంకేసి చూస్తూ ఉండి పోయాడు. పెదవి కదిపి ఒక్క మాట మాట్లాడ లేదు. 'ఇలాంటి సంఘటన నా జీవితంలో యెన్నడూ జరగలేదే! నివారణుడు ఫిర్యాదు చెయ్యటమా! తూర్పున ఉదయించే సూర్యుడు పశ్చిమాన ఉదయిస్తున్నాడా!'' అని అతడు పూర్వస్మృతులను నెమరుకు తెచ్చుకుంటున్నా డల్లే ఉంది! ఆ మాట తాను స్వయంగా తన చెవులతోనే విన్నాడు. విన్నబోయిన అతడి ముఖం ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఇహ విశ్వసించక పోవటం యెలా? ...

ఒక్క క్షణం అయినాక అతడు కొంత తమాయించుకొని, నువ్వు నా దగ్గిరకి ఫిర్యాదు చెయ్యటానికి వచ్చావు ... అవునా! ... అయితే ఇదేదో మామూలు వ్యవహారంగా భావించటానికి వీల్లేదు. సరే ... ఇంతకీ అవతల ప్రత్యర్థి యెవరు? ఎవరిమీద నీ వీ ఫిర్యాదు చేస్తున్నావ్?'' అని అడిగాడు.

నివారణుడు తండ్రికేసి కళ్ళెఱ్ఱజేసి చూస్తూ, ''అయితే మీ రింతవరకు అసలేమీ గ్రహించ లేదన్నమాట!'' అన్నాడు మరింత కరుగ్గా .

అత డీ మాట లనటం అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. గదియావత్తూ భయంతో దద్దరిల్లిపోయేట్లు గర్జించాడా వృద్ధ కేసరి. ''నోరు మూయ్ మూర్ఖుడా! ఫిర్యాదు చెయ్యటానికని వచ్చినవాడివి కళ్లెఱ్ఱ చేస్తా వెందుకు? ఇహ నుంచి కొంచెం తగ్గిమాట్లాడటం నేర్చుకో.''

ఇన్నేళ్ళొచ్చాయి - ఎన్నడూ తండ్రి తనని ఇలా గద్దించి మాట్లాడటం యెరుగడు నివారణుడు. కఠినస్వభావుడైన తండ్రి యెదుట నిస్సంకోచంగా మాట్లాడగల ధీమా అతడికి ఒక్కడికే ఉంది. అత డెన్నోసార్లు తండ్రి మొహం మీదే ఇంతకన్న మరీ కటువుగా మాట్లాడాడు. అలాంటప్పుడు అక్కడున్న వాళ్ళంతా ఇత డిలా మాట్లాడటం చూసి, ఉలిక్కి పడుతూ ఉండేవాళ్లు ... కాని అత డెవర్ని గురించి యింత నిర్మొహమాటంగా మాట్లాడేవాడో అతడి కనుబొమలు కూడా ముడిపడేవికావు. పైగా చిరునవ్వుతో అతడు తన ఒత్తైన మీసం దువ్వుకోటం చూసి,

నివారణుడే విస్మితుడౌతూ ఉండేవాడు. దివాన్ రాధానాథ బాపూలీకూడా అలాగే నవ్వి వూరుకునేవాడు. కాని ఇవాళ అంత గారాలకూచి అయిన కొడుకును జమీందారుగారు ఇంత కఠినంగా మందలించటం చూసి, అతడుకూడా తెల్ల బోయాడు.

నివారణుడు కొంచెంసేపు మెదలకుండా ఊరుకుని, మనస్సులో తన సంకల్పాన్ని స్థిరీకరించుకుని, "అయితే, నా ఫిర్యాదును కాగితంమీద పెట్టియిస్తాను" అన్నాడు.

"వద్దు. అదేమీ అవసరం లేదు. నువ్వు చెప్పా లను కుని వచ్చిన దేమిటో ఇక్కడే చెప్పి వెళ్లు" అన్నాడా తండ్రి ...

"సరే, చెపుతాను. కాని ఇవాళ నేను చెప్పేది మీ మనస్సుకు నాటదని తోస్తోంది నాకు —"

"అనవసరమైన మాటలు మాట్లాడవలసిన ఆవశ్యకత ఏమీ లేదు. నీ ఫిర్యా దేమిటో - చెప్పు ముందు."

"మీరు ఎవరితోనూ సంప్రదించకుండా సామాన్య కుటుంబంలో పుట్టిన ఒక అమ్మాయికి కుల వధువు అనే గౌరవమిచ్చి, అల్పురాలికి ఆధిక్యత కట్టబెట్టాయి ..."

"ఇది నీ ఫిర్యాదు కాదు నివారణ్ ! నేను చేసిన పనిని గురించి అనధికార చర్చ —"

"కాని మీరు చేసిన పనిని ఇలా నిష్కర్షగా విమ ర్శించటం కొత్తకాదు నాకు"

"నువ్వు ఆ యోగ్యతను పోగొట్టుకున్నావ్. నీ కింక ఆ అధికారం లేదు. నీ ఫిర్యా దెంతవరకో అదే వినదలుచు

కున్నాను నేను. నీ ముందర నేను చేసిన పనులకు సంజాయిషీ చెప్పుకునే సమయం రాలే దింకా.''

"గోవిందుడి భార్యామీద నా ఫిర్యాదు —"

''చెప్పు - వింటాను''

''ఆవిడ అందరి యెదుటా న న్నవమాన పరిచింది.''

"ఏం చేసింది ?"

"మీరు ప్రధానానికి వెళ్ళి నప్పుడు - ఆమె కొక బంగారు కొరడా బహూకరిస్తూ 'మా యింట్లో ఒక గాడిద ఉంది దాన్ని ఈ కొరడాతో లొంగదీసుకోవా లని చెప్పా రటగా — !''

"చెపితే నీ కెందు కీ వళ్లు మంట ?''

"ఆ గాడిదని నేనే నని, మీ రిచ్చిన కొరడా నా మీదే ఝుళిపిస్తా నన్నది ఆవిడ ... అందుకుని"

"కోడలు నిజంగా అన్నదా ఆ మాట ?''

"చాలా మంది యెదుట ... సాక్ష్యాని కేం లోటు లేదు.''

"ఆ మాట అస లెందుకు వచ్చింది ? చెప్పు.''

''ఆమె నన్ను చూడగానే మేలిముసుగు వేసుకుంది. ఆవిడ ముఖం ఎలా ఉంటుందో చూడా లనిపించింది. మీనాని మేలిముసుగు తియ్య మన్నాను — ''

''నువ్వు చేసిన ఈ కాస్త తప్పుకే ఆంత రూఢమైన మాట అన్నదా ?''

"అన్నదో, లేదో ఆవిడనే అడగండి ముందు. మీరు ఆవిడకి కొరడా బహూకరించినట్లు, గంగూలీ వంశంలోని

గాడిదని లొంగతీసుకోమని చెప్పినట్లు, ఈ సంగతు లేవీ నా కిదివరకు తెలియవు. అసలావిడ నోటినుంచి బయట పడే వరకు నాకే కాదు, ఈ యింట్లో ఎవరికీ తెలియ దను కుంటాను.''

''ఊఁ ... తర్వాత? ఇంకా చెప్పవలసిన దేమైనా ఉందా?''

''ఆవిడ మా తాతగారినిగూడా అనమాన పరిచింది.''

''ఏ మన్నది?''

''కీ ర్తి శేషులై న మా తాతగారిని గురించి పూలపానుపు నాటి రాత్రి గదిలో ఉన్న అంతమంది పేరంటాళ్ల యెదుట ... ఎంత వాతప్పమాట అన్నదో తెలుసా? ఆ మాట వింటే మీరుకూడా కంపించి పోతారు.''

''ఏ మన్నది?''

''అప్పుల్లో మునగటంవల్ల ఆయన తన కూతుర్ని-మా అమ్మని - అమ్ముకున్నాట్ట.''

''కోడలు అన్నదా ఈ మాట? మా చండి.''

నివారణుడు జేబులోంచి కాగితం తీసి, తండ్రి చేతి కిచ్చి ''అప్పుడు అక్కడెవరున్నారో, ఆవిడ ఈ మాట అంటూండగా ఎవరై తే విన్నారో - వారందరి పేర్లూ ఇందులో ఉన్నాయి. నే చెప్పినమాట నిజమో, కాదో దర్యాప్తు చేసి తెలుసుకోండి'' అన్నాడు.

అప్పుడా కాగితం మీద రాసి ఉన్న అక్షరా లన్నీ, హరినారాయణబాబు దృష్టికి పాము మెలికల్లా కన్పించ సాగాయి. అతడి బుర్ర బాగా వేడెక్కింది. దృష్టి వెల వెల

బోయింది. తాను ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్న తన గారాబు కోడలి మీదనే ఇంతటి అభియోగమా? తన మామగారినే ఇంతమాట అనటానికి సాహసించిందా? ఎంత అహంకారం!

హరినారాయణబాబు కాస్సేపు నిశ్శబ్దంగా కూచుని ఆలోచించి, "సరే, ఇంక నువ్వు వెళ్లవచ్చు నివారణ్! నీ ఫిర్యాదు నేను స్వీకరించాను. విచారణలో లోపమేమీ జరగదు" అన్నాడు.

నివారణుడు మారు మాట్లాడకుండా ఒక్కసారి తీక్ష్ణంగా తండ్రి ముఖం కేసి చూసి, ఆ గదిలోంచి మెల్లిగా వెళ్ళిపోయాడు.

హరినారాయణబాబు దీర్ఘంగా నిట్టూర్చి "బాపూలీ! విన్నావుగా ఇదంతా?" అన్నాడు.

బాపూలీ యజమాని ముఖంమీద చూపు నిలిపి, "మీ ఊహకి ఎలా తోస్తోంది?" అని అడిగాడు.

"నివారణుడు అబద్ధం చెప్పలేదు. బంగారు కొరడా సంగతి ఈ యింట్లో మన యిద్దరికీ తప్ప ఇంకెవరికీ తెలియదు. రాణీకూడా తెలియదు ఆఖరికి."

బాపూలీ విచలిత కంఠంతో — "అయితే తమ ఉద్దేశం ఆమె నివారణుడ్ని —"

హరినారాయణబాబు ఉత్తేజిత కంఠంతో, బాపూలీ మాటకు అడ్డు వచ్చి, "ఆఁ. వాణ్ణే స్వర్ణగార్ధభం క్రింద కట్టింది. నా అభిప్రాయం గ్రహించ లేదు. అక్కడే తప్పటడుగు వేసింది. సాధారణంగా ఆడవాళ్ళంతా ఎక్కడ పట్టుబడ

తారో - ఈ అభాగ్యురాలుకూడా సరిగ్గా అక్కడే పట్టు బడింది'' అన్నాడు.

''నా కొక్క విషయం తెలుసుకోవా లని ఉంది.''

''అడుగు.''

''ఈ విషయమై రాణీగారు మీతో ఏమయినా చెప్పారా ?''

''ఉహూఁ. ఏమీ చెప్పకపోయినా, కోడలు వచ్చిం దగ్గర్నుంచి - ఆమెలో కాస్తంత గాంభీర్యం ఎక్కువయింది. ఆశ్చర్యం ! ఇప్పుడు నాకు తోస్తున్న దేమిటంటే - ఆమె అన్ని సంగతులు వినే ఉంటుంది బాపూలీ. కోడలి ప్రవర్తన ఆమె మనస్సునుకూడా బాగా గాయపరచి ఉంటుంది.''

''అయినా మీతో ఏం చెప్పలేదుగా !''

''నీ కేమైనా పిచ్చా ఏం బాపూలీ ! ఏమిటి నువ్వ నేది ? రాణీ ఈ వేలెడంత పిల్లమీద నాతో ఫిర్యాదు చేస్తుందా ?''

''అదీ నిజమే. కాని నే నది ఆలోచించ లేదు.''

''ఆలోచించాల్సిన సమయం ఇహ వచ్చింది. బాపూలీ ! ఇప్పు డనిపిస్తోంది - మన వంశ గౌరవం అనే దాన్ని చులకనగా చూడకూడదని ... అలా చూసిన వాళ్లు మోసపోకమానరు. నేనుకూడా మోస పోయా ననిపిస్తోంది బాపూలీ !''

''కాని నా దృఢవిశ్వాసం ఏమిటంటే - తమరు ఏ ఇంటితో సంబంధం కలుపుకున్నారో - ఆ ఇల్లు ఒక్క

డబ్బు విషయంలో తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ గొప్పదే. తమరు మోసపోలేదు.''

''నేనూ అలాగే అనుకుంటూ ఉండే వాణ్ని – కాని చేసింది పొరబాటే నని ఇప్పుడు తెలుసుకుంటున్నాను. ఈ అమ్మాయిలో ఒక్క అంశాన్నే మనం చూడ గలిగాం. ఆ విషయంలోమాత్రం జయపతాక చేబూని మనల్ని ఓడి స్తుంది. కాని మిగతా అంశాల మీదికి మన దృష్టి పోలేదు. ఈ నాడదే సహింపరాని దయింది.''

''మీ ఈ మాటల్లోని అర్థం నాకు సరిగా బోధ పడటం లేదు.''

''నువ్వు నిజంగా ఇంత అమాయకుడవా? లేక తెలి సినా తెలియనట్లు నటిస్తున్నావా? నా ఉద్దేశం ఏమిటో తెలుసా? నే నామెని కొంచెం అసాధారణురాలిగానే భావిం చాను. ఈమె మనో బలాన్ని గురించి – శారీరక బలాన్ని గురించి తెలుసుకుని ... దాంతోపాటు ఈమె అత్తవారింట అడుగు పెట్టడం మామూలు ఆడపిల్లలవలె కాదని – ఇంటిల్లి పాదినీ ఆత్మీయుల్నిగా చేసుకుంటుందనికూడా అనుకున్నాను. కాని రాగానే నివారణుణ్ని అఘాతపరిచినట్లు వాడి మాటలవల్లే తెలుస్తోంది. నివారణుడి మాతామహుని తప్పిదాన్నికూడా తెలుసుకొని అదొక పెద్ద దెబ్బ కొట్టింది. రాణీ సంగతి స్పష్టంగా తెలియదు. కాని బహుశా ఆమెకుకూడా ఇలాంటి అఘాత మేదో తగిలి ఉండక మానదని తోస్తోంది. ఈ యింటికి వచ్చి అందర్ని తనకి శత్రువుల్ని చేసుకుంటోంది. తన భర్త అప్రయోజకుడు, గాడిద లాంటి వాడూ అయి

సందుకు ఆమె మనస్సులో దుఃఖమేమీ ఉన్నట్లు కనిపించటం లేదు. ఐశ్వర్యాన్ని చూచేసరికి అన్నీ మరిచిపోయి ఉంటుంది.”

“అయితే మీ రిప్పుడు ఏం చెయ్యాలని నిర్ణయించుకున్నారు?”

“నివారణుడి మీద అలా హుంకరించినా – ఇంకా గ్రహించ లేదూ? ఉడుగోత పిందె లాంటి ఇంత పిల్ల వచ్చి నన్ను మోసగించటం, మా కుటుంబంలో విప్లవాన్ని తీసుకు రావాలని ప్రయత్నించటం నే నే మాత్రం సహించబోను. శిక్షించి తీరాల్సిందే! అపరాధం చేసిన వా రెవరూ నా నుంచి తప్పించుకోలేరు. ...”

బాపూలీ ఆర్ద్ర కంఠంతో – “అయితే నా దొక్క మనవి. ఆమె నిజంగా అపరాధిని యన్నసంగతి మీకు రుజువైతే ఆమెని శిక్షించబోయే ముందు —”

జమీందారు నవ్వుతూ “నీకు కబురు చెయ్యమంటావ్! అంతేనా! సరే, అలాగే ... పోనీ నీ సమక్షంలోనే ఆమెకి శిక్ష విధిస్తాను. శ్యామాపురం వెళ్ళి ఆమెకు బహుమతి ప్రధానం చేసినపుడుకూడా ప్రక్కనే ఉన్నవాడివి కనుక – శిక్ష విధించబోయేటప్పుడుకూడా చెంతనే ఉండటం మంచిది” అన్నాడు.

ఆ మాట్లాడటం ముగించి జమీందా రక్కడనుంచి లేచే సరికి బయట కాచుకొని కూచున్న భృత్యులందరూ కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చారు. ...

# 15

పూలపానుపు నాటి రాత్రి - కొంచెం చాటుగా ఉన్న చదువుల గదిలో కూచొని ఈ నవదంపతులు ప్రారంభించిన విద్యాసాధన ఉభయుల ఉత్సాహాతిశయంవల్ల నిరభ్యంతరంగా కొనసాగిపోతూవస్తోంది. అపూర్వమైన సాధన వారిది. వారి లక్ష్యం మోక్షం కాదు. సంస్కృతి, దాని ద్వారా పరిపూర్ణ మానవత్వ సిద్ధి. ఆ సిద్ధికోసం చేయవలసింది నిండు మనస్సుతో చదువుల తల్లిని ఆరాధించటం. ముమ్మరమైన యౌవ్వనంలో వదిలించుకోటాని కలవికాని హావభావాలు, సరస పరిహాసాలు, చతురోక్తులు, చమత్కారాలూ, మొదలైనవన్నీ సంపూర్ణమానవత్వసాధనకు ముఖ్యమైన కఠోర నిష్ఠలో కలిసిపోయాయి. ఈ అపూర్వ యువతీ యువకులకు చిత్తశుద్ధిని కలిగించి, వివేకాన్ని పురిగొల్పి, వారిని ఉజ్జ్వల హృదయుల్నిగా చేశాయి.

ఇష్ట లాభ సిద్ధికై సరస్వతీదేవిని పూజించటానికి కంకణం కట్టుకున్నవాడు భర్త. అతడికి ఆచార్యత్వం వహించింది భార్య. ఆమె మంత్ర నిర్దేశంలో కాని, దాన్ని అనుష్ఠించే విధానంలో కాని, భర్త కివ్వవలసిన గౌరవానికి భంగం కలిగించటంలేదు. అతడ్ని ఏవిషయంలోనూ న్యూనపరచటం లేదు.

తాను లాహోరులో ఉండగా బహు భాషావిదుడైన మాతామహుడివద్ద ఏ యే పద్ధతుల్లో శిక్షణ పొందిందో, సరిగ్గా ఆ పద్ధతుల్లోనే చండి గోవిందుడికి శిక్షణ నివ్వ

సాగింది. సరస్వతీదేవిని ప్రసన్నురాలినిగాచేసుకొని, విద్వాం సుణ్ణి గావచ్చునని పట్టుదలతో వ్రాయటం చదవటం నేర్చు కుంటే, ప్రపంచ పరిణామాన్ని బోధపరచుకోవటం బ్రహ్మ విద్య కాదని, గోవిందుడు గ్రహించాడు. సరస్వతీ దేవిని పూజోపచారాల్లో ప్రధానమైనవి చదవటం వ్రాయటమే. ఆమెని అతిత్వరలో ప్రసన్నురాలినిగా చేసుకోవటానికి కావ లసింది ఏకాగ్రసాధన. అతడికి చందనంమీద, పువ్వులమీద అత్తరువుల మీదకన్న చదువు మీదనే అభిరుచి ఏర్పడింది. మూర్ఖుడైన కాళిదాసు అరణ్యంలో కూర్చుని, దేవిమీదనే దృష్టినిలిపి, విద్యల్ని అభ్యసించటంవల్ల ఆమె వరపుత్రుడు కా గలిగాడు. ఆ సంఘటన గోవిందుడి మనస్సులో ఆశను రేకెత్తించింది. ఆ ఉత్సాహంలో అతడి మనస్సు నృత్యం చేసింది. సరస్వతీదేవిని ప్రసన్నురాలినిగా చేసుకుని, ఆమె అనుగ్రహంవల్ల విద్వాంసుడుకాగల సులభమైన ఉపాయాన్ని అతడి కింతవరకూ ఎవ్వరూ చెప్పలేదు. కళ్లురెండూ మూసు కుని, నిరాహారాలు విసర్జించి, మనస్సులో మంత్రాన్ని జపిస్తూ కూచో నక్కర్లేదు. చేతు లెత్తి ఆక్రోశిస్తూ, దేవిని పిలవవలసిన పని లేదు. ఎప్పుడూ పుస్తకం చేత పట్టుకొని చదవటం, తాను చదువుకున్న విషయాలు వ్రాసుకుంటూ ఉండటం - చేస్తే చాలు. అన్ని పుస్తకాలూ చదవగలి గితే, చక్కగా ముత్యాల కోవలా అక్షరాలు వ్రాయగలిగితే సరస్వతీదేవి ప్రసన్నమై దర్శనమిస్తుంది. కోరిన వరా లిచ్చి, తనని గూడా కాళిదాసంతటివాణ్ణి చేస్తుంది! ఓహో! ఇంకేం కావాలి!

చండి ఉపదేశ ప్రభావంవల్ల అదివరకుదాకా అతడిలో గడ్డకట్టిన జడత్వం కరిగిపోసాగింది. ఇష్టసిద్ధి కలగబోతోందనే ఉత్సాహంవల్ల, ఏకాగ్ర మనస్కతవల్ల, అతడిలో ఒక విధమైన ప్రతిభ క్రమంగా వికసించ సాగింది.

ఈ దంపతుల అదృష్టంవల్ల మూడుమాసాలు గడిచే వరకూ వీరిసాధనకు ఎలాంటి అవాంతరాలు రాలేదు. దూరదర్శినియైన చండి, అవాంతరాలేవీ వాటిల్లకుండా ముందుగానే కట్టడిచేసి, అతణ్ణి దీక్షా బద్ధుణ్ణి చేసింది.

వివాహంనాటి రాత్రి భర్తతో కలిగిన స్వల్పపరిచయంతోనే, అతడి విద్యా బుద్ధుల్ని, స్వభావాన్ని ఆకళింపు చేసుకుని, తన బుద్ధికి తోచినట్లు అతణ్ణి సంస్కరించవలసిన విధానాన్ని చండి ఆనాడే నిర్ణయించుకుంది. తన అసాధారణ ప్రతిభవల్ల, ఆదర్శ శిక్షకుడైన తన తాతగారి నూతన శిక్షా విధానంవల్ల ఆమె కొద్ది వయస్సులోనే ఎన్నో విద్యల్ని సాధించటానికి తనకు సహాయభూతాలైన పుస్తకాలు మొదలైన వాటినన్నిటిని - ఇష్టకవచంలాగా భద్రంగా లాహోరునుంచి శ్యామా పురానికి తెచ్చుకుంది. ఆ గ్రంధాల్ని అక్కడనుంచి ఇక్కడికి తెచ్చుకుంది. వాటిచలవ వల్లనే తాను విశ్వసాహిత్య భాండారములోని ఎన్నో అమూల్య విషయాల్ని తెలుసుకుంది. అజ్ఞాని యైన తన భర్తని విజ్ఞునిగా చేసి, అతడి యెదుట ఈ విజ్ఞాన భాండారం తలుపులు తెరిచే అవకాశంకోసం ఎదురు చూస్తోంది. లాహోరులో ఈ అమూల్యవిషయా లన్నింటిని తెలుసుకొన్నప్పుడు - తనతాతగారే సాక్షాత్తు తనకు విద్యాగురువులుగా ఉన్న సంగతి

ఆమెకు ప్రతిక్షణమూ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది. కాని మరి యిక్కడ నూతన వధువు - ఒక విధంగా విద్యా విషయంలో భర్తకు గురువైనప్పటికి - ఆ గౌరవాన్నే చూచుకోకుండా సహపాఠినిలాగా భర్తతోపాటు తానూ సాధనలో కూర్చుంది. హఠాత్తుగా చూస్తే ఈ యువతీ యువకులు పరమోత్సాహంతో ఇద్దరూ ఒక్కసారే ఏకాగ్రసాధనతో విద్యల్ని అర్థించడానికి ప్రయాసపడుతున్నారా అనిపిస్తుంది. అయినా నిజానికి చండి విద్యాపారదర్శిని గనుక తన సహపాఠికి సర్వతోముఖంగా సహాయం చేయసాగింది.

చాటుగా ఉన్న గదిలో వీరు సాగిస్తున్న ఈఅపూర్వ విద్యా సాధన విషయం గదికి వెలుపల ఉన్న గంగూలీ వంశీయుల కెవరికీ తెలియదు. పరిచారకుల నందర్నీ పంపించేసి, తలుపులు లోపల బంధించి, భర్తతోపాటు చండి అహోరాత్రాలూ ఎక్కువ సమయం ఈ సాధనలోనే గడపసాగింది. భార్యా భర్త లిద్దరూ తలుపులు బిడాయించుకుని ఇలా లోపల కూచోటాన్ని గురించి బయట రకరకాల పుకార్లు వ్యాపించాయి. కాని భర్తే తన సర్వస్వం అనుకున్న వధువుకు బాహ్యప్రపంచం వైపుకు దృష్టి లేదు. ఆమె ఆలోచనలన్నీ ఎప్పుడూ భర్తగురించే ... అవి యెప్పుడూ అతడి చుట్టూనే తిరుగుతూ ఉండేవి భర్తకు విముక్తి కలిగించటానికై ఈ తేజస్విని యైన యువతి తన సర్వస్వాన్ని ధారపోస్తుంది. అతడి జడత్వాన్ని తొలగించి, అతణ్ణి దేవతా స్వరూపుణ్ణిగా తయారుచేసి తీరుతుంది! తన భర్త ఒక్కడే అధికారాల నన్నిటిని చేతులో పెట్టుకొని, మానవ రూపం

ధరించిన దేవతలాగా విరాజిల్లుతున్నట్లు - ఆమె భావనా దృష్టితో స్పష్టంగా చూస్తూ ఉంటుంది.

లోకం కంటపడకుండా వీరి విద్యా సాధన నూరు అహోరాత్రాలు నిర్విఘ్నంగా కొనసాగింది. వీరి సాధనా ప్రభావం వల్లనే నేమో, చండికి విరుద్ధంగా తీసుకురాబడిన అభియోగం - ఈనూరు రోజుల మధ్య విచారణకు వచ్చి వారి సాధనకు విఘ్నాన్ని కలిగించలేకపోయింది.

నూరురోజుల తర్వాత ఒకనాటి మధ్యాహ్నం ఎవరో బయట తలుపు కొడుతున్న చప్పుడై - వారి చదువుల గది లోని నిశ్శబ్దతకు భంగం కలిగింది. చిన్న టేబిలు ముందు ఒకరి కొకరు యెదురుగా కూర్చుని దంపతులు లెక్కలు చేస్తున్నా రప్పుడు. తలుపు మాటిమాటికి చప్పు డవుతూండటం మూలంగా చండి విసుగ్గా లెఖల పుస్తకం అవతలకు నెట్టి లేచింది. గోవిందుడు మాత్రం తన ధ్యానంలోనే ఉన్నాడు. ఆ తలుపుల చప్పుడు గాని, ఎదురుగా కూర్చుని ఉన్న సహపాఠిని అక్కడనుంచి లేచి వెళ్లటం కాని, అతడు గమనించనే లేదు. బాహ్య జగత్తులో పరికించ వలసిందేమీ లేదన్నట్లు అతడి సర్వేంద్రియాలూ చదువు మీదికే ఆకృష్టము లయినాయి. అది పూర్తి అయేంతవరకు బయట ప్రపంచ మంటూ ఒకటి ఉన్న దన్న సంగతికూడా అతడికి గుర్తు వుండేట్లు లేదు.

ఈ మహల్‌లో ఇద్దరు పరిచారికలు హమేషా కనిపెట్టుకుని వుండాలి. భోజనా లన్నీ అయిపోగానే చండి వాళ్ల నిద్దర్నీ పంపించేసి, తలుపులు బిగిస్తుంది. మళ్ళీ సాయంత్రం

వాళ్ళు పనికి వచ్చే వేళకు తలుపులు తెరుస్తుంది. ఈ మధ్య నుండే సమయమంతా నిర్విఘ్నంగా వాళ్ల చదువుల్లో గడిచి పోతూ వుంటుంది. ఇవాళ మధ్యాహ్నం తలుపులు వేసిన కాస్సేపటికే మళ్లీ తలుపులు చప్పుడవటంతో ఆమె చాలా విసుక్కుంటూ వచ్చి, తలుపులు తెరిచింది.

కాని తలుపులు తెరవగానే తలవనితలంపుగా అక్కడికి వచ్చి నిలబడి వున్న వ్యక్తిని చూచే సరికి ఆమె విసుగు దలంతా విస్మయంగా మారింది. ఆమె ఆలిచిప్పలంత కళ్ళు చేసుకుని చూసింది. తమ పరిచారికల్లో మృణాళినిగాని, పుర వాసిని కాని ఇద్దర్లో ఎవరూ కానేకాదు - తలుపులు గొట్టి, తనకు విసుగు కలిగించింది! సాక్షాత్తు గృహయజమానే తన ఎదుట నిఠారుగా నిలబడి వున్నాడు.

"ఓ! మామగారా!" చండి నోటినుంచి మెల్లిగా వచ్చిం దీ మాట!

కాని మామగారి దగ్గర్నుంచి దీనికి సరైన సమాధానం రాలేదు. పైగా అప్రసన్నంగా వున్న అతడి చూపులు కూడా చండిని ఆకర్షింపకపోలేదు. తన విస్ఫారిత దృష్టిని చటుక్కున తీక్ష్ణంగా మార్చుకుని, దేవ తుల్యుడైన మామ గారి ముఖం కేసి చూసింది.

కోడలివా ళింత నిస్సంకోచంగా, తీక్ష్ణంగా తనకేసి చూడటం ఆయన మనస్సుకు గుచ్చుకున్నట్లుంది. కాని ఆయన ఈ భావాన్ని బయట పెట్టకుండా తన మనోమాలిన్యాన్ని వ్యక్తంచేస్తూ-కొంచెం తీక్ష్ణంగా "ఖట్టమధ్యాహ్న మప్పుడు

ఈతలుపులు మూసిఉన్నాయేం? దాసీలంతా ఎక్కడికెళ్లారు?'' అని అడిగాడు.

"నేను వాళ్ళని పంపించేశాను'' అని సమాధానమిచ్చింది చండి సహజమైన గొంతుతో.

కోడలింత సూటిగా జవాబు చెప్పటంతో మామగారి కళ్లు అస్వాభావికంగా ఎర్రపడ్డాయి. "పంపించేశావా? ఎందుకని?''

ఈ సామాన్య విషయానికి ఆ అసామాన్య వ్యక్తి సంజాయిషీ కోరుతున్నట్లిలా అడగటం చండికి బాధకలిగించింది. చటుక్కున ఆమె ఆత్మగౌరవ జ్ఞానం జాగృతమయింది. ఆమె ఇవాళ ధైర్యాన్ని కోల్పోలేదు. వెంటనే గుక్క తిప్పుకుని, కంఠస్వరాన్ని వీలైనంత కోమల పరచుకొని, జవాబిచ్చింది. "అస్తమానం వాళ్ళకి పనేమీ ఉండదు ఇక్కడ. ఊరికే కునికిపాట్లు పడుతూ కూర్చుంటారు. తలుపులు తెరిచి ఉంచితే అందరూవచ్చి ఏదో ఒక గొడవ చేసి విసిగిస్తూ ఉంటారు. అంచేత వాళ్ళని పంపించేసి, తలుపులు వేసేశాను.''

ఆయన అడిగిన ఈ స్వల్ప విషయానికి ఈ చెప్పిన సమాధానమే చాలు. ప్రశ్నించిన వ్యక్తి అంతటితో తృప్తి పడితేనే బావుండేది. కాని అతడివాళ ప్రగల్భమైన వధువు మీద తన మనస్సులోని అసంతుష్టినంతా వెళ్లగ్రక్కి ఆమెని ఆఘాతపరచాలనే సంకల్పంతోనే వచ్చాడు. అంచేతనే ఆమె సమాధానం చెప్పాకకూడా మామగారు కటువైన అభిప్రా

యాన్ని వెలిబుచ్చాడు - ఇలా చెయ్యటంవల్ల ప్రయోజనం ఉన్నట్లు తోచదు నాకు. అదీకాక నువ్వు ఎలాంటి యింటికి కాపురం చెయ్యటానికి వచ్చావో, ఆ యిల్లు ఈ వాడకల్లా చాలా ఘనమైనదనీ, ఆ యిల్లు మధ్యాహ్నమప్పుడు తలుపులు బిడాయించిఉండే యిల్లుకాదనీ, ఈ సంగతులన్నీ నువ్వు మరచి పోయావనుకుంటాను. ఏ యింటికొస్తే ఆ యింటి మర్యాదలు, సంప్రదాయాలూ మన్నించాలన్న సంగతి తెలుసా ?''

ఆభిజాత్యానికి సంబంధించిన ఈ యెత్తిపొడుపు మాటలకు వధువు నోరెత్తకుండా సహించి ఊరుకుంది. ఆమె దరిద్రుల యింటిపిల్ల, ధనికుల యింటికి కాపురానికి వచ్చింది. కాని ఈ సందర్భంలో దరిద్ర గృహస్థులను గురించి ఎత్తి పొడవటం యెందుకో మాత్రం ఆమెకి అర్థం కాలేదు. ఆ విషయమై అడగాలనే అభిలాష కలిగింది. కాని అతిప్రయత్నంమీద దాన్ని అణచుకోగలిగింది. అయినా ఆమె సర్వావయవాలూ ఉద్రేకంతో ఉడుకెత్తసాగాయి. ఒంట్లో రక్తం దుడుకుగా ప్రవహింపసాగింది.

వధువు ముఖంకేసి వక్రదృష్టితో చూసి, అతడింకా అనటం మొదలెట్టాడు. అదీకాక, క్రొత్తకోడలివి నువ్వు. ఆడవాళ్లూ వాళ్లూ తరుచు ఇక్కడికి వస్తూపోతూ ఉంటారు. దానివల్ల చాలామందితో పరిచయమూ, చనువూ ఏర్పడుతుంది నీకు. నువ్వుకూడా అనేక విషయాలు తెలుసుకునేందుకు అవకాశం కలుగుతుంది. కాని నీ వైఖరిచూస్తే విపరీ

తంగా ఉంది. ఎవరితోనూ కలుపుగోలుతనంగా ఉండవు. అస్తమానం తలుపులు బిగించుకుని మహల్‌లోనే కూర్చుంటారు మీరిద్దరూ. నీ యెదుటికి రావాలంటే అందరికీ హడలే. అంచేత ఆఖరికి నేనే రావాల్సివచ్చిం దిక్కడికి. వచ్చినందుకు – నేను నిన్నుగురించి విన్నదంతా నిజమేనని తేలిపోయింది.''

మామగారు ఇంత తీవ్రంగా మాట్లాడుతూంటే– చండి మెదలకుండా తలవంచుకుని వింటూ ఊరుకుంది.

యజమానికి మరింత ఉత్సాహం హెచ్చింది. కోడలికేసి కోరచూపులు చూస్తూ ''నిన్నుగురించి మనస్సులో నేనెంత పెద్ద పెద్ద ఆశలు పెట్టుకున్నానో తెలుసా ?'' అని అడిగాడు.

మామగారంటున్న మాటలన్నీ చండి వింటూనేఉంది. కాని కన్నెత్తిమాత్రం చూడలేదు, అతడి మనస్సులోని అభిప్రాయమేమిటో తెలుసుకోవాలని ఆసక్తి ఉన్నట్టుకూడా కన్పించలేదు. మామగారు మాత్రం అలా చురచురచూస్తూ, కొరకొరలాడుతూనే మాట్లాడుతున్నాడు ''నేను నిన్ను మొదట్లో చూసినప్పుడు, నీ మాటలు విన్నప్పుడు, నీ ప్రవర్తన తెలుసుకున్నప్పుడు – ఈ బాహ్య విషయిక పరిచయానికే చాలా ముగ్ధుణ్ణి అయినాను. నువ్వు యిక్కడకు వచ్చాక నీ ఆంతర్యాన్నికూడా తెలుసుకోగలనుకదా అని, తెలుసుకున్నాక నాలాగే ఇక్కడ వాళ్ళంతాకూడా ముగ్ధులవుతారని ఆశగా ఉండేది నాకు. కాని ఇక్కడికి వచ్చాక నీ ప్రవర్తన చూసి

ఇంటిల్లిపాదీ విస్తుపోతున్నారు. దాంతో నాకూ తల నేలకేసి కొట్టుకున్నట్లుంటోంది.

తన విశాల నేత్రాలను మామగారి ముఖంమీద నిలిపి, చండి తొణక్కుండా ఇలా అన్నది. "నేను మిమ్మల్ని చూడగానే - ఇక్కడి విషయాలు ఎన్నో మీరు నాతో చెప్పి, వాటికి సమాధానాన్నికూడా కోరుతారని - అనుకున్నాను. కాని మీరిలా ఇక్కడ నిలబడి అడగటం ఏం భావ్యంగా లేదు. లోపలికి దయచేయండి. అక్కడకు వచ్చి కూచు న్నాక—"

మామగా రామె మాటలకు అడ్డువచ్చి, ఊహూఁ. అదేం అవసరం లేదు. ఇక్కడిలా నుంచునే నేను—"

"అలా వీల్లేదు మామగారూ! తమరు కూర్చోక తప్పదు" అని అంటూనే చండి చటుక్కున వెళ్ళి వరం డాలో ఉన్న పెద్ద పడక కుర్చీ రెండు చేతులతో చులాగ్గా యెత్తి తీసుకువచ్చి మామగారు నుంచున్నచోట వేసింది. తర్వాత సవినయంగా "లోపలికి రావటానికి తమకి అభ్యం తరమయితే ఇక్కడే కూర్చోండి. తమరు నన్ను విచారించ టానికి వచ్చినప్పుడు అలా నుంచుని ఉండగానే తేలేదికాదది. అదీకాక అసలది భావ్యంగానూ ఉండదు" అన్నది.

ఆయన కుర్చీలో కూచుంటూనే మనసులోని విస్మ యాన్ని బయట పడనీయకుండా గాంభీర్యాన్ని తెచ్చిపెట్టు కుని, "నే నివాళ యిక్కడకు వచ్చానంటే నీ విషయమై విచారించటానికే వచ్చానని నీ అంతట నువ్వే గ్రహించా వన్నమాట!" అన్నాడు.

చండి ఏమాత్రం తొణక్కుండానే - "మీరు రావటానికి ముందే - మీ దర్బారుకు నాకు పిలుపు ఎప్పుడో ఒకప్పుడు వస్తుందని తెలుసునాకు. కాని మీరే ఇలా అసమయంలో ఇక్కడకు వస్తారని మాత్రం నేను ఊహించలేదు" అన్నది.

యజమానే స్వయంగా వచ్చి విచారణ మొదలెడితే విచారింపబడే వ్యక్తి ఎంత సాహసి అయినప్పటికీ గుండె గుబగుబ కొట్టుకోక మానదు. కాని చండి ముఖంలో ఎక్కడా లవలేశమైనా భయంకాని, దిగులుగానీ, లేకపోవటం జమీందారు గ్రహించాడు. ఆయన ఎకసక్కెంగా "అయితే నువ్వు మొదటినుంచీ అన్నీ తెలిసే తయారుగా ఉన్నావన్న మాట! అలా చెప్పు! మెలకువగా ఉండి నిద్రపోతున్నట్లు నటించేవాళ్లని - సహజంగా ఎవరూ లేపలేరు. అలాగే విచారణ జరుగుతుందని తెలిసి నేరాలు చేసేవాళ్లని - అందుకు మొదటినుంచి సిద్ధపడి ఉండేవాళ్ళని ఎంత పెద్ద బారిష్టర్లయినా క్రాసు పరీక్షలో పడకొట్టలేరు" అన్నాడు.

ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకునేటప్పుడు - సందర్భవశాత్తూ మూడోవ్యక్తి అంటీ పట్టకుండా మాట్లాడినట్లు మాట్లాడింది చండి కూడా. "వాళ్ళకదే వృత్తి మామగారూ! వాళ్ళేలా పట్టుపడతారు చెప్పండి? వాళ్లు క్రాస్ పరీక్షలో ఓడినా వెనక్కితగ్గరు. అదీ కాక ఈ రోజుల్లో తాము చేసిన నేరమేమిటో తమకు తెలియనివాళ్లుకూడా విచారణ స్థానానికి రావలసివస్తోంది. విచారణవల్ల వారికినచ్చే నష్టమేమీ ఉండదు కాని, పిడుగుపడ్డట్టు శిక్షేపడుతుంది."

తన దౌర్బల్యాన్ని ఎలా గ్రహించి కోడలు తన ముఖం మీాదనే ఇంత నిర్లక్ష్యంగా ఎలా జవాబివ్వగలిగిందో- ఆ సంగతే ఒక్క క్షణం తనలో తాను ఆలోచించుకున్నా డతడు. ఇక్కడకు వచ్చాక అతడు తన కంఠస్వరాన్ని యెలా సప్తమ స్థాయికి పోనిచ్చి, అక్కడనుంచి మళ్ళీ మంద్ర స్థాయికి రానిచ్చాడో - అదంతా ఆ తెలివికల కోడలు గ్రహించి ఆ సదవకాశాన్ని జారవిడుచుకోలేదు. క్షణంలో మళ్లీ ముఖభంగిమనీ, కంఠస్వరాన్నీ ఉగ్రంగా మార్చుకొని- నీ మీాదఒకదాని వెంట ఒకటి ఎన్ని ఫిర్యాదు లొచ్చాయో తెలుసా నీకు?'' అని అడిగాడు,

వధువు నవ్వుతూ- "నేను బయటి విషయాలే పట్టించుకోను అన్నసంగతి మీారిక్కడికి రాగానే గ్రహించారుగా!'' అన్నది.

అతడు కళ్లు రెండూ ఎర్రచేసి, "ఇదికూడా నీమీాద వచ్చిన ఫిర్యాదుల్లో ఒకటి'' అన్నాడు.

చండి ముఖంలో నవ్వు మాయమైంది. మామగారి ముఖంమీాదినుంచి తన స్నిగ్ధ దృష్టిని మరల్చుకుంది. కాని ఆయన మాటకి సమాధానం మాత్రం యేమీా చెప్పలేదు...

జమీాందారు మళ్ళీ కఠినంగా అన్నాడు - నేను విశ్వసించి నీచేతికి బంగారు కొరడా బహుమతి యిచ్చాను—''

చూపులు మరల్చుకుని తలవంచుకుని నిలబడిఉన్న చండి చటుక్కున మళ్ళీ మామగారి ముఖంకేసి తీక్ష్ణంగా చూసింది. ఆ చూపులోనే తన ప్రశ్నను ప్రకటిస్తున్నట్లు...

"నిన్ను నేను పైపైన అర్థం చేసుకున్నంతవరకు-నేను నీతో 'గాడిద' అని ఎవర్ని ఉద్దేశించి అన్నానో-ఆగాడిదను నువ్వు గుర్తించగలవనీ, ఆ గాడిదను నువ్వు ఒకదారికి తీసుకు రాగలవనీ - నా కెంతో భరోసాగా ఉండేది. కాని నువ్వు నా సూచనను గ్రహించనే లేకపోయావు."

చండి సమాధానం చెప్పకుండా మామగారి ముఖం కేసి మళ్ళీ అలాగేచూసింది. అప్రసన్నంగా ఉన్న ముఖాన్ని వికృతంగా కూడాపెట్టి, "ఇక్కడికి రాగానే నువ్వు నీ మరిదినే ఆ గాడిదగా నిర్ణయించావు. అంతేకాదు. అందరి యెదుట నువ్వు ఆ మాటను సగర్వంగా వెల్లడించావు. వెల్లడించలేదూ నువ్వు? లేదు అని యెదురు చెప్పటానికి సాహసించగలవా?" అని అడిగాడు మామగారు.

అందమైన చండి ముఖం క్షణంలో కందగడ్డలా అయింది. కాని మామగారి మాటలకు ఏమాత్రం తెల్ల మొహం వెయ్యకుండానే, "నా నోటిమీదుగా వచ్చిన మాటను దాచటమనే అభ్యాసం నా కెన్నడూ లేదు మామగారూ!" అన్నది ధైర్యంతో.

"అయితే నువ్వు నీ మరిదిని అందరియెదుటా 'గాడిద' అని అన్నట్లు నా యెదుటకూడా అంగీకరిస్తున్నావన్న మాటేగా?"

"ఆఁ. అంగీకరిస్తున్నాను. ఒక రోజున అతణ్ణి గాడిద అని అన్నాను. మరొకరోజున 'నిన్ను గాడిద అని అనటం గాడిదను కూడా చిన్నబుచ్చినట్లవుతుంది' అనికూడా అన్నాను."

‘‘నిజమే ? కాని ఈ మాట నివారణుడు నాతో చెప్ప లేదే !’’

‘‘బహుశా చెప్పటం అనవసరమని అనుకొని ఉం డొచ్చు లేక మరిచిపోయి ఉండొచ్చు. కాని నేను అన్న మాట మాత్రం నిజం !’’

‘‘కాని నీకు నేనిక్కడ ఇంత కష్టకట్టేటంత చనువింకా ఇవ్వలేదు. ఈ ఇంట్లో ఇంతవరకూ ఎవ్వరూ నివారణుడి ముఖంకేసి కళ్లెత్తి గట్టిగా చూడటానికికూడా సాహసించి యెరుగరు. మా ఆఫీసులో ఎవ్వరైనాసరే - అంతదాకా యెందుకు - మా దివాన్‌కూడా నివారణుడంటే భయపడ తారు.’’

‘‘చిన్నప్పటినుంచీ నేనూ యెవ్వరికీ భయపడటమనేది నేర్చుకుని యెరగనని బహుశా తమకు తెలియదనుకుంటాను’’

‘‘ఈ మాట ఇంత బాహాటంగా చెప్పగలిగే వాళ్లె లాంటి వాళ్ళయి ఉంటారో తెలుసా ? జీవితంలో ఎవరన్నా నదురూ - బెదురూ లేనివాళ్లు—’’

‘‘అంతేకాదు, జీవితంలో ఎన్నడూ అన్యాయాల జోలికి పోనివాళ్లు, భగవంతునిమీద విశ్వాసాన్ని పోగొట్టు కోనివాళ్ళు—’’

‘‘నువ్వు నా యెదుట నిలబడి ఇవాళ ఇలా మాట్లాడ గలుగుతున్నావన్నమాట ! కాని నీకూ తెలుసు. నాకూ తెలుసు. ఒకళ్ళదగ్గిర ఇద్దరిదగ్గిర, కాదు, నువ్వు దాదాపు డజనుమంది యెదుట ఈ అన్యాయాన్ని చేశావు’’

‘‘నేను అన్యాయం చేశానా ?’’

"కచ్చితంగా ... ఋణంక్రీతం నువ్వే ఒప్పుకున్నావుగా!"

"నేను చేసిన పనిని ఒప్పుకునేసరికి అప్పుడే దాన్ని అన్యాయంగా నిర్ణయం చేశారా?"

"నువ్వు నా కివాళ న్యాయాన్యాయ విచక్షణను క్రొత్తగా నేర్పబోతున్నావల్లే ఉందే! చిత్రమే!"

"అయితే ఇంక దాన్నిగురించి నేను చెప్పేదేమీ లేదు. కాని మీరు న్యాయాన్యాయాలను నిర్ణయించటానికి న్యాయాధిపతిగా యిక్కడకు వచ్చామన్నసంగతి మరచి పోతున్నారు"

"సరియైన మాటే చెప్పావు నువ్వు. నీ అపరాధాల్ని, నువ్వు చేసిన అన్యాయాల్ని నేను విడివిడిగానే విచారిస్తా నయితే—"

"అలా చెయ్యండి. కాని నామీదవచ్చిన ఈ అభియోగాలన్నింటికీ మూలకారణం ఏమిటో అదికూడా తెలుసుకోవటం తమ కర్తవ్యమని మనవి"

"మంచిదే, నీ దగ్గిర క్రొత్తగా కర్తవ్యాన్ని తెలుసుకోవటమే కాదు. కావాలంటే శిక్షణకూడా పొందుతాను. కాని నువ్వు ఇలా మాటకారితనంతో నన్ను వంచించి జయిస్తావని మాత్రం నేనెన్నడూ అనుకోలేదు—"

"మాటకారి తనంతో తమని నేనెప్పుడూ వంచించ లేదు మామగారూ!"

"వంచించలేదూ? కచ్చితంగా వంచించావు మాటల తోనూ వంచించావు – శరీరదార్ఢ్యం చూపీ వంచించావు"

"మామగారూ !"

"ఎందుకలా ఝుంకరిస్తావ్ ? నా మాటలు కాదంటావా ?... అప్పుడలా పరవళ్లు త్రొక్కుతూ వచ్చిన ఆవును కొమ్ములు పట్టుకుని నువ్వు లొంగతియ్యటం చూసి విస్తుపోయి నే నెంతో ఇదయినాను. తర్వాత నువ్వు పాఠశాల స్థాపించమని కోరటం విని ముగ్ధుణ్ణి అయినాను. కేవలం శరీరబలిమి, మాటకారితనమే కాదు స్త్రీలో చూడవలసింది, వాళ్ళ ఆంతర్యాన్నికూడా తెలుసుకుని ఉండాలన్న సంగతి నా ఆలోచనకు తట్టలేదు. అందుకనే ఇప్పుడింత పెద్ద చిక్కును ఎదుర్కోవలసి వచ్చింది. నన్నెలా నువ్వు మోసగించగలిగావు !"

"మోసగించానా ? మిమ్మల్నా ? నేను మిమ్ముల్ని మోసగించానా ? ఇదేనా మీ దృఢ విశ్వాసం ?"

"ఆఁ. ఆఁ. ఇదే నా దృఢవిశ్వాసం. పైకి కన్పించే నీ ప్రవర్తన, స్వభావాన్ని చూపి నువ్వు నాకు మైకాన్ని కలిగించావు. ఇంక ఇక్కడికి వచ్చాక నీలో ఉన్న విషాన్ని వెళ్ళ గ్రక్కి నన్ను రెచ్చగొట్టావు. క్రొత్త కోడలివి నువ్వు. నీ ప్రవర్తనని చూసి లోకమంతా నవ్వుతోంది. నువ్వు మాత్రం ఎవర్నీ లక్ష్యపెట్టవు. ఎటూ కన్నెత్తి అయినా చూడవు. నివారణుణ్ణి అవమానించావు. మృణాళినిమీద చెయ్యిచేసుకోబోయావు. మా మామగారి పేరెత్తికూడా నువ్వు దెబ్బతీశావు. ఇంతటి సాహసం నీది. ఇవన్నీ అపరాధాలు కావూ ? ఇప్పటికీ 'నే నపరాధిని కాన'ని చెప్పటానికి సాహసించగలవా ?"

తా నననలసిన నాలుగు మాటలూ అనేసి అతడు నిప్పులు కక్కుతూ చండికేసి చూస్తూ ఊరుకున్నాడు. మామ గారు అన్న ప్రతిమాటా బల్లెంలా గ్రుచ్చుకున్నా ఆ బాధ నంతటినీ ఎంతో ఓర్పుతో సహించి, "అయితే నామీద ఇతరులు ఫిర్యాదులు చెయ్యటమేకాదు. మీమనస్సులోనూ ఉన్నాయి ఫిర్యాదులు. అవి వీటికన్న పెద్దపెద్ద ఫిర్యాదులు. కాని ఇప్పుడిహ చెవుతున్నాను నేను, నా ఫిర్యాదుకూడా ఒకటి ఉంది, అదీ నిర్లక్ష్యం చేయ్యతగిందికాదు – ఒక్క సారే ఆ ఫిర్యాదుల్నీ – ఈ ఫిర్యాదునూ విచారించటం మంచిది."

"నీ దొక ఫిర్యాదు ఉందా ? ఎవరిమీదనో చెప్పు ?"

"నేనూ వంచింపబడ్డాను మామగారూ ! అదే నా ఫిర్యాదు."

"నువ్వు వంచింపబడ్డావా ? అయితే మరి ఇంతకు ముందెప్పుడూ ఎందుకు ఫిర్యాదు చెయ్యలేదు ?"

"అప్పుడు అవసరమని గ్రహించలేదు. మోసగించబడి నష్టపడినా ఫిర్యాదు చెయ్యటానికి అందరూ ముందుకురారు. కాని నేను అందరికన్నా ఎక్కువ వంచింపబడినా, నేనే ప్రయత్నించి ఆ నష్టాన్ని పూరించుకోగలనని, ఇన్నాళ్ళ నుంచీ ఫిర్యాదు చెయ్యలేదు."

"అయితే మరి యిప్పుడెందుకు చేస్తున్నావ్ ?"

"నన్నెవరు వంచించారో, వారే ఇవాళ నామీద ఫిర్యాదు లేవతీశారు. అందుకనే నా ఫిర్యాదు సంగతీ

యెత్తాను. లేకపోతే నే నెవరిమీదా ఇంతవరకు ఫిర్యాదు చేసినదాన్ని కాను.''

"ఏమంటున్నావ్ నువ్వు? నీ సమస్యను ఇలా పెట్టు నా ముందర. నేను వింటాను. ఎవరు నిన్ను వంచించింది? ఎవరి మీద నీ ఫిర్యాదు?"

తన మనస్సులోని క్షోభనంతా బయటపడనీయకుండా నిగ్రహించుకొని, చండి ఒక్క మాటలో చెప్పేసింది. "మీ యెదుట మీమీదనే నా ఫిర్యాదు. మీరే స్వయంగా వంచించారు నన్ను''

"ఏమన్నావ్ నువ్వు? నేను వంచించానా నిన్ను?" అని గర్జించాడాయన. కోపంతో ఆయన గొంతు పట్టుకు పోయింది. కాని చూపులు మాత్రం చండిమీద నిప్పులు చెరిగేట్లున్నాయి.

చండి ఏమాత్రం జంకకుండా – "ఆఁ. నా మాటని ఋజువుచేస్తాను. మీరు వంచించింది నన్నొక్కదాన్నే కాదు. స్వర్గస్థురాలైన మీభార్యను, ఆమె పుత్రుణ్ణీ, చివరకు నన్నూ-ముగ్గుర్నీ వంచించారు. దీనికి అవసరమైన ఆధారాల నన్నిటినీ మీకు ప్రత్యక్షంగా చూపగలను. నిజంగా వంచింపబడిన దెవరో, అన్యాయం ఎవరిదో మీరే విచారించి తీర్పుచెప్పాలి" అన్నది ధైర్యంగా.

## 16

ఏ అపరాధాని కయితే విచారణకర్త తనని శిక్షించాలని యెదురుచూస్తున్నాడో – ఆ అపరాధాన్నే ఎంతో తెలివిగా అతడిమీదనే మోపి, మళ్ళీ అతణ్ణే—"మీరే చెప్పండి.

అపరాధం ఎవరిదంటారు? అన్యాయానికి అసలింతకీ మూల కారణం ఏమిటంటారు?'' అని ప్రశ్నించింది చండి.

ఈసందర్భంలో దోషియొక్క సాహసాన్ని, చూస్తుంటే విచారణకర్త ధైర్యం సడలాల్సిందసలు. కాని కోడలివల్ల ఇంత ఆఘాతాన్ని తిన్నా కోపిష్ఠియైన మామగారి క్రోధపు బాంబు ప్రేలలేదు. కళ్ళు రెండూ ఎర్రచేసి అతడు తర్జనితో బెదరించనూ లేదు. పైగా అదివరదాకా అతడి ముఖంలో వ్యక్తమవుతున్న భావం ఆశ్చర్యంగా మారిపోయింది. ఏ వ్యక్తిలో పైకి కన్పడుతున్న సాహసాల్ని - శక్తినీ చూసి, తన యింటికి కోడల్నిగా తెచ్చుకున్నాడో - ఆ వ్యక్తి ఇతరుల విషయంలో ఎంత ఉద్ధతంగా ప్రవర్తించినా, తన యెదుట మాత్రం తలవంచుకునే నిలబడాల్సింది. వీపుమీద కొరడా దెబ్బ పడినా కళ్ళెత్తి చూడటానికి వీల్లేదు. కాని ఆ వ్యక్తి తన విషయంలో కొంచెం దురుసుగా వ్యవహరించినా, తెలివైన ఆతతాయినిలాగా తన మనస్సులో గాయపడ్డ స్థానాన్ని గుర్తించి, ఇలా చేస్తుందని అతడెన్నడూ అనుకోలేదు. అంచేత అతడి ముఖంలో కోపమంతాపోయి, ఆశ్చర్యమూ, గాంభీర్యమూ వ్యక్తం కాసాగాయి.

మామగారూ, కోడలూ ఇద్దరూ కొంచెంసేపు మెదలకుండా ఊరుకున్నారు. ఎవరూ మాట్లాడలేదు. చివరికి మామగారే ఈ నిశ్శబ్దతకు భంగం కలిగిస్తూ - గంభీరంగా అన్నాడు - "భేష్!... ఆఁ. నీ మాటల ధోరణిలోపడి నేనెంత వరకు మాట్లాడానో మరచిపోయాను. అయినా నిన్ను మాత్రం మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాను.!''.

ఈ మాట లతడు నిజానికి నెమ్మదిగానే అన్నాడు. కాని చండికి మాత్రం అవి వెటకారంతో అంటున్నట్లే విన పడ్డాయి. ఆమె కళ్ళు ఎత్తి మామగారి ముఖంకేసి తీక్షణంగా చూసింది.

ఆమె అలా చూడగానే అతడు మరింత మెత్తగా "ఒక కథ చెపుతా విను. అప్పుడుకాని నువ్వు నన్ను అర్థంచేసుకో లేవు. ఓ గొప్ప యోధుడున్నాడు. కత్తియుద్ధంలో అతడికి సాటి అయినవాడంటూ లేడు. మరొక యోధుడెవరోవచ్చి తన అన్నగారిని నరికేసినట్లు ఒకరోజున హఠాత్తుగా వార్త వచ్చింది. అతడిలో రక్తం ఉడుకెత్తింది. వెంటనే కత్తితీసు కుని ఆ భ్రాతృ హంతకుడైన శత్రువును వెతుక్కుంటూ బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళేసరికి సోదరుడి దేహం కంటబడింది. అతడు కొయ్యబారిపోయాడు. ఆ దుష్టుడు ఒక్క దెబ్బతోనే సోదరుడి తల నరికేసి' నడుమువరకు నిలువుగా చీల్చాడు, ఆ దృశ్యం చూచేసరికి అతడి కోపమంతా ఏమై పోయిందో - 'ఎంత సాహసం చేశావురా దుష్టుడా !' అంటూ అతడి సాహసానికి మనస్సులో జోహార్ చేశాడు. ఇప్పడు నీ విషయంలోకూడా నా మనస్సు సరిగ్గా అలాగే ఉంది. తెలిసిందా ?"

కోడలు మామగారి అభిప్రాయాన్ని విని, వెంటనే జవాబిచ్చింది. "కాని ఇది తాత్కాలిక వ్యామోహం తప్ప మరేమీ కాదనిపిస్తోంది నా మనస్సుకు. తర్వాత కొంచెం సేపటికల్లా ఆ యోధుడు తప్పకుండా ఆ భ్రాతృ హంతకుణ్ణి శిక్షించి ఉంటాడు. కాని ఇక్కడ నానోటినుంచి వచ్చిన

రెండు మాటలతో వ్యవహారం తేలిపోలేదు. దీనితీర్పు రావాలింకా.”

“కాని వ్యవహారాన్ని నువ్వే అడ్డం త్రిప్పావు. నామీద మోపుతున్నావాయె!”

“ఎన్నో తగవులను పరిష్కరించవలసినవారు తమరు. ఏ ఫిర్యాదుల్లో ఎంత లొల్లి ఉన్నదీ, ఏ ఫిర్యాదులు తుది పరిష్కారమయేవరకూ నిలబడలేవో మీకు ముందుగానే తెలుస్తాయి. తవ్వినకొద్దీ దాక్కున్న పాములు బయటపడ్డాయి. అన్నట్లు – ఇలాంటి ఫిర్యాదులుకూడా మీరెన్నో వినే ఉంటారు.”

“అదేమిటి?”

“ఓ ఖూనీకేసు విచారణ సాగుతోంది. సాక్షులప్రమాణాన్ని బట్టి ఆ వ్యక్తి ఖూనీచేసినట్లు రుజువయింది. జడ్జికి కూడా అదే విశ్వాసం కలిగింది. ఇంకేముంది ఉరిశిక్ష పడి తీరుతుంది! కాని ఇంతలో ఎవరైతే ఖూనీ చేయబడ్డారో ఆ వ్యక్తే సాక్షాత్తూ కోర్టులోకివచ్చి హాజరైనాడు. అందరూ తెల్లబోయారు. ఒక్క నిముషంలో కేసంతా అడ్డం తిరిగింది.”

చండి మాటలు శ్రద్ధగా వింటున్న మామగారు కొంచెం వ్యంగ్యంగా – “ఏ కేసు విచారించటాని కాజడ్జి కూర్చున్నాడో – ఆ కేసు ఆ ఆసామీ ఎదురుతిప్పి ఆ జడ్జీ మీదనే మోపలేదుగా?” అని ప్రశ్నించారు.

అత డెందుకలా శ్లేషగా ప్రశ్నించాడో అది చండి గ్రహించకపోలేదు. ఒకసారి మామగారి ముఖంకేసి చూసి,

జడ్జీ దోషమేమీలేదు. అసలు జరుగుతున్న వ్యవహారంతో జడ్జీకి సంబంధమేమీ లేకపోతే అతడిమీద ఎవరుమాత్రం ఎందుకు ఫిర్యాదు చేస్తారు? ఎదురు తిరిగిన కేసు– అసలీకేసు నంతా క్షుణ్ణంగా పరిశీలనచేసి, నిష్పాక్షికంగా విచారణ చేస్తున్న వ్యక్తిమీదకే వచ్చింది ఏమంటారు? నే నిది ఒక ఇంగ్లీషు పుస్తకంలో చదివాను'' అన్నది.

యజమాని విస్తుపోతూ ''ఏమిటి?'' అని ప్రశ్నించాడు.

చండి మామగారి ముఖంకేసి నిండుగా చూస్తూ చెప్ప సాగింది. ఆ దేశంలో ఒక శ్రీమంతుల యింటిబిడ్డ మారుపేరు చెప్పి మోసగించి తన కాలేజీలో అమ్మాయి శీలాన్ని నష్ట పరచి, ఆమెతో ఓ యేడాది కాపురంకూడాచేసి, తర్వాత చల్లగా జారుకున్నాడు. దురదృష్టవశాత్తూ – ఆమె ఆ పాప మార్గాన్నే పడిపోయింది. ఇరవై సంవత్సరాల తర్వాత ఆ స్త్రీయే ఒక ఖూనీ కేసులో ముద్దాయిని అయి బోనులోకి వచ్చి నిలబడింది. జడ్జి ఆమె ముఖాన్ని చూసి, ఆమె చక్కగా చదువుకున్న స్త్రీ అని గ్రహించి 'ఈ పని ఎందుకు చేశావు నువ్వు?' అని ప్రశ్నించాడు. అప్పు డామె తన పూర్వగాథ నంతా బయటపెట్టి 'నా యీ అధఃపతనానికి మూలకారకుడు ఆ వంచకుడు. మీరు న్యాయాధిపతులు. నన్ను విచారించి శిక్షించటానికి కూర్చున్నారు. కాని నేను ఎవరిమీద అభి యోగం తెస్తున్నానో అతడెక్కడ దాక్కుని ఉన్నాసరే – అతణ్ణికూడా పట్టి తీసుకొచ్చి విచారించటం తమ కర్తవ్యం కాదా?' అని అడిగింది''.

యజమాని కుతూహలంతో – "నిజమే. ఆమె భర్తే యువతి. అయితే అప్పుడు జడ్జి ఏంచేశాడు మరి?" అని అడిగాడు.

"ఆ వంచకుడి పేరేదో చెప్పమన్నాడు. ఆమె అతడి అసలు పేరు చెప్పింది. అప్పుడు జడ్జి ఆ స్త్రీకేసి ఆదుర్దాగా చూస్తూ 'అప్పుడు నీ పేరు యిదేనా?' అని అడిగాడు. ఆ సంఘటన జరిగాక ఆమెకూడా పేరు మార్చుకుంది. అతడలా అడగగానే ఆమె తన నిజమైన పేరు చెప్పింది. వెంటనే జడ్జి చేతిలోని కలం కాస్తా జారిపోయింది.

అతడు వెంటనే కుర్చీలోంచి లేచి, 'నేనే ఆ వంచకుణ్ణి అయినా ఇంకా నేనే ఈ కేసు విచారించాలనేట్లయితే ఈ న్యాయాధిపతి ఆసనం కళంకిత మవుతుంది' అన్నాడు."

"అలాగా! ఆతరువాత వాళ్ళేమయినారు?" అని ఆవేగంతో ప్రశ్నించాడతడు.

"ఆ స్త్రీకి ఉరిశిక్షయితే పడలేదు కాని జైలు మాత్రం తప్పలేదు. జడ్జిమాత్రం తనసర్వస్వాన్నీ ధర్మంచేసి, పాప ప్రాయశ్చిత్తం చేసుకోటానికి ఫాదరీలలోచేరాడు."

మామగారు కోడలి ముఖంలోకి చూస్తూ "నువ్వు చాలా చదివినట్లున్నావే అమ్మాయీ!" అన్నాడు.

చండి తలవంచుకుంది. సమాధాన మేమీ చెప్పలేదు.

"అయితే నీకు ఇంగ్లీషుకూడా వచ్చుననమాట?"

"మా తాతగారికి చాలా భాషలు తెలుసు. ఆయన ఇంగ్లీషులోకూడా విద్వాంసుడే. నాకు అబ్బినవిద్య ఏ కాస్తయినా ఉన్నదంటే – అదంతా ఆయనగారి శిక్షణే."

మామగారు దీర్ఘంగా నిట్టూర్చి, "ఇంగ్లీషులోకూడా నీకింత ప్రతిభ ఉన్నదని తెలియదు నాకు" అన్నాడు.

మామగారి మాటలు చండి చెవులకు కటువుగానే విన్పించాయి. కాని ఇంక ఈ విషయమై సంభాషణ పెంచకుండా, ఈ ప్రసంగాన్ని మార్చాలనే ఉద్దేశంతో "అయితే ఇంక యేమిటి తమ ఆజ్ఞ మామగారూ?" అని అడిగింది.

చండి లోపల్లోప లేదో క్షోభపడుతున్నట్లు ఆమె ముఖం చూసి, మామగారు గ్రహించి చటుక్కున కంఠస్వరాన్ని మార్చి ఇలా అన్నాడు ;

"అసలు వ్యవహారం యింతవర కేమీ కాలేదు. మధ్యలో కొంత అనవసర ప్రసక్తివచ్చి కాలం వృథాగా గడచిపోయింది. ఈ 'పాయింట్స్' అన్నీ చూపితే నీ మీద ఉన్న అభియోగం అడుగున పడుతుం దనుకున్నావేమో ! నీ మాటల ధోరణిలో పడిపోయి నేనేమీ మరిచిపోలేదు. నువ్వు చెప్పే మాటలకు చెవి ఒగ్గానని విచారణ చెయ్యవలసిన నా కర్తవ్యాన్ని నేను మరిచిపోయి ఉంటానని నువ్వు భావిస్తే అది నీ పొరపాటు."

మామగారి మాటలు చండి కెంతో కష్టం కలిగించినట్లు ముఖం చూస్తేనే తెలుస్తోంది. అయినా మెరుపు తీగె లాంటి చిరు నవ్వొకటి నవ్వి, "ఇంతసేపయినాక నా విషయంలో మీకు కలిగిన స్థిరాభిప్రాయం ఇదేనా మామగారూ ?" అని అడిగింది.

"ఆఁ. అదే. అయితే అది అన్యాయమని అంటావా నువ్వు ?"

"ఇలా మీతో నేను వాదోపవాదాలకు దిగటం అన్యాయమని నా ఉద్దేశం. నా మీద మీ యెదుట తీసుకు రాబడిన అభియోగాన్ని అంగీకరిస్తున్నాను నేను. మీరు నన్ను శిక్షించ వచ్చు."

"మరి నువ్వు నా యెదుటే నా మీద తీసుకొచ్చిన అభియోగంమాట ? అదేమవుతుంది ?"

"నేను దాన్ని ఉపసంహరించుకుంటున్నాను."

"అలా వీల్లేదు. నాకు విరుద్ధంగా నువ్వు అన్నమాటలను నువ్వు రుజువుచెయ్యాల్సిందే, అలా చెయ్యలేనినాడు ఇంటిల్లిపాది అందరియెదుటా నిలబడి తలవొంచుకుని, నువ్వు అన్యాయం చేసినట్లు, అబద్ధమాడినట్లు అంగీకరించి తీరాలి."

"అలాచేస్తే ఒకవిధంగా నేను అబద్ధమాడినట్లే అవుతుంది. కాని మీరు ఈ పనిమాత్రం నా మీద పెట్టవద్దు. నేను చెప్పిన వాటిల్లో అబద్ధాలేవీ లేవన్న సంగతిని నాకూ తెలుసు – మీకూ తెలుసు."

"నాకు తెలుసా ?"

"ఆఁ. తెలుసు – తమరు అనవసరంగా ఉత్తేజితులవుతున్నారు. కాని వెనకటి సంగతులన్నీ పూర్తిగా మరచిపోయారా ? రెండేళ్ళ బిడ్డను మీ చేతుల్లో అప్పగించారు అత్తగారు – ఆమె ఫోటో ఇప్పటికీ ఈ ఇంట్లో ప్రకాశమానంగానే ఉంది – ఆమె స్వర్గస్థురాలైంది..."

"ఔను. నువ్వన్నమాటలు ఒప్పుకుంటాను. ఈ సంగతి ఈ యెస్టేట్ యెస్టేటందరికి తెలుసు. దానివల్ల వచ్చిందేముంది?"

"ఆమె పోయేటప్పుడు - తన బిడ్డకు ఏలోపంరాకుండా ఎప్పుడూ మీరు కనిపెట్టి ఉండాలని, తల్లిలేని బిడ్డ అని అనాదరణ చెయ్యవద్దని - మీతో విన్నవించారు. అందుకు మీరు సరేనన్నారు."

"అయిఉండొచ్చు. కాని ఈ సంగతులన్నీ ఇవాళ పైకి తీసుకురావటంలో అర్థమేమిటి? అసలు నీకీసంగతులన్నీ ఎలా తెలిశాయి?"

"కులవధువు మర్యాదనిచ్చి నన్ను ఈ యింటికి తీసుకువచ్చారు గనుక—నేను ఇక్కడి విషయాలన్నీ తెలుసుకోవాల్సిన అవసరం ఏర్పడింది మామగారూ! అవన్నీ తెలుసుకున్నాను కనుకనే ఇవాళ మీముందు ముఖమెత్తి మాట్లాడటానికి సాహసించగలిగాను. మా అత్తగారి మరణశయ్యమీద కూర్చుని మీరు చేసిన మూడు వాగ్దానాల్లో ఒక్కటీ చెల్లించ లేదు."

హరినారాయణబాబు కోడలికేసి తీక్ష్ణంగా చూస్తూ-వెటకారంగా— "మాతృహీనుడైన ఆ రెండేళ్ళ శిశువే ఇప్పుడు యౌవనదశకు వచ్చిఉన్నాడు. వాడిచెయ్యి పట్టుకునే ఈ యింటికి కుల వధువుగా రాగలిగిన అధికారం నీకు దక్కింది" అన్నాడు.

మామగారి వెటకారానికి చండి ఏమాత్రం వెనుదీయకుండా, దృఢకంఠంతో "మీరు ఆ బిడ్డని పెంచి పెద్దవాణ్ణి

చేశారు. అంతవరకు ఆ గౌరవం మీకు దక్కుతుందిలెండి" అని మళ్ళీ యేమనుకుందో క్షణంలో కంఠస్వరాన్ని కోమలంగా మార్చుకొని "పోషణ అదీ యేమీ చెయ్యకపోయినా తోటలో పెరిగే వృక్షాలతోపాటు పెరిగే చెట్లుకూడా ఒకటి రెండు ఉండవచ్చు. కాని వాటిని అలా పెరగనీయటం ఏమి శ్రేయస్కరం ? వాటివల్ల ప్రయోజనం ఏముంటుంది ?" అని అడిగింది.

వృద్ధుడీసారి ఇంకేం మాట్లాడలేకపోయాడు. మాట మీద మాట కదలి ఎక్కడెక్కడి సంగతులు బయటికి వచ్చాయి ! అతడు ఆశ్చర్యంతో కొయ్యబారిపోయినట్లయి ఆమె ముఖంకేసి చూస్తూ ఊరుకున్నాడు. ఈ మాటకు సమాధానం ఏమి చెప్పాలో అతడికి వెంటనే స్ఫురించలేదు. మామగారు మాట్లాడకపోవటం చూసి, చండియే మళ్ళీ అన్నది. "వయస్సుకు అనుగుణంగా ఆ బిడ్డను పెరగనిచ్చారు – పెరగనీయకుండా అణచిపెట్టి ఉంచటానికి వీల్లేదు కనుక. కాని మిగతా అన్ని విషయాల్లోనూ అతణ్ణి అణచిపెట్టే ఉంచారు. ఇంత పెద్ద జమీందారీ, ఎక్కడ ఏం జరిగినా అంతా మీ నఖదర్పణంలో కన్పిస్తుంది, కాని ఇంట్లో ఉన్న ఈ శిశువుమీదికి దృష్టిని పోనీయటానికి మాత్రం అవకాశం చిక్కలేదు మీకు."

జమీందారు విచలితుడైపోయి, "నువ్వు ఈ మాటలన్నీ నన్నే అనడానికి సాహసిస్తున్నావా ?" అని గర్జించాడు.

చండి తాను అనదలచుకున్న మాటల్ని నొక్కినొక్కి గట్టిగానే అన్నది. "యథార్థమైన సంగతులు చెప్పేటప్పుడు

సాహసానికేం లోటులేదు మామగారూ! నేను చెప్తున్న సంగతులు మీకు రుచించక పోవచ్చుగాని అన్నీ యదార్థాలే. మాతృవిహీనుడైన శిశువు యేడుపును మీరు సహించలేక పోయారు. నెలజీతాలకి కుదిర్చిన దాసీవాళ్ళ చేతుల్లో ఆ శిశువును అప్పగించారు మీరు. వాళ్లు బస్తీలనుంచి వచ్చినవాళ్లు. పసిపిల్లల్ని ఏడవకుండా ఉండేటట్లు చేసేమందులు తెలుసు వాళ్లకి. శిశువు యేడుపు ఇంక మీ చెవిని పడలేదు. మీరు సంతోషించారు. కాని జాముజాముకి ఆ శిశువుచేత విషాన్ని మింగింపచేసి నిద్రపుచ్చేవాళ్లు. ఆ విషయం మీరెప్పుడైనా విచారించి తెలుసుకున్నారా?"

"విషం మింగించి నిద్రపుచ్చారా?"

"పాలలో కొంచెం నల్లమందు కలిపి తాగిస్తే పిల్లలు సహజంగానే నిద్రపోతారు. వాళ్లనింక సముదాయించవలసిన పనిలేదు. ఇలా ఒక్కొక్కయేడే దాసీవాళ్ళ ఆదరణలో ఉండటంవల్ల ఆ శిశువు బుద్ధి వికసించకుండా మొద్దుబారి పోయింది."

చండి అశ్రుతపూర్వములైన ఈ సంగతులు చెప్పటంతో వెనక జరిగిన విషయాలన్నీ జమీందారు మస్తిష్కంలో నాట్యం చేశాయి. మనస్సులో చెలరేగిన విక్షోభాన్ని అణచిపెట్టుకుని, "నువ్వు యిప్పుడు చెప్పిన సంగతులన్నీ యెవరికీ తెలియవమ్మా! నామట్టుకు నాకు తెలియవు. నీకొక్కదానికే—" అంటూ ఏదో అడగబోయాడు.

మనస్సు కలతచెంది ఉండటం మూలంగా అతడా ప్రశ్నను పూర్తి చెయ్యలేకపోయాడు. వధువే ఆ మాటను

అందుకుని సమాధానం చెప్పింది. "నేను ఒక్కతెనే కాదండీ అసలీపని చేసినవాళ్లెవరో వాళ్లలో రాఖాలీ అనేదాసీ ఇక్కడనుంచి వెళ్ళిపోయింది. క్షేమీ చచ్చిపోయింది. నిస్తారిణి ఒక్కతె మాత్రమే బ్రతికిఉంది. పక్షవాతంతో మూల పడిఉంది. దానికీ రోజులు నిండుతున్నాయి. దాన్ని పిలిచి అడిగితే అన్నిసంగతులూ తెలుస్తాయి."

హరినారాయణబాబు చండి ముఖంకేసి ఆశ్చర్యంగా చూస్తూ "నువ్వు ఇక్కడికి వచ్చి అప్పుడే ఈ సంగతులన్నీ తెలుసుకున్నావు. కాని ఇన్నేళ్ళమధ్య నేనెప్పుడూ ఈ సంగతులు ఎవరి నోటా వినలేదు" అన్నాడు.

చండి ఈసారి నవ్వుతూ – "మీకీ సంగతు లేవీ తెలియవు నిజమే అది. కాని దీనివల్ల మీకువచ్చే అపవాదును మాత్రం త్రోసిరాజనలేరు. మీ జమీందారీలో ఉన్న వేల కొలది ప్రజల యిళ్ళల్లో ఏమేమి జరుగుతున్నదీ కనిపెట్టే ఉంటారు మీరు. ఆ విషయంలో మీది చాలా తీవ్రదృష్టి. అందుకు మిమ్మల్ని అందరూ మెచ్చుకుంటూఉంటారు. కాని మీ యింట్లో జరిగిన ఈ అత్యాచారానికి సంబంధించిన సంగతిని మాత్రం తెలుసుకోలేకపోయారు! అందుకనే మీతో చెప్పటానికి సాహసించాను నేను. మీ ప్రవర్తనవల్ల వారు వంచితులయినారు. ఇంక మీరే చెప్పండి. నే నివన్నీ చెప్పటం అన్యాయమంటారా?"

హరినారాయణబాబు చండి ఉజ్జ్వల ముఖంకేసి చాటుగా చూస్తూ ఈ సంగతులన్నీ విన్నాడు. తర్వాత చూపులు మరల్చుకుని నిశ్శబ్దంగా మనస్సులో ఏవేవో ఆలో

చించుకున్నాడు. ముఖంలో గాంభీర్యం ప్రస్ఫుట మవుతోంది. దాంతోపాటు అతడి కంఠస్వరం విచిత్రంగా మారిపోయింది. "న్యాయాన్యాయ విచారణ తర్వాత జరుగుతుందిలే. కాని ముందు నీ తూణీరంలో ఉన్న బాణాలన్నిటినీ తీసి ప్రయోగించు నా మీద !" అన్నాడు.

మామగారి మాటలు ఆమెకి నిజంగా బాణాలలాగానే గుచ్చుకుని బాధించాయి. కాని ముఖంలో ఆవేశాన్ని మాత్రం కన్పడనీయకుండా - పైకి కొంచెం మామూలుగా నవ్వి - "తమరు గురుతుల్యులు. తమరు ఆదేశించారు కనుక నా తూణీరాన్ని ఖాళీ చేస్తాను. కాని దానివల్ల ఇప్పుడొచ్చే ప్రయోజనం ఏముంది ?" అన్నది.

"తప్పకుండా ఉంటుంది. ముందు ఈ విషయాన్ని పరిష్కరించాక మిగిలిన సంగతులన్నీ. దీనినుంచి తప్పించుకుని బయటపడటమనేది నీకూ ఉండదు - నాకూ ఉండదు."

చండి మామగారు అన్న చివరిమాటలకు ఊతంయిస్తూ "భగవంతుడి రాజ్యంలో - చేసిన పనికి అందరూ సంజాయిషీ చెప్పుకోవాల్సిందే. తప్పించుకోవట మేముంది ! అంచనా తప్పువేస్తే అంతా పేరుకుని ఎప్పుడో ఒకప్పుడు మనల్ని చుట్టుముట్టి బాధిస్తుంది. అంచేతనే ఎన్నో సంవత్సరాలనుంచి మూలబడి ఉన్న సంగతులన్నీ ఇప్పుడు బయటికొచ్చాయి. వీటినుంచి సులభంగా తప్పించుకొనేందు కుపాయంలేదు. కాని ఇది కారణంగా మనస్సుకు పెద్ద అఘాతం తగులుతుందేమో అని భయంగా ఉంది" అన్నది.

ఆమె మాటలు నిజానికి హరినారాయణబాబు సహనాన్ని లుప్తపరిచాయి. అయినా చివరివరకూ వినాలనే కుతూహలం మాత్రం అతణ్ణి తొందరపెట్టసాగింది. చండి చెప్పేది పూర్తికాగానే అతడు తన మనస్సులోని భావాన్ని వెటకారపు భంగిమతో వెల్లడించాడు. "నా కెక్కడ ఆఘాతం తగిలిపోతుందో అన్న దిగులే నీ కిప్పుడు ఎక్కువగా పట్టుకున్నదనుకుంటా. ఇది పంజాబీ సభ్యత లక్షణమనుకుంటాను"

చండి తలపైకెత్తి రూక్షంగా "మీరీ మాట ఇప్పుడెందుకన్నట్లు మామగారూ?" అని ప్రశ్నించింది.

తన మాటలు చండిని బాగా అఘాతపరిచాయని గ్రహించగానే హరినారాయణబాబు మరింత గంభీరుడై "వారు ఒకచేత్తో కంఠం - ఒకచేత్తో కాళ్ళూ పట్టుకుని, లోకులతో మర్యాదగా మాట్లాడతారని విన్నానులే" అన్నాడు.

చండి వెంటనే దృఢ స్వరంతో సమాధానమిచ్చింది.

"మీరు అన్నమాట ఇచ్చిపుచ్చుకునే వ్యాపార విషయాల్లో అయితే చెల్లుబాటు కావచ్చు. వడ్డీవ్యాపారం చేసే వాళ్ళని అలా అనవచ్చు. కాని ఇచ్చిపుచ్చుకునే విషయాల మీదకాదు మన కిప్పుడొచ్చిన ప్రస్తావన. అదీకాక నేను ఇచ్చిన దానసయితే మీయెదుట నిలబడి మాట్లాడేదాన్ని కాను."

జమీందారు ఈసారి చటుక్కున ఉత్తేజితుడై - బిగ్గరగా—నీ మాటలతో నువ్వే పట్టుబడ్డావిప్పుడు. ఇంతకుముందే అంచనాలనిగురించి నీ నోటిమీదుగా విన్నాను. ఇచ్చిపుచ్చుకోవటాలను గురించే ఈ జంజాటమంతా. కాని నువ్వు ఋణ

దా[త్రివిలాగానే నా యెదుట నిలబడ్డావు రావలసినదాన్ని రాబట్టుకోటానికి'' అన్నాడు.

చండి ఏమాత్రం చకితురాలు కాకుండా ''సరే, అయితే మీ మాటనే ఒప్పుకుంటాను. కాని ఒక్క విషయం తెలుసుకోవాలనుకుంటున్నాను - కోప్పడవద్దు. మీరు ఇంత వరకు ఋణపడి ఉన్నదాన్ని తీర్చగలరా అసలు'' అని అడిగింది.

ఆమె అడిగిన ఈ ప్రశ్న కతడు స్తబ్ధుడై - కొన్ని క్షణాలపాటు ఉత్సాహదీప్తమైన ఆమె ముఖంకేసి చూసి చూసి, చివరకు మెల్లిగా ''ఏం కావాలని నీ కోరిక ?'' అని అడిగాడు.

''ఇందులో కోరటానికేముంది ? అలాంటి దేమయినా ఉన్నట్లయితే - ముందుగానే - కోడల్ని అయిన అధికారం తోనే అడిగి ఉండేదాన్ని. కాని ఇప్పుడు కోరటం వృథా. ఎందుకనంటే ఈ ఋణాన్ని తీర్చగల సామర్థ్యం లేదు మీకు'' అన్నది చండి ఉద్దీప్తకంఠంతో.

''నాకు సామర్థ్యం లేదూ ?'' అని అడిగాడు. మామ గారు కర్కశ కంఠంతో.

''లేదు మామగారూ ! లేదు'' అన్నది చండి తాపీగా.

మామగారు కొంచెం తగ్గివచ్చి ''నాయెదుటే నువ్వీ మాట బాహాటంగా అనేస్తున్నావా ?'' అన్నాడు.

మామగారి ఈమాటకు చండి విస్పష్టంగా చెప్పింది జవాబు - ''నా చేతనే చెప్పించ తలచుకున్నారా మీరు ?... నా దోషమేముంది చెప్పండి ?... మీరు నిజంగాతీర్చగలరా?

మీకు డబ్బు కేమీ లోటులేదు, రాజైశ్వర్యం మీది. తమ కున్నశక్తి-ప్రతిపత్తి గొప్పవి. అయినా మీ కుమారుడి కీ స్థితి ఎందుకుదాపురించింది? చదువు అంటలేదు. సాహచర్యం వల్ల రాదగిన విజ్ఞానమయినా రాలేదు. బాహ్య ప్రపంచంతో పరిచయాన్ని ఏర్పాటుచేసుకునే అవకాశాన్నయినా కల్గించ లేదు. కుమారుడి సంగతంతా కప్పిపుచ్చి కేవలం మీజమీం దారీ పటాటోపంతో అమాయకుడైన మా నాన్నచేత అవు నని ఒప్పందం చేయించుకున్నారు. మానాన్న తెలుసుకో లేకపోయినా నేను మాత్రం గ్రహించాను మీరు నన్ను ఎలా వంచించిందీ, నాకు ఎంత ఋణపడిఉన్నదీ మీ మన స్సుకు మీకూ తెలుసు. నా యీ నష్టాన్ని మీ జమీం దారీతో - మీరు కూడబెట్టుకున్న ధనంతో, మీకున్న శక్తిసామర్థ్యాలతో, పలుకుబడితో తీర్చగలరా?''

జమీందారు స్థైర్యాన్ని కోల్పోయి, ''నువ్వు నీ నోటికి వచ్చినట్లు-నీ యిష్టం వచ్చినట్లు మాట్లాడేస్తున్నా వమ్మాయీ; ఆడదాని కింత ఓటినాలిక ఉండటం మంచిది కాదు'' అన్నాడు.

చండి ఉత్సాహం ఉద్వేలంగా ఉంది. మామగారు అడ్డురావటం పట్టించుకోకుండానే తన ధోరణిలో తాను చెప్పుకుపోసాగింది. ''అయితే దయ ఉంచి మీరొకసారి ఈ గదిలోకి రండి. అక్కడ మా అత్తగారి ఫొటో ఇప్పటికీ ప్రకాశవంతంగా గోడకు తగిల్చేఉంది. మీరొక్కసారి ఆమె ఫొటోకేసి చూస్తే సరిగ్గా ఈ ప్రశ్నే మీ మనస్సుకు తట్టు తుంది. పిల్లవాని విషయంలో అశ్రద్ధవహించి, మీరు ఆ

సాధ్వి అంతిమ వాంఛనుకూడా నిర్లక్ష్యం చేశారు - ఇహ నిప్పుడు దానికి ప్రతీకారం ఏమీ చెయ్యలేరు - ఈ సంగతి మీరు ఒప్పుకోక తప్పదు.''

స్వర్గస్తురాలైన సహధర్మచారిణి ప్రసక్తి రావటంతో చటుక్కున ఉలిక్కిపడ్డాడు హరినారాయణబాబు. గడచిన పాతసంగతులెన్నో అతడి స్మృతిపథంలోకి రాసాగాయి. అతడి కళ్ళు రెండూ చెమ్మగిలాయి. దుఃఖంతో గొంతు కూడా పట్టుకుపోయింది.

మామగారి పరిస్థితి గ్రహించికూడా, చండి తాను విసరదలచిన బాణాలు విసరటం మానలేదు. కొంచెంసేపు మాత్రం మాట్లాడకుండా ఊరుకుని మళ్లీ - ''మీ అబ్బాయి కూడా ఈ విషయంలో ఏదైనా అభిమానపడి మీతో -''

కొడుకుమాటరాగానే నిశ్శబ్దంగాఉన్న మేఘాలను చీల్చుకుని పిడుగు బయటికి వెడలినట్లయింది. ''మా అబ్బాయా? అంటే నీ భర్త! వాడికికూడా అభిమానం అనేది ఒకటుందా అని అసలు? నా ఉద్దేశం ఏమిటంటే భగవంతుడు వాడిబుర్రనిండా మట్టిపెట్టి - వాడిని ఈ వంశంలో పుట్టేటట్లు చేసాడు. ఆ అసారమైన పదార్థమంతా ఈ లోపుగా నీ స్పర్శతో సారవంతమైనదయిందా యేం?'' అన్నాడతడు ...

తన భర్తవిషయంలో పూజనీయుడైన మామగారి అభిప్రాయాన్ని వినేసరికి చండికి మనస్సులో చెడ్డకోపం వచ్చింది. అయినా ఆ కోపాన్ని వెల్లడించకుండా అవిచలిత ధైర్యంతో - సహజమైన ధోరణిలో మాట్లాడింది.

"నిజంగా భగవంతుడు కోపించి, పనికిమాలినవారినిగా ఈలోకంలో సృష్టించినవారిని యెవరుమాత్రం ఏం చెయ్యగలరు ? గుడ్డివాళ్లుగా, కుంటివాళ్లుగా, మూగవాళ్లుగా పుట్టిన వాళ్ళని ఎవరూ మామూలు మనుషులుగా మార్చలేరు. నేనూ సామాన్య మనిషినే నా శక్తి యెంత ! ఆఁ. అయినా ఈ మాటమాత్రం ఒప్పుకోకుండా ఉండలేను. వారి భ్రమను మాత్రం పోగొట్టాను నేను. అంచేత తమ బుర్రలో భగవంతుడు మట్టి పెట్టలేదని ఇంట్లోఉన్న బాధ్యతగల పెద్దలే పట్టి పెట్టారని వారు తెలుసుకోగలిగారు."

"అదెలా ?"

"...ముందుగానే చెప్పానుగా మీకు - మొదట్లో పరిచారికలు జరిపిన అత్యాచారాలసంగతి. ఆ తర్వాత వయసు వస్తున్నకొద్దీ స్వార్థపరుల అత్యాచారాలు ఆరంభమయినాయి."

"స్వార్థపరుల అత్యాచారాలా ? ఎవర్ని ఉద్దేశించి నువ్వు ఈ మాట లంటున్నావో చెప్పు."

"మీరింకా మనస్సులో ఊహించుకోలేదా మామగారూ ! ఆ విషయం నేనింకా స్పష్టపరచి చెప్పాలా ?"

"అయితే నీ ఫిర్యాదు కేవలం పరిచారికలమీద కాదు. మరికొంతమంది మీదకూడా ఉన్నదన్నమాట ! అయితే ఇంతకీ కుర్రవాడు పెద్దవాడవుతున్నకొద్దీ, కుట్రపన్ని వాణ్ణి అప్రయోజకుణ్ణిగా తయారుచేశారనే, నీ అసత్యారోపణను నన్ను నమ్మమంటావు ?"

"నమ్మండి, నమ్మకపోండి - మీ యిష్టం. కాని మాట వచ్చినప్పుడు - దాన్ని నేను దాచటం ఎందుకు చెప్పండి."

"వాణ్ణి అప్రయోజకుణ్ణిగా జమకట్టినందుకు కుట్రదారులకు వచ్చేలాభం ?"

"ఈ ప్రశ్న అడగటం అనవసరం మామగారూ ! కుమారుడు తెలివితక్కువవాడయితే, పెద్దవాడయినంత మాత్రాన సింహాసనం యెక్కలేడనీ - అతడు తమ్ముడి మోచేతిక్రింది నీళ్లు తాగవలసిన వాడేనని మీ జమీందారీలో ఉన్న మామూలు ప్రజలందరికీ కూడా తెలుసు."

కోడలింత నిర్భయంగా ఈ మాటలనటం విని, వృద్ధుడు ఆవేశంతో పడకకుర్చీ చేతిమీద గట్టిగా గుద్దుతూ "ఆ! ఆ! నువ్వు నా జమీందారీని ఛిన్నాభిన్నం చేయటానికి, గంగూలీ కుటుంబాన్ని గంగలో కలపటానికి వచ్చావాయేం ?" అన్నాడు.

కోడలు తొణక్కుండా "కాదు మామగారూ! నేను మీ భ్రమను పోగొట్టటానికని ఇన్ని తిప్పలు పడుతున్నాను" అన్నది.

"నిజమే ! కాని నాది కాదు భ్రమ ! వాడసలు జడుడిలాగానే జన్మించాడు. వాడికి బుర్రలో తెలివితేటలనేవి లేనే లేవు. వాడేనాటికీ గడతేరేవాడు కాడు. ఎంతోమంది దిగ్గజాల వంటి పండితులు - వాడికి చదువుచెప్పే భారం వహించి చివరకు ఈ మాట చెప్పేసి వెళ్ళిపోయారు."

"ఏ కారణంవల్లనయినా కావొచ్చు. వాళ్లు కూడా ఆయన విషయంలో పొరపాటు పడ్డారనే చెప్పాలి."

"నేను తండ్రిని, నేను పొరబడ్డాను - సరే. కాని యేళ్టేటా దండిగా జీతాలు పుచ్చుకునేవాళ్లు వాడికి చదువు చెప్పటానికి అనేక విధాల ప్రయత్నించినవాళ్లు - వాళ్ళూ పొరబడ్డారనే అంటావు. అయితే మరి నిన్నగాక మొన్న వచ్చిన నువ్వేనా వాణ్ణి సరీగ్గా అర్థంచేసుకుంది?"

చండి మాట్లాడకుండా తలవాల్చుకుంది. కాని ఆమె ముఖంలో మాత్రం స్థైర్య లక్షణాలు ఇంకా విశదంగా కన్పిస్తున్నాయి. హరినారాయణబాబు కోరచూపుతో అది గమనించి "అయితే కుర్రవాడి బుర్రలో లోపమేమీ లేదు — మేమే వాణ్ణి పనికిమాలిన వాణ్ణిగా భావిస్తూవచ్చాం - అనేది నువ్వు నాకు గట్టిగా తెలియచెప్పాలనుకుంటున్నా వనుకుంటా. అంతేనా?"

"నేను చెప్పేదేదో ముందుగానే చెప్పేశానండీ!" అన్నది చండి స్పష్టంగా.

"నువ్వేవో చాలాచాలా చెప్పావమ్మాయీ! కాని ఒకమాటకీ - ఒకమాటకీ సంబంధం అతకనప్పుడు - ఏమాట మీాద ఆధారపడాలి? నువ్వు మొదట్లో నేను నకిలీవస్తువును చూపి నిన్ను వంచించానన్నావు!"

"నకిలీ సరుకని మీాకు తెలిసే చలామణీ చేశారు. ఇప్పటికీ మీాకిది నకిలీ సరుకనే గట్టినమ్మకం."

"పోనీ నీమాటే ఒప్పుకుంటాను - కాని మళ్లీ నీ నోటి మీాదుగానే అది నకిలీది కాదు సిసలైన వస్తువే అనీ విన్నాను. ఇంతకీ ఇప్పుడు నువ్వంటున్న దేదీ ఈ మాటల్లో?"

విచక్షణుడైన మామగారు - తన మాటలలోని లోపాన్ని పట్టుకునే - తనమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించ బోతున్నాడనీ - అది వ్యర్థమయేది కాదనీ చండి గ్రహించింది. తాను ఎందుకైతే మామగారిని సమాధాన పరిచేందుకు సాహసించిందో అది తన చివరిమాటలతోనే అపాస్తమైపోతుంది. కాని ఆమె అసాధారణమైన తెలివి ఉపయోగించి - ఆ రెండు మాటలనీ సమన్వయ పరచచూసింది. ఏమాత్రం ఉత్తేజితురాలు కాకుండా మామూలు ధోరణిలోనే - "మీరు బంగారం అని చెప్పి ఇత్తడిని చలామణి చేశారన్న సంగతి పెళ్ళినాడే అందరూ గ్రహించారు మామగారూ! నేను వాళ్ళ భ్రాంతిని పోగొట్టాను. లేకపోతే అక్కడే యేదో పెద్ద గందరగోళం జరిగేది."

"అలాగా!"

"మా తాతగారి ఆశీర్వాద బలిమివల్ల నేను పెళ్ళినాడే - మీరు నన్ను వంచించ ప్రయత్నించారు కాని, వంచించలేక పోయూరు. అది అసలైన మేల్మిబంగారమేనని రేపో మాపో అందరికీ తెలిసిపోతుంది. అందులో ఇంకేం గొడవలేదు. నేను ఫిర్యాదు చెయ్యవలసిన అవసరమూ లేదు. మీరు నాకేమిచ్చారో మీకు తెలుసు. ఏమాలోచించుకుని ఇచ్చారో నేనది గ్రహించాను. కాని నేను పొందిన దేమిటి? అన్న ప్రశ్నమాత్రం మీరెన్నడూ అడుగలేదు నన్ను".

అతడు కోడలి ముఖంకేసి కొంచెంసేపు చూసి, ఆ

బంగారు కొరడా నేను ఏ ఉద్దేశంతో ఇచ్చానంటావ్ నీకు ?" అని అడిగాడు వెంటనే.

"ఇక్కడే మీరు పొరపాటు పడ్డారండీ! అందుకనే ఈ ఇంటికి వచ్చినప్పట్నుంచీ ఆ స్వర్ణగార్దభం యెవరో గ్రహించటం పెద్ద సమస్య అయింది నాకు".

"అయితే ఆ నీ సమస్యను నివారణుడు తీర్చేశాడన్న మాట! నువ్వు ఇక్కడే పెద్ద పొరపాటు పడ్డావు అమ్మాయీ; నివారణుడు స్వర్ణగార్ధభంకాదు. స్వర్ణసింహం!"

చండి నవ్వుతూ "సింహాపు చర్మం కప్పుకున్న ఒక గాడిద ఈ వనరాజ్యాన్నికూడా కొన్నాళ్లు ఏలింది మామ గారూ! అయితే ఆ మోసం యెన్నాళ్ళో చలామణి కాలేదు... ఈ కథ మీరూ తప్పకుండా వినేఉంటారు" అన్నది.

చటుక్కున కోపం వచ్చేసింది జమీందారుకి. "అయితే మరి నీ యధార్థమైన సింహం యెక్కడ? గంట సేపటినుంచీ నాతో వాదంవేసుకుని కూర్చున్నావ్. బయట దర్వాజాదగ్గిర నేను పహారాపెట్టి రాకపోయినట్లయితే ఇంట్లో వాళ్ళంతా ఇక్కడికి పరుగెత్తుకు వచ్చేవాళ్ళే! కాని ఆ సింహం తాలూకు చడీ చప్పుడూ ఎక్కడాలేదు - తన గుహాలో పడుకొని నిద్దరోతోందా? లేక తోక ముడుచుకొని పోయిందా?... అది నివారణుడే అయినట్లయితే—"

మామగారిమాట పూర్తికానీయకుండానే చండి నిస్సంకోచంగా "నివారణుడికి - వారికీ ఉన్న భేదం ఇక్కడే" అనేసింది.

కోపంతో రుసరుసలాడుతూ కోడలి ముఖం కేసి నిప్పులు కక్కుతూ చూశాడు మామగారు. అతడి ఈ భయంకరమైన దృష్టికి తట్టుకుని అతడి మాటలను ఖండించగల సాహసం సాధారణంగా ఎవరికీ ఉండదు. కాని చండి మాత్రం జంకూ గొంకూ లేకుండా మామగారి అరక్తముఖం కేసి చూస్తూ "ఇతర్ల చెప్పేడు మాటలు తన మనస్సులోని అనుమానం - ఈ రెంటినీ గట్టిగా నమ్మితే తర్వాత పస్తాయించాల్సి రాదంటారా మామగారూ?" అన్నది.

మామగారు కనుబొమలు ముడివైచి "ఆ మాటకి అర్థం ఏమిటి? అది ఎవరిని ఉద్దేశించి అన్నట్లు?" అని ప్రశ్నించాడు.

చండి మామగారి ముఖం కేసి దిటవుగా చూస్తూ "నేను సూటిగా ఉన్న యథార్థాన్ని ఉన్నట్లు చెప్పాను మామగారూ! ఏ భ్రాంతయితే ఇన్నాళ్ళనుంచీ పడుతున్నారో, ఇప్పుడుకూడా అదేభ్రాంతి పడుతున్నారు. తమరు విచారణ చెయ్యటానికని యెప్పుడయితే వచ్చారో - దాని కవసరమైన కాగితాలూ మొదలైనవి ఎదుట సిద్ధంగా ఉన్నప్పుడు - వాటిని స్వయంగా చూడకుండా ఇలా మాట్లాడటం భావ్యమేనా?" అని అడిగింది.

హరినారాయణబాబు గట్టిగా నిట్టూరుస్తూ కుర్చీలోంచి లేచి నిలబడి, దీర్ఘనిశ్వాసంతోపాటు - రుద్ధకంఠంతో "హూఁ" అన్నాడు.

చండి రెప్పవాల్చకుండా చూసింది. మామగారు తననుకూడా రమ్మనమని సంజ్ఞ అయినా చెయ్యకుండానే -

వరండాలోకి ఉన్న గుమ్మంలోనుంచి తమ చదువులగదిలోకి వెళ్ళిపోతున్నాడు.

## 17

గోవిందు డింతసేపటినుంచి - ఏదో క్లిష్టమైన లెక్కకి సరియైన ఆన్సరు రాక, కిందామీదా పడుతూ కూచున్నాడు చదువుల గదిలో... అతడికి మరోక ధ్యాసేలేదు. బయట గుమ్మం తలుపు చప్పుడు కావటం, అది విని భార్య లేచి వెళ్ళటం, ఆమె ఇంతసేపటినుంచి తన యెదురుగా కూర్చుని ఉండకపోవటం-ఇవేవీకూడా అతడు గమనించనేలేదు. టేబిల్ మీద తెరిచిఉన్న పుస్తకంలోని పేజీలమీదనే అతడిచూపు నాటుకుపోయింది. అది తప్ప ఇంకదేనికేసి చూడటానికి - ఆ లెక్క పూర్తిఅయితేనే కాని మరోకవైపు మనస్సు మరల్చటానికిగాని అతడికి విశ్రాంతిలేదు.

కొంతసేపయినాక అతడు చటుక్కున చప్పట్లు కొడుతూ 'రూల్ ఆఫ్ త్రీ' ఫినిష్ చేశాను. "ఈసారింకే మిస్తావ్ !" అన్నాడు సంతోషంతో.

పట్టలేని ఆనందంతో - జిజ్ఞాసాదృష్టితో గోవిందుడు భార్య కూర్చుండే కుర్చీకేసి అప్పుడు తలయెత్తి చూశాడు. అక్కడ భార్యలేదు. అక్కడ మరోకరు గంభీరముఖంతో నిలబడి ఉన్నారు. ఈ సమయంలో, ఈ గదిలో, ఈ స్థితిలో ఆయన్ని తాను చూస్తానని ఊహించుకోలేదతడు ! అతడి మనస్సులోని ఉల్లాసం, ముఖంలోని సంతోషం చటుక్కున అప్పుడే మాయమైనాయి. ఆ స్థితిలో ఉండగానే అతడి

కర్తవ్యం మళ్ళీ చటుక్కున స్ఫురించింది. ఆదరాబాదరా కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. భయసంభ్రమాశ్చర్యాలతో అతడికి తెలియకుండానే అతడి నోటినుంచి "నాన్నా! మీరా?" అన్న మాటలు వెలువడ్డాయి.

తండ్రి సమాధానం చెప్పకుండా ఆశ్చర్యంతో కొడుకును ఆపాదమస్తకం తేరిపారచూస్తూ మెల్లిగా ఒక కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. ఆ టేబిల్ మీద నోట్సు పుస్తకాలూ, మామూలు పుస్తకాలూ ఎన్నో చెల్లాచెదురుగా పడిఉన్నాయి. దానిమీద పడిఉన్న రెండుమూడు బైండు పుస్తకాలు తీసి, పేజీలు తిరగేసి చూశాడు తండ్రి. అవి ఏ సబ్జెక్టుకు సంబంధించిన పుస్తకాలయిందీ బహుశా అతడికి తెలియదేమో! మళ్ళీ వాటిని యథాస్థానంలో పెట్టేశాడు. తర్వాత గోవిందుడు గంటలతరబడి నుంచీ చేస్తూ కూర్చున్న లెక్కల పుస్తకంతీసి, ఇంగ్లీషులో చేసిఉన్న లెక్కలకేసి విస్తుబోయి చూస్తూ "ఇవన్నీ నువ్వుచేసిన లెక్కలేనా? నీ దస్తూరీయేనా అబ్బాయీ ఇది?" అని అడిగాడు.

"ఊఁ." అన్నాడు గోవిందుడు నెమ్మదిగా...

"ఇది ఏ గణితం?"

"త్రైరాశిక గణితం"...ఇవాళతో అయిపోయింది."

పుస్తకం పేజీలు తిరగేస్తూ కుతూహలంకొద్దీ "సంకలన గణితానికి చాలా తరువాతదా?" అని తండ్రి మళ్ళీ ప్రశ్నించాడు.

తండ్రి అలా ప్రశ్నించటంతో కుమారుడి మనస్సు ఉబ్బి తబ్బిబ్బయింది. తండ్రి అతడితో ఇలా ఎప్పుడూ

మాట్లాడి ఎరుగడు. అలాంటివాడివాళ తన లెఖ్ఖల పుస్తకమే తిరగేస్తూ, త్రైరాశికం - సంకలనానికి ఎంత తరువాతదో తననే తెలుసుకోవాలనుకుంటున్నాడు.

గోవిందుడు ఉత్సాహంతో "చాలా తరువాతది నాన్నా! ముందు సంకలనము, తరువాత వ్యవకలనము, ఆ తరువాత 'మల్టిప్లికేషన్' (Multiplication) - ఆ తరువాత—" ఆ తరువాతదాని పేరేమిటో చెప్పవలసిన అవసరం కొడుకుకి కలిగించకుండానే "సరే, ఇది ఇవాళతో అయిపోయిందంటున్నావే - ఈ త్రైరాశికాన్ని ఇంగ్లీషులో ఏమంటారు?" అని అడిగాడు తండ్రి.

"'రూల్ ఆఫ్ త్రీ' నాన్నా!" అని వెంటనే చెప్పేశాడు కొడుకు.

హరినారాయణబాబు ఆనంద విహ్వలమైన కొడుకు ముఖంకేసి చూస్తూ.

"సరేకాని అబ్బాయీ! సంకలన గణితమే ఎన్నాళ్ళకీ నీకు సరీగ్గా రాలేదని, మేష్టర్లు 'ఇంక లాభంలేదు, నీ కేమీ రా'వని ఆశ వదులుకొని వెళ్ళిపోయారుకదా! అలాంటివాడి వివాళ త్రైరాశికందాకా ఎలా దాటుకువచ్చావురా?" అని అడిగాడు.

తండ్రి మాటలకు గోవిందుడు తల వంచుకున్నాడు. అతడి ముఖంలో లజ్జ - వ్యథ - ఈ రెండిటి చిహ్నాలూ ఒక్కసారిగా వ్యక్తమయినాయి.

తండ్రి పుత్రుడి ముఖకవళికలు గమనించి, "మళ్ళీ ఇవన్నీ మొదలుపెట్టి ఎన్నాళ్ళయింది?" అని అడిగాడు.

కొడుకు అలా క్రిందికివాలిన చూపునే తండ్రి ముఖం మీద నిగిడ్చి మెదలకుండా ఊరుకున్నాడు. తండ్రి మళ్ళీ తనప్రశ్నను స్పష్టపరుస్తూ—

"నా ప్రశ్న అర్థం కాలేదా యేంరా? చదువు సంధ్య ల్నెనాడో గుంటపెట్టి గంటవాయించావుకదా! మళ్ళీ ఎప్పుడు మొదలెట్టావని అడుగుతున్నానురా!" అన్నాడు.

"పూలపాన్పునాటి రాత్రినుంచి".

"అలాగా! బాగుంది. సరేకాని నేర్పుతున్నదెవరు?" గోవిందుడు మళ్లీ తలవంచుకున్నాడు. తండ్రి ప్రశ్నతో అతడి ముఖం ఎర్రపడింది. తన భార్య అన్నమాటలు చటుక్కున జ్ఞాపకం వచ్చా యతడికి. భార్యాభర్త లిద్దరూ మాట్లాడు కున్న సంగతు లింకెవరికీ చెప్పకూడదని ఆమె గట్టిగా నొక్కి నొక్కి చెప్పింది. తనకు మళ్ళీ ఈ చదువూ అదీ యెవరు చెప్పటానికి పూనుకున్నారో, లెఖ్ఖలెవరు నేర్పుతున్నారో చెప్పాల్సివస్తే భార్యపేరు చెప్పాలి. కాని ఆమె చెప్పవద్దని నిషేధించిందామె! అంచేత ఈ ప్రశ్న విని గోవిందుడు తల వంచుకుని అలాగే నిలబడ్డాడు.

తండ్రి ఓరచూపుతో అది గమనించి, తనలో తాను నవ్వుకున్నాడు. మరుక్షణంలోనే మళ్లీ – "ఇన్నాళ్ళయినాక ఇప్పుడు మళ్ళీ ఈ లెక్కలమీదికి ఎందుకుపోయింది బుద్ధి?" అని అడిగాడు.

గోవిందుడు తలయెత్తి కంపిత కంఠంతో – "ప్రయోజకుడు కావాలంటే ముందు లెక్కలు నేర్చుకుతీరాలి. లేక పోతే బుద్ధి వికసించదు" అన్నాడు.

తండ్రి మనస్సు కేదో చటుక్కున గుచ్చుకున్నట్లయింది. అయినా అతడు మనస్సులోని భావాన్ని గుంభనగా ఉంచుకుని, కొంచెం ఎత్తిపొడుపుగా - "పెద్ద పెద్ద మాష్టర్లు నీకు లెక్కలు నూరిపోయాలని ప్రయత్నించినప్పుడు-అవి మరి నీమనస్సు కెందుకు ఎక్కలేదు ?" అని అడిగాడు.

గోవిందుడు పసివాడిలాగ - "అప్పుడు వాళ్లెవరూ నా కివి తెలిసేట్లు చెప్పలేదు. ఊరికే మాటమాట్లాడితే, నేను గాడిదనని, నాది మట్టిబుర్రని, లాభంలేదు నాకేం రాదని తిడుతూ ఉండేవాళ్లు" అనేశాడు అమాయకంగా.

"తర్వాత ఎవరో - నీది మట్టిబుర్రకాదని, ప్రయత్నిస్తే నువ్వూ ప్రయోజకుడివి కాగలవని తెలిసేట్లు చెప్పారనుకుంటాను".

కొడుకు అవునన్నట్లుగా తండ్రి అభిప్రాయాన్ని బలపరుస్తున్నట్లు తల ఊగించాడు. దాంతోపాటు 'భగవంతుడు కాదు వారి బుర్రలో మట్టి పెట్టింది. ఆపని చేసింది తమలాంటి పూజ్యులే' అని కోడలు తీవ్రంగా వాదించిన మాటలు హరినారాయణబాబు చెవులకు నగారాదెబ్బల్లా వినిపించ సాగాయి.

తర్వాత అతడు కొంతసేపు నిశ్శబ్దంగా గదిలోఉన్న వస్తువులకేసి పరిశీలనగా చూశాడు. 'నిజంగా కేవలం చదువుల గదిలాగానే ఉన్నదది. ఇక్కడ సిసలైన చదువే సాగుతూ ఉంటుం'దని గ్రహించాడు. ఆ మేజాబల్లమీద పడిఉన్న పుస్తకాల్లోంచి ఒక నోట్సు పుస్తకం లాంటిది తీసి, అందులో చక్కగా - నిర్దుష్టంగా రాసిఉన్న కొన్ని పంక్తులు పరిశీలించి

తర్వాత కొడుకుకేసి చూసి – "ఇవి రాసింది నువ్వేనా ?" అని అడిగాడు.

'కాదు' అని తల తిప్పాడు గోవిందుడు.

"ఎవరి దస్తూరీ ఇది ?"

కొడుకు సమాధానం చెప్పకుండా మళ్ళీ తలవంచు కున్నాడు. తండ్రి గోవిందుడికేసి వక్రదృష్టితో చూస్తూ "అయితే ఇది నీ పెళ్ళానిదా ?" అని అడిగాడు.

కొడుకు పెదవులు ఒకటి రెండుసార్లు మాత్రం కది లాయి. తండ్రి అనుమానం సత్యమేనని దాన్నిబట్టే తెలిసి పోయింది.

పుస్తకాలన్నీ పరిశీలించాక తండ్రి దీర్ఘంగా నిట్టూ రుస్తూ "అయితే ఇప్పుడు లెక్కలే మాంచి జోరుగా చేస్తున్నావన్నమాట !" అన్నాడు.

కొడుకు కళ్ళు రెండూ పెద్దవిచేసి, "లెక్కలొక్కటే కాదు. చదువుకూడా బాగానే సాగుతోంది" అన్నాడు.

"అలాగా ! ఏపద్ధతిని సాగుతోందేమిటి ?"

"ఇదిగో – ఈ టైంటేటుల్ చూడండి" అంటూ అతడు ఒక యక్సర్సైజు పుస్తకంలోని పేజీ ఒకటి తీసి చూపించాడు తండ్రికి. అందులో కొంచెం పెద్దపెద్ద అక్షరాలతో దైనిక పార్యక్రమం వ్రాసి ఉంది. తండ్రి విస్తు పోతూ అది చదవటం మొదలెట్టాడు.

తెల్లవారగట్ల అయిదింటినుంచి } ....ఆరున్నరవరకు ....ప్రాతఃకృత్యాలు, వ్యాయామం

ఆరున్నరనుంచి ....ఏడింటివరకు ....మాతృపూజ.

ఏడింటినుంచి ....ఏడున్నరవరకు ....గీతాపఠనం,
ఏడున్నరనుంచి ....ఎనిమిదింటివరకు ....ఉపాహారసమయం.
ఎనిమిదింటినుంచి....పదింటివరకు ....ఇంగ్లీషు.
పదింటినుంచి ....పన్నెండింటివరకు....స్నానం, భోజనం, విశ్రాంతి.
పన్నెండింటినుంచి....మూడింటివరకు ....లెక్కలు.
మూడింటినుంచి ....అయిదింటివరకు ....మాతృభాషాసాహిత్యం.
అయిదింటినుంచి —ఏడున్నరవరకు —ఉపాహారం, వ్యాయామం, సాయాహ్న కృత్యాలు.
ఏడున్నరనుంచి —ఎనిమిదింటివరకు —మాతృపూజ.
ఎనిమిదింటినుంచి —పదింటివరకు —వార్తాపత్రికా పఠనం, ఇష్టాగోష్ఠి వగైరా.
పదింటినుంచి —పదకొండింటివరకు—భోజనం, విశ్రాంతి.
పదకొండింటినుంచి — పన్నెండింటివరకు శాస్త్రపాఠాలు.

అది చదవటం కాగానే పుస్తకం మళ్ళీ కొడుకుచేతి కిచ్చేస్తూ ఒక్క విషయాన్ని గురించి మాత్రం ప్రశ్నిం చాడు – "మాతృపూజా ?"

"ఆ గదిలో అమ్మ ఫొటో ఉంది. ఆ నిర్ణీత సమ యంలో ఆ ఫొటోకి పూలదండ వేసి, ధూపదీపాలతో పూజ చేస్తూ ఉంటాను. తర్వాత 'అమ్మా! నా హృదయంలోని జడత్వాన్ని పోగొట్టు. అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి వివేక జ్యోతిచూపించు. సరియైన పద్ధతుల్లో నేనుకూడా ప్రయోజ కుణ్ణి అయేట్లు అనుగ్రహించు' అంటూ ఆమె ఫొటోకి మోకరిల్లుతూ ఉంటాను."

అని గోవిందుడు తాను మాతృపూజ చేసినప్పుడు అను సరించే పద్ధతిని – అర్ధనిమీలిత నేత్రుడై పసిపిల్లవానిలాగా

అమాయకంగా అభినయపూర్వకంగా తండ్రి యెదుట ప్రదర్శించాడు.

ఈసారి హరినారాయణబాబు ఎంతో కష్టంమీద కాని నిగ్రహించుకోనలేకపోయాడు. అవిరళంగా వస్తున్న అశ్రువులను బలవంతాన అరికట్ట చూస్తే కళ్ళు రెండూ ఎర్రబడి ఉబ్బినవి. అతడికి అన్నీ జ్ఞాపకం రాసాగాయి. వివాహం నాడు కూడా యువకుడైన గోవిందుడి మనస్తత్వం - ఆరేళ్ళ కుర్రాడి మనస్తత్వంలా ఉంది. అలాంటివా డివాళ చటుక్కున ఏదో మంత్రదండ స్పర్శప్రభావంవల్ల అయినట్లు - పదహారేళ్లు చక్కగా చదువుకున్న యువకుని మనస్తత్వాన్ని పుణికి పుచ్చుకోగలిగాడు. ఇంకా కొన్ని సంవత్సరాలు ఈ సాధన ఇలాగే సాగితేచాలు... తానుమాత్రం ఎన్నాళ్ళని బ్రతుకుతా డింకా!

ఇంతలో చదువులగదిలో గడియారం మూడు కొట్టింది... తండ్రి చటుక్కున ఉలిక్కిపడి, రుద్ధమైన కంఠాన్ని ఎలాగో సవిరించుకుని, "నీకింక చదువువేళయింది. సరే ఇంక మొదలెట్టుకో నువ్వు, నే నొక్కసారి ఆ గదిలో కూడా వెళ్లి చూసి వస్తాను" అన్నాడు.

ఈ మాటలు అంటూనే హరినారాయణబాబు మధ్య పెద్ద గదివైపుకు వెళ్ళాడు. కొంతసమయం వృథా అయిపోతోందే అని గోవిందుడిప్పటిదాకా దిగులుపడసాగాడు. ఇప్పుడిహ నిశ్చింతుడై ఈ వేళకు చదువుకోవలసిన పుస్తకాలు తీసుకుని కూచున్నాడు.

# 18

మధ్య హాల్లోకి రాగానే హరినారాయణబాబు దృష్టి అర్ధాంగి ఫొటోమీద పడింది.

స్వర్గీయురాలైన ఈ సహధర్మచారిణి ఫొటోని అతడు చాలాసార్లు చూశాడు. ఆ సాధ్వీమణి స్మృతుల నెన్నో గుర్తుకుతెచ్చే ఈ హాల్లో నుంచుని, గడిచిపోయిన గాథల నెన్నో జ్ఞప్తికి తెచ్చుకునే అవకాశాలు చాలాసార్లు లభించాయి అతడికి. ప్రియావిరహానుభూతితో ఎన్నోసార్లు దీర్ఘంగా కూడా నిట్టూర్చాడు. కాని, ఇవాళ మళ్ళీ ఆ హాల్లోకి, సుపరిచితమైన ఆ చిత్తరువు దగ్గరకి వచ్చి నిలబడగానే అతడి కేదో పవిత్రమైన పూజామందిరంలో అడుగు పెట్టినట్లు, దేవీ ప్రతిమ సాన్నిధ్యంలో నిలబడినట్లు తోచసాగింది. పెద్దహాల్ లాగా ఉన్న ఈ గదిలో ఒక వైపున శయ్యా అవీ అమర్చి ఉన్నాయి. అయినప్పటికి అన్నీ ఎంతో శుచిగా అమర్చి ఉండటంవల్ల ఈ గదిలోని ప్రతివస్తువూ దేవతా నిర్మాల్యం లాగా అనింద్యంగా - అనవద్యంగా భాసిస్తున్నది. గతంలో ఎన్ని అహోరాత్రాలు అత డీ గదిలో గడపలేదు! అయితే యేం ఎన్నడూకూడా ఇదొక పవిత్రమైన పూజామందిరమనే అనుభూతి మాత్రం కలగలేదు. ఈ గదిలో గోడకి తగిలించి ఉన్న తన భార్య చిత్తరువులో కూడా ఏదో అపూర్వమైన తేజస్సు ఉన్నట్లు ద్యోతకమవుతోంది. హరినారాయణబాబు తీక్ష్ణంగా చూశాడు. చిత్తరువులో ఉన్న వ్యక్తి శిరస్సుమీద సన్నగా ఉండే సింధూర

రేఖ - సిద్ధహస్తుడైన చిత్రకారుడి కుంచెతో రోజురోజుకీ విస్తృతమవుతున్నట్లు ధగధగ ప్రకాశిస్తోంది. ఈ స్వల్పమైన మార్పుతో ఆ తైలవర్ణచిత్రంలోని ముఖసౌందర్యం ఎంతో ఇనుమడించినట్లుంది. కాని ఈ లోపం ఇదివరకెన్నడూ అతడి దృష్టికి కొరతగా తోచలేదు. పాపిటలోని ఈ సింధూరరేఖ, సువాసన పుష్పాలతో ఎంతో చక్కగా కట్టి వేసిన ఆ పూల మాల, ఆ చిత్తరువులో ఉన్న ఆకృతికి జీవం పోస్తున్న ట్లున్నాయి. అతడు రెప్పవాల్చకుండా ఆ చిత్తరువుకేసే చూస్తున్నాడు. కొన్ని క్షణాలు గడిచాక దృష్టి కొంచెం మరల్చగానే ఆ చిత్తరువుకి దిగువున పాలరాతిమీద ఒక పళ్ళెంతో పెట్టిఉన్న పుష్పాలు కంటపడ్డాయి. అవి చిత్తరువు లోని దేవికి భక్తిశ్రద్ధలతో అర్పించిన పూజాద్రవ్యాలని అతడు గ్రహించాడు. ఉదయం - సాయం వేళలలో మాత్ర పూజకై కొంతసమయం ప్రత్యేకించబడిఉన్న పుత్రుడి టైంటేబిల్ చటుక్కున మళ్ళీ ఆతడి కళ్ళకి జిగాల్ మని కన్పించింది.

తర్వాత అతడు మెల్లిగా శయ్యవైపుకు వెళ్ళాడు. ఆ శయ్యకూడా నిర్దిష్టస్థానంలో లేకుండా గదిలో ఒకమూలగా ఉన్న రెండు కిటికీలకు మధ్య ప్రదేశంలో వేసి ఉండటం అతడు గదిలోకి రాగానే గమనించాడు. ఇప్పుడు దగ్గరకెళ్ళి చూశాడు. కేవలం స్థలం మార్పేకాదు. ఆ శయ్యలోకూడా చాలా మార్పువచ్చిందిప్పుడు. ఇదివరలో చక్కగా మెత్తని పరుపులతో కంటికి నిండుగా ఒకే శయ్యగా ఉన్నది - ఇప్పుడు రెండు శయ్యలగా విభజింపబడి విడివిడిగా ఉన్నాయి. ఇది

వరలో పైన పరచిఉండే మొఖమల్ దుప్పట్లుపోయి, ఇప్పుడా స్థానంలో కృష్ణాజినాలు పరిచిఉన్నాయి. ఒకశయ్యకీ ఒక శయ్యకీ మధ్య బారెడు ఎడంమాత్రం ఉంది. హరినారాయణబాబు విస్మయంతో - కుతూహలంతో రెండు ప్రక్కలీన్నీ స్పృశించి చాలా పరిశీలనగా చూశాడు. రెండింటికీ తేడా యేమీలేదు. రెండు శయ్యలలోనూ ఒకేవిధమైన కాఠిన్యమూ, ఒకేరకమైన శుచిత్వమూ వెల్లడవుతున్నాయి. 'వెల్వెట్ క్లాత్' వేసి కుట్టించిన తలగడాలు ఇప్పుడేపక్క మీదా ఉన్నట్లులేవు. ఇప్పుడున్న తలగడాలుకూడా శయ్యల లాగానే కఠినంగా ఉన్నాయి. ఈ తలగడాలుమీద పచ్చటి మొద్దు ఖద్దరు గుడ్డలు పరిచిఉన్నాయి. ఆ కృష్ణాజినాలు పరిచిఉన్న పక్కలమీద ఈ తలగడాలు ఎంతో అందంగా ఉన్నాయి.

మరికొంతసేపు హరినారాయణబాబు అక్కడే నిలబడి, మనస్సులో ఏమి ఆలోచించుకున్నాడో తర్వాత మెల్లిగా భార్య చిత్తరువుదగ్గిరకొచ్చి 'అమ్మాయీ' అని పిలిచాడు కోడల్ని.

ఆయనపిలుపు వినబడగానే 'నన్ను పిలిచారా మామగారూ!' అన్న కోడలిమాటలు విన్పించాయి. మామగారి తీవ్రదృష్టి గుమ్మంవైపునేపడింది. ఆయన పిలుపుకు సమాధానం చెపుతూనే కోడలు లోపలికి రావటం చూశాడు. ఆమెముఖంలో విక్షోభంకాని, విసుగుకాని, అభిమానం కాని, అనుమానంకాని ఉన్న లక్షణాలేవీ కన్పించనేలేదు. కొన్నిక్షణాలక్రితం విరామం అనేది లేకుండా ఎంతోసేపు

తనతో వాదంవేసుకు కూర్చున్నది. తనకి యెంత అఘాతం తగిలినా దాన్ని ఓర్మితో సహించి, మళ్ళీ మాటల్లో ఎదుట వ్యక్తిని అఘాతపరచటంలో వెను తీయలేదామె. చివరికి మాట్లాడటమంతా అయిపోయాక బుద్ధిపూర్వకంగానే ఆమెని నిర్లక్ష్యంచేసి తాను ఈగదిలో ప్రవేశించాడు. అయినా ఆ అద్భుతమైనపిల్ల తన పిలుపు వినగానే - అస లింతకుపూర్వం అప్రియమైన సంఘట నేదీ జరగనట్లు - ఈ పిలుపుతోనే ఆదరా బాదరా పరుగెత్తు కొచ్చినట్లు - మామూ లుగా వచ్చి నిలబడి జిజ్ఞాసాదృష్టితో మామగారి ముఖం కేసి చూడసాగింది. మనస్సులోని ఆశ్చర్యం ముఖంలో వ్యక్తం కానీయకుండా - పైకి గంభీరంగా - "ఆ గదిలో ఉన్న నీకాగితాలూ-పుస్తకాలూ అన్నీచూసివచ్చా నమ్మాయీ!" అన్నాడు.

చండి ఒక్కసారి మామగారి ముఖం కేసి చూసి మళ్ళీ వెంటనే తలవంచుకుంది. సమాధానం ఏమీ చెప్పలేదు.

హరినారాయణబాబు కోడలి ముఖంలోని భావాన్ని ఓరచూపుతో గమనించి, తన మాటల్ని కొంచెం వక్రంగా మార్చి, "ఈ గదిలోని వస్తువుల్ని - హఠాత్తుగా ఇలా ఎందుకు మార్పించావో అర్థంకావటం లేదు" అన్నాడు.

చండి ఈసారి తలయెత్తి నెమ్మదిగానూ దృఢంగానూ అన్నది - "మార్చవలసిన అవసరం వచ్చింది మామగారూ!"

"అవసరం వచ్చిందా ? అంటే దాని అర్థం ?"

"ఆ అర్థం - మీరా గదిలో కాగితాలూ అవీ చూసి వచ్చినా - నిజంగా ఇంకా అర్థంకానేలేదా మామగారూ ?"

కోడలింత కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడటంతో మామగారి ముఖం మళ్లీ బిరుసెక్కింది. కాస్సేపు ఊరుకుని, కోడలికేసి తీక్ష్ణంగా చూస్తూ "నీ మనస్సులోని అసలు ఉద్దేశాన్ని ఎలాగయితేనేం ఇప్పటికి గ్రహించాను" అన్నాడు.

చండి మామగారిముఖంకేసి ప్రశ్నార్థకంగా చూసింది. "మా యింట్లోఉన్న సంప్రదాయం ప్రకారం - మాయింటికి కోడలుగావచ్చిన అమ్మాయిని సంవత్సరం వరకు పుట్టింటికి పంపించే పద్ధతి లేదని మీ నాన్నతో పెళ్ళినాటి రాత్రే చెప్పాను. ఈ నియమాన్ని ఉల్లంఘింపచెయ్యటానికి - దీనికి ఏదో అడ్డుచెప్పి, ప్రాధేయపడటంలో అతడు వెనుదీయలేదు. అయినా నేను మాత్రం ఒప్పుకోలేదు. కాని ఇప్పు డని పిస్తోంది - నే నన్నమాటను చెల్లకుండా చెయ్యాలనే నువ్వు ఇక్కడింత బేఫర్వాగా ఈ పనులన్నీ చేస్తున్నావల్లే ఉంది" అన్నాడు మామగారు.

వధువు ముఖంలో చిన్న మెరుపులాగా చిరునవ్వు తళుక్కుమంది. మామగారి ముఖంకేసి స్నిగ్ధదృష్టితో చూస్తూ—"అయితే ఇందులో నాకొచ్చే లాభం ఏముంది మామగారూ ?" అని అడిగింది.

"మళ్ళీ నీ పుట్టింటికి వెళ్ళటమే లాభం! వాళ్ళు నిన్నుచూసి ఆశ్చర్యపోతారు. నువ్వు సగర్వంగా-ముసలాడి మాట చెల్లకుండా చెయ్యటానికని నే నక్కడికి వెళ్ళి ఇంత పని చేసివచ్చానని చెప్పగలవు." అన్నాడు మామగారు.

"నే నెప్పుడూ అనవసర విషయాల్ని గొప్పచేసి మాట్లాడను. అలా మాట్లాడటమంటే నాకు అసలు

యెప్పుడూ గిట్టదు. అలా అయితే మీరు నా విషయంలో పొరపడ్డారన్న మాట !''

''పొరపడ్డానా ? నువ్వనేది నిజమేనా అమ్మాయీ ?''

''మీ రిలా అనటం - నాకు శాపం వరంగా పరిణమించి నట్లయింది - అని నేనంటే మీరు విశ్వసిస్తారా మామగారూ ?''

అతడు తన మాటలను ఇంకా కొంచెం మెత్తగా మార్చి ''అదేమిటి ?'' అని అడిగాడు.

చండి ముఖంలో దృఢత్వం ఉట్టిపడుతూనే ఉంది. ఆమె గొంతు సవరించుకుని, సుస్పష్టంగా ''మీ అబ్బాయితో పరిచయం కలిగిననాటి రాత్రే - వారి విముక్తికోసం నే నిక్కడే ఉండి ఈ తపస్సును సంవత్సరం వరకు కొనసాగించటానికి నిశ్చయించుకున్నాను'' అన్నది.

మామగారు సంశయాన్ని వెల్లడిస్తూ ''సంవత్సరం వరకు పుట్టింటికి వెళ్ళటానికి వీల్లేదని తెలిసేనా ?'' అని అడిగాడు.

''నేను బుద్ధిపూర్వకంగానే పుట్టింటి మార్గాన్ని మూసివేసుకుని వచ్చాను మామగారూ !''

''బుద్ధిపూర్వకంగానా ?''

అశ్రురుద్ధ నేత్రాలతో మామగారి ముఖంకేసి చూస్తూ చండి సమాధానం చెప్పసాగింది. ''అందుకే అప్పుడు కనకాంజలి ఇవ్వటం ! - తమరిచ్చిన పళ్ళెము మొహిరీలూ మా అమ్మ ఒడిలో పోసి, బంధాలన్నీ త్రెంచేసుకుని, ఒకే ఉద్దేశ్యాన్ని, ఒకే లక్ష్యాన్ని మనస్సులో పెట్టుకుని—''

దుఃఖంతో చటుక్కున ఆమె గొంతు పట్టుకుపోయింది. ఆ పైమాట ఇంక బయటికి రాలేదు.

మామగారు చటుక్కున త్రుళ్ళిపడి, ఆశ్చర్యంతో - "ఆఁ. అవును - జ్ఞాపకముంది" అన్నాడు. తర్వాత మళ్ళీ ముఖ కవళికనూ, మాటతీరునూ మార్చుకుని, "ఆఁ. నీ లక్ష్యమేదో పట్టుబడిపోయింది. పోనీ నువ్వన్నట్లే పుట్టింటికెళ్ళే మార్గాన్ని బంధించావనేది ఒప్పుకుంటాను. కాని అత్తవారింటికి వచ్చి ఈ చేసేపనులేమిటి మరి? ఎవర్ని లక్ష్యపెట్టవు. ఈ యింటి కోడలివి నువ్వు. అయినా ఎవరితోనూ నీకు సంబంధం లేదు. మంచి చెడులవైపు నీకు దృష్టి లేనేలేదు. కర్తవ్యాల నన్నిటినీ త్రోసిపుచ్చి నీ లక్ష్యాన్నే నువ్వు పట్టుకుకూర్చున్నావు! చిత్రం! అన్నాడు.

క్షణంలో చండి ముఖంలో కాఠిన్యం వ్యక్తమయింది. కన్నీళ్ళు కార్చిన ఆ దుర్బలత్వం రెప్పపాటులో మాయమైపోయింది. మామగారి ముఖంకేసి నిండుగా చూస్తూ "ఈ ప్రసంగాన్ని ఇంతటితో విరమించండి మామగారూ! ఇది అప్రియమైన చర్చ" అన్నది ధీమాగా.

కోడలి మాటలతో హరినారాయణబాబుకి విపరీతమైన కోపం వచ్చేసింది. ఆమె ఇవాళ హద్దుమీరి, చర్చించ తగిన విషయా లేవో కూడా తానే నిర్దేశిస్తోంది. ఈ ప్రస కి ఆమెకి ప్రాణంమీదికి వచ్చినట్లుందని గ్రహించాడతడు. అంచేత దీన్నే ఆధారంగా చేసుకుని, అతడు కోడల్ని తగినట్లు అఘాత పరచటానికి సంసిద్ధుడయినాడు.

మాటలోనే తన కోపాన్ని వ్యక్తంచేస్తూ అన్యాయాన్ని గురించి వచ్చే చర్చ ఎప్పుడూ అప్రియంగానే ఉంటుంది. దీన్ని కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నించటం మరీ అన్యాయం. నేను నిన్ను అడిగిన ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పి తీరాలి. నువ్వు ఇంతవరకు ఎన్నడూ అన్యాయం అనేది చేసి యెరుగవని అప్పుడు మరి గట్టిగా వాదించావుగా!" అన్నాడు.

చండి నిరుత్తరయై తల వంచుకుంది. ఏమీ మాట్లాడలేదు. కాని ఈ మౌనం ఆమె ఇదివరకన్న మాటలనే బలపరుస్తున్నట్లుంది.

మామగారీసారి మరింత గట్టిగా "నవవధువులు అవశ్యం చేయవలసిన కర్తవ్యాలను వేటినీ నువ్వింత వరకు చేయలేదని నే నంటున్నాను" అన్నాడు.

చండి అలాగే తలవంచుకుని ఉంది. మామగారి మాటల్ని ఆమె కాదనీ అనలేదు. తనమీదఉన్న అభియోగాన్ని తాను అంగీకరించటం లేదన్నట్లయినా ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

"నువ్వు 'కా'దనలేవు అని తెలుసునాకు. నువ్వు ఈ యింటికి వచ్చి మూడుమాసాలు పైనయింది. నీ ప్రవర్తన వల్ల – ఇంట్లో ఉన్న వాళ్ళతో ఎవ్వరితోనూ నీకు సంబంధం అక్కర్లేదన్నసంగతి అందరికీ తెలిసిపోయింది. అసలు ఎవరిమీదా లక్ష్యమన్న మాటేలేదు నీకు. ఈ మాట కాదంటావా నువ్వు?" అని అడిగాడతడు,

చండి అప్పటికీ మాట్లాడలేదు. రాతి బొమ్మలాగా, రెప్పవాల్చకుండా తల వంచుకుని అలాగే చూస్తూ నిలబడింది.

"అయితే నువ్వీ మాట ఒప్పుకుంటున్నావన్న మాటేగా! నేను ఇంకా కఠినంగా చెప్పాల్సి వస్తోందమ్మాయీ! ఇది అప్రియమైనదయితే అవచ్చుకాని అక్షరాలా యథార్థం మట్టుకు అవును. నీ అత్తగారు, మరిది ఆడబిడ్డ వీళ్ళెవరి సంగతీ నీ కసలు అక్కర్లేదు. కావాలన్న మాటకూడా తోచదు నీ మనస్సుకు. ఇహ-ఇహ నీకు నామీద కూడా ఏమాత్రం లక్ష్యంలేదన్న మాటా యథార్థమే".

చండి ముఖంలో మార్పేమీ కన్పించలేదు. అంతదాకా యెందుకు? ఇలా ఒకదానివెంట వొకటి చొప్పున ఆరోపణలు చేస్తున్నా ఆమె ముఖంలో దిగులూ, విచారమూ, భయమూ ఉన్నట్లు ఛాయగానైనా కన్పించలేదు.

మామగారు ఈసారి కొంచెం తగ్గి మృదువుగానూ - వికృతంగానూ అడిగాడు. "ప్రపంచంలో నీకున్న ఏకైక లక్ష్యం భర్తే! అవునా?"

ఆ రాతిబొమ్మ కింతసేపటికి ప్రాణం వచ్చినట్లయింది. పమిటచెంగు కంఠాన్ని చుట్టుకుని, మామగారి పాదాలచెంత వ్రాలి గద్గద కంఠంతో "ఇవాళ మీ అనుమానమే నాకు పరమ ఆశీస్సు!" అన్నది.

మామగారు తదేక ధ్యానంగా చండి ముఖంకేసి చూస్తూ "కాని ఇది నూతన వధువు కేమంత గౌరవనీయమైన విషయం కాదు...సీత, సావిత్రి, దమయంతి వీరూ వధువులే,

వాళ్ళకీ భర్త లున్నారు, అత్తగార్లున్నారు. సంసారాలూ ఉన్నాయి" అన్నాడు.

చండి వినమ్రస్వరంతో – "కాని కర్తవ్య సమస్య వీరి జీవితాల్లోకి తుపాను తీసుకొచ్చినప్పుడు మాత్రం వారికి ఏకైకలక్ష్యం భర్తే. ఆ సంగతి పురాణాలు చూస్తే తెలుస్తుంది మామగారూ!'' అన్నది.

కోడలిలా యెదురు జవాబు చెప్పటంతో మామగారు మరింత మండిపడ్డాడు. "పురాణాల్లోని విషయాలు తీసుకుని నీతో చర్చించటం ఇష్టం లేదు నాకు – అవసరమూ లేదు. కాని నువ్వు అన్న మాటలను మాత్రం ఈ యుగంలో ఎవరూ సమర్థించరు. నీ దస్తరంలో రామకథామృతం కూడా చూసి వచ్చాను నేను. అది నువ్వు తప్పకుండా చదివే ఉంటావు. ఆయన ఏమన్నాడు...? వంట చేయడం చేతనయిన అమ్మాయికి వళ్లు శుభ్రంగా ఉంచుకోవటం తెలియకపోదు. భర్త మీద గౌరవం ఎంతముఖ్యమో అలాగే సంసారంలో అన్ని విషయాలమీద లక్ష్యం ఉంచుకోవటం కూడా అంత ముఖ్యం''.

మామగారి మాటను శ్రద్ధగా ఆలకించి, చండి తల పైకెత్తి "శ్రీరామకృష్ణ ప్రభువులు ఆ మాట సంసారులనుద్దేశించి అన్నారు మామగారూ! సంసారంలో చాలా పనుల్లో మునిగిఉన్న వారుకూడా దానివల్ల భగవంతుని మీద, లక్ష్యం ఉంచుకోగల్గుతారు. కాని, ధ్రువుడు, ప్రహ్లాదుడు, ఇలాంటి వారి విషయంలో ఈ మాట చెల్లుతుందా?"
అన్నది.

మామగారు వెటకారంగా "అయితే వాళ్లుపోయిన మార్గాన్నే అనుసరించాలని నీ కోరికా ? అందుకనేనా యేం అందర్నీ నిర్లక్ష్యంచేసి ఏకముఖి రుద్రాక్షవయి కూచు న్నావ్?" అని అడిగాడు.

"ఏకోన్ముఖంగా చెయ్యకపోతే ఏ సాధనా సిద్ధించదు-మామగారూ !"

మామగారు విస్తుపోతూ "సాధనా ?" అని అడిగాడు.

కోడలు ధీమాగా "అవును మామగారూ ! సాధనే. కాని ఈ దేశంలో ఇంక ఏ వధువూ నాలాగా ఇంత కఠోర సాధనను ప్రారంభించలేదు. ఇంత కఠిన పరీక్షకూడా ఎన్నడూ ఏ స్త్రీకి వచ్చిపడలేదు. అందుకనే నే ననేది. వివాహంనాటి రాత్రి నేను పొందిన 'వస్తువు'ను ఉత్త మోత్తమమైన వస్తువుగా చెయ్యటానికి నా లక్ష్యాన్ని పూర్తిగా అటు మార్చుకోవలసి వచ్చింది. ఎవరికోసమైె, నా సాధనో, నా లక్ష్యంకూడా వారివైపే. వారి సాధనను ఫలింపచేసేవరకు నా లక్ష్యాన్ని మార్చుకుంటానని ఏమీ అనుకోనక్కర్లేదు మామగారూ !" అన్నది.

హరినారాయణబాబు ముఖం గంభీరంగా పెట్టి "మీ యీ సాధన ఎన్నాళ్లవరకు సాగుతుంది ?" అని అడిగాడు.

సంవత్సరం వ్రతం పట్టానని ముందుగానే చెప్పాను కదండీ !"

"సరే తెలిసింది. కాని ఆ వ్యవధిని కొంతవరకు తగ్గించాల్సిన అవసరం వచ్చింది".

చండి తలయెత్తి ప్రశ్నార్థకంగా మామగారి ముఖం కేసి చూసింది.

"నీ మీద వచ్చిన ఫిర్యాదును అన్నాళ్లవరకు విచారించకుండా పడేసి ఉంచటానికి వీల్లేదు".

చండి తీక్ష్ణంగా మామగారి కేసి చూస్తూ – "ఈ వ్యవధికీ – నామీద ఫిర్యాదుకీ సంబంధం యేముందో నాకు బోధపడలేదు. అయినా విచారణ కాకముందే శిక్షించే ఏర్పాటు చేస్తారా ?" అని అడిగింది.

"అది సరికాదు. పైగా ఈ ఫిర్యాదు నుంచి నిన్ను తప్పించే ఏర్పాటే జరుగుతోంది. ఇప్పుడు వ్యవహారం వచ్చిపడింది. కనుక మీరు ప్రారంభించిన వ్రతానికి విఘ్నం రావొచ్చు. లక్ష్యం మరొకవైపుకు పోవటానికి ఎక్కువ అవకాశం ఉంది. అందుకే చెప్పాను ఈ మాట; ఇప్పుడు నా వాంఛ – ఏమిటంటే ఈ రోజు మొదలుకొని నాలుగు నెలలు లోగా మీ వ్రతానికి ఉద్యాపన జరపాలి !"

"నాలుగు మాసాల లోపలా ?" చండి నోటినుంచి ఈ మాట అస్పష్టంగానే వెలువడింది.

"ఆఁ. నాలుగు నెలలు మాత్రమే వ్యవధి ఇవ్వబడింది. వచ్చే ఆశ్వీయుజమాసం దేవీ నవరాత్రాలు ప్రారంభదినం నాటికే మీ వ్రతోద్యాపనం జరగాలి; తర్వాత నీ విచారణ ప్రారంభమవుతుంది. ఈలోగా రెండువైపులనుంచి వచ్చిన ఫిర్యాదుల్ని గురించి దర్యాప్తు మాత్రమే జరుగుతుంది" అన్నాడు హరినారాయణబాబు ఉత్సాహంతో గట్టిగా...

"విచారణనుగురించి నాకేం దిగుల్లేదు మామగారూ! వ్రతం పూర్ణం కావలసిన వ్యవధి చాలా తక్కువగా ఉన్న దనే విచారం".

"మూడు మాసాలు ఈ వ్రతంతోనే గడిచిపోయాయి. ఇంకా నాలుగు మాసాలున్నాయి. నాలుగు మాసాలంటే తక్కువా? కొద్దిరోజుల వ్యవధి ఉంటే పెద్దపెద్ద భవనాలే కట్టగా లేనిది నాలుగు నెలలు వ్యవధిలో ఒకర్ని ప్రయోజకుణ్ణి చెయ్యటం అసంభవ మవుతుందా?"

మామగారి మాటలతో చండి ముఖం అపరిమితమైన ఉత్సాహంతో ఉద్దీప్తమయింది. మామగారి ముఖంకేసి ఉజ్జ్వలంగా చూస్తూ—

"తమ ఆశీర్వాదం కనుక ఉంటే అసంభవ మనుకున్నది సంభవమే అవుతుంది మామగారూ!" అన్నది.

కోడలి మాటలకి ఈసారి మామగారికి నవ్వొచ్చింది. అంతలోనే అతడు కొంచెం సగర్వంగా "అయితే ఇప్పుడు చెపుతున్నాను. భవిష్యత్తును పారచూసే అప్పుడు నీకు బంగారపు కొరడాను బహుమతిగా యిచ్చాను. దానిఅండతో ఈ అసంభవాన్ని ఏనాటికైనా సంభవంగా చేయగలవని తెలిసే ఇచ్చాను".

మామగారి మాటలతోపాటు - ఆయన యిచ్చిన ఈ బంగారపు కొరడా దెబ్బకూడా ఒకటి తన వీపున తగిలినట్లు తోచిందామెకి. ఒళ్లు మండిపోయింది. ఆ మంటను అణచుకుని, ముఖంలో వ్యక్తమవుతున్న క్లేశ చిహ్నాలనుకూడా బలవంతాన కప్పిపుచ్చుకుని, సవినయంగా - "తమరు

కొంచెం సేపు ఆగండి మామగారూ! నేను యిప్పుడే వస్తాను!'' అన్నది.

మామగారు తీవ్ర దృష్టితో గమనిస్తూనే ఉన్నారు. వధువు గబగబా ప్రక్కనున్న గదిలోకి వెళ్లింది. బయటకు విన్పించిన ధ్వనినిబట్టి ఆమె అక్కడ పెట్టె దీసినట్లు తోస్తోంది. చటుక్కున అతడి కనుబొమలు రెండూ ముడివడ్డాయి.

చాలా కొద్ది సేపటిలోనే, వధువు తిరిగిరావటం చూశాడు. కాని కోడలి చేతిలోఉన్నవస్తువుమీద అతడి ఉత్సుక దృష్టి పడగానే "ఆ బంగారపు కొరడాయేనా ఇది?'' అస్వాభావిక మైన కంఠస్వరంతో అడిగాడు.

వధువు అతి సహజమైన ధోరణిలో "అవును మామ గారూ! మీరిచ్చింది ఇచ్చినట్లు అప్పట్నుంచీ పెట్లోనే ఉంచాను. ఇంతవరకు దాన్ని ఉపయోగించాల్సిన అవసరం రాలేదు. అంచేత మీవస్తువును మీకు తిరిగి అప్పగించే స్తున్నాను.'' అన్నది.

మామగారు కళ్లు రెండూ ప త్తికాయలంత చేసుకుని, చండీకేసి చూస్తూ "తిరిగిఇచ్చేస్తున్నావా?'' అని అడిగాడు.

చండి పెదవులమీద చిరునవ్వు కన్పించింది "ఇచ్చిన వస్తువును సంపూర్ణంగా వినియోగించి సార్థకం చెయ్యక పోతే - దాన్ని ఉంచి లాభంలేదు మామగారూ! అది బరువౌతుంది చివరికి''.

మామగారు మ్లాన దృష్టితో చండికేసి చూస్తూ "అయితే నేనే పొరపడ్డానా?'' అన్నాడు భగ్న స్వరంతో.

చండి ఏమాత్రం తొణక్కుండా చెప్పింది జవాబు. "మీరు ఈ పొరపాటును ఇచ్చేటప్పుడు ఊహించలేదు మామగారూ ! మీరు అసలు నా కోసమని ఉంచిన వస్తువు మన్నుకొట్టుకుని ఉన్న బంగారం లాంటిది. బంగారపు కొరడాతో ఝుళిపించి ఆ వస్తువును ఏనాడూ అసలు బంగారుగా చెయ్యలేము. అందుకు కావలసింది ఒరపిడిరాయి. అలా బంగారాన్నిగా మార్చేందుకే ఏకోన్ముఖమైన ఈ సాధన".

మామగారు రెప్పవాల్చకుండా కోడలి దృప్తముఖం కేసి చూడసాగాడు. చండి ఇంతలో ఆ కొరడాను మామగారి పాదసన్నిధిని పెట్టి, "నేను దీని మర్యాద కాపాడలేకపోయాను మామగారూ ! క్షమించండి !" అన్నది.

హరినారాయణబాబు వివర్ణ ముఖంతో వంగి ఆ కొరడాను అందుకుని, "నిజంగా నువ్వీ భారాన్ని వహించటానికి ఒప్పుకోవా అమ్మాయీ ?" అని అడిగాడు.

"అవును మామగారూ ! నిజంగా ఇది నా తాహతుకు మించిన బరువు" అని మరుక్షణంలోనే "అసలు ఇది కంట పడితేనే ఒళ్లు మంట నాకు" అన్నది.

మామగారు నీరసంగా - "అలాగా ! అయితే పోనీ ఈ భారాన్ని నివారణుడికి అప్పచెపుతానులే" అన్నాడు.

చండి ముఖం ఒక్క నిమిషంపాటు ఉత్తేజితమయింది. చింతనిప్పుల్లాంటి కళ్ళతో ఆమె మామగారి ముఖంకేసి చూస్తూ "అలాగే అప్పచెప్పండి. కాని అత్తగారి ముఖంకేసి ఒక్కసారి చూసి, దాని కసలైన స్థానం ఎక్కడో ప్రశ్నించా

రంటే – దానికి జవాబు మీ మనస్సుకు మీకే తోస్తుంది మామగారూ!'' అనేసింది ఒక్క గుక్కలో.

ఈ మాటలు అంటూనే చండి చరచరా ప్రక్కగది లోకి వెళ్ళిపోయింది. ఆ చివరిమాటలో ఉన్న చురుకేదో మామగారికి గట్టిగానే తగిలింది. వెంటనే అతడు భార్య చిత్తరువు కేసి విచారంగా చూస్తూ "నువ్వు లేని ప్రదేశమంటూ ఎక్కడుంది? నీ కన్నీ తెలుసు. నీ విషయంలో చేసిన పొరపాటుకి ఇన్నాళ్ళకి ప్రతీకారం చెయ్యటం అంటూ తట స్థపడుతోంది. ఇప్పుడు నువ్వే ఓసారి దిగివచ్చి, ఈ కొరడాని నీ చేతులతో స్వీకరిస్తే, గంగూలీ వంశంలోని అయోగ్యమైన ఈ స్వర్ణ గార్దభాన్ని శిక్షించగలవు. దీని కదే సరియయిన ప్రాయశ్చిత్తం!'' అంటూ వాపోయాడు...

## 19

బయట యజమాని గదిలో ఆఫీసు మర్యాద లెలా పాటించబడతాయో, అలాగే అంతఃపురంలోని రాణీగారి గదిలో కూడా అలాంటి మర్యాదలే పాటించబడుతూ ఉంటాయి. అంతఃపుర పరిచారికలు అనవసరమైన ఉల్లాసాన్ని ప్రదర్శించటం, శుష్కప్రియాలు మాట్లాడటం మొదలైన వాటిని రాణీ సాగనివ్వదు.

దాదాపు ముప్పై అడుగుల పొడుగున ఉన్న గది అది. ఆ గదిలో ఒకవైపున సోఫాలు, పడక కుర్చీలూ, నగిషీకోళ్ళ పందిరి మంచమూ అన్నీ పొందికగా అమర్చి ఉన్నాయి. రెండోవైపు ఇంచుమించు ఖాళీగానే ఉంది.

క్రింద తివాసీలు మాత్రం పరిచి ఉన్నాయి. ఆచోటు అలా ఖాళీగా ఉంచటానికి కారణం యజమాని తరచుగా అక్కడకు వచ్చి పచార్లు చేస్తూ ఉంటాడు. ఏదైనా జటిలమైన సమస్య వచ్చినప్పుడు, జమీందారు ఇక్కడకు వచ్చి చేతులు వెనక్కి కట్టుకుని, అటూయిటూ పచార్లుచేస్తూ గంటలకి గంటలు గడుపుతూ ఉంటాడు అది అతడికి బాగా అలవాటు.

కాని ఇవాళ మాత్రం ఆయన ఏదో చిరాకుగానే ఇక్కడకు వచ్చి పచార్లు చెయ్యసాగాడు. అడుగడుగుకు ఆయన ముఖం చిట్లిస్తూనే ఉన్నాడు. ఆ ప్రశాంత ముఖంలో విచార రేఖలు విస్పష్టంగా కన్పిస్తున్నాయి. ఆయన ఈ గదిలో ఇలా తిరగటం క్రొత్తేమీ కాదు; కాని ఆ ముఖ కవళికలూ అవీ మాత్రం క్రొత్తే.

వరండావైపు గుమ్మానికి ఉన్న పరదా తప్పించుకుని మాధురీదేవి గంభీరంగా గదిలో ప్రవేశించింది. హరినారాయణబాబుకూడా సరిగ్గా ఆ సమయానికి గుమ్మం వైపే చూస్తూ ఉన్నాడు. చటుక్కున ఉభయుల కళ్ళు కలుసుకోగానే ఉభయుల మనోభావాలు ఒకరికొకరికి తెలిసిపోయాయి.

జమీందారు తన మనోభావాల్ని నిగ్రహించుకోటానికి ప్రయత్నిస్తూ "ఇంత ఆలస్యం చేశావేం? నీకు కబురు పంపి గంటపైగా అయింది" అన్నాడు.

"నాకు కబురు సరియైన సమయానికే చేరింది. కాని బుద్ధిపూర్వకంగానే ఆలస్యంగా వచ్చాను".

హరినారాయణ కనుబొమలు చిట్లించి రాణీ ముఖం కేసి చూశాడు. అతడికి తెలియకుండానే అతడి కంఠస్వరం కటువుగా మారింది. "అలాగా!" అన్నాడు.

రాణీ తన ఆలస్యానికి గల కారణాన్ని స్పష్టంగా చెప్పింది. "కోడలి గదిలో మూడు గంటలు వాదోప వాదాలు జరిగాక – ఏకాంతంగా ఒక గంటసేపు విశ్రాంతి తీసుకోవటం అవసరం".

ఆ మాట యజమాని చెవులకు సరసంగా వినపడ లేదు. ఏదో రుసరుసలాడుతూ అన్నట్లే విన్పించింది. ఆయన కూడా తీక్ష్ణంగా "అప్పుడే ఈ సంగతి ఎలా తెలిసింది?" అని అడిగాడు.

"మీరు ఏమనుకుని ఈ ప్రశ్న అడుగుతున్నారో – కాని అది పొరపాటు. గుమ్మందగ్గిర పహారా ఉంచి వెళ్ళిన సంగతి మీకు తెలుసు. మీ మాటను కాదని త్రోసిపుచ్చ టానికి ఈ ఇంట్లో ఎవ్వరికీ ధైర్యం చాలదు".

"అయితే మరి నీకా సంగతి ఎలా తెలిసిందో చెప్పు?" అని అడిగాడు గట్టిగా.

రాణీ కొంచెం వెటకారంగా "నేను ఈ ఇంటికి రాణీని. అన్ని సంగతులూ తెలుసుకుంటూ ఉండాలి నేను. మనుషు లెవరూ వచ్చి చెప్పకపోయినా, గాలి అయినా వచ్చి నాచెవిలో అన్ని సంగతులూ ఊదిపోతుంది" అన్నది.

జమీందారు ఉజ్జ్వల దృష్టితో రాణి ముఖంకేసి చూసి, "సరే, బాగుంది. ఈ మాటమాత్రం మరిపించకు. ఈ మాటమీద వచ్చే మాటలు చాలా ఉన్నాయి. ఇక్క

డింకా ఎన్ని గంటలు గడపాలో ఏం చెప్పగలను?" అన్నాడు.

ఇలా మాట్లాడుతూనే జమీందారు ఒక సోఫాను సమీపించి, "ఎంతసేపని అలా నుంచుంటావ్? కూచో" అన్నాడు.

"నేను కూర్చోటం యెందుకు లెండి. అవసరం లేదు. కూర్చున్నట్లే. మీరే కూర్చోవాలి. గంట సేపటినుంచి అటు తిరిగి ఇటు తిరిగి బాగా అలసిపోయినట్లు కన్పిస్తున్నారు".

హరినారాయణబాబు నెమ్మదిగా ఆ మెత్తని సోఫాలో చేరగిలపడి కూర్చుని, "ఈ గంట సేపటినుంచీ నేను విశ్రాంతి తీసుకోవటం లేదన్న సంగతి ఒప్పుకుంటావా? చెప్పు?" అన్నాడు.

రాణి ముఖం గంభీరంగా పెట్టి, "వీపుమీద కొరడా దెబ్బలు పడితే, స్థిరంగా ఎవరూ విశ్రాంతి పొందలేరు - శరీరం చిమచిమలాడుతూంటుంది. కనుక ఊరికే అటూ యిటూ తిరుగుతూ ఉంటారు అని ఒప్పుకోకుండా ఉండ లేను" అన్నది.

హరినారాయణబాబు ఒక నిట్టూర్పు విడిచి, "ఆ మాట అనటంలో అర్థం?" అని ప్రశ్నించాడు.

"అందులో అర్థమేమిటో మీకు వ్యక్తమయినట్లు - మీరు నిట్టూర్పు విడిచి ప్రశ్నించటంలోనే తెలుస్తోంది. మరింత స్పష్టంగా తెలుసుకోవటంవల్ల మరింత వళ్లు మండటం తప్ప ఏం లేదు".

జమీందారు రాణీకేసి సందిగ్ధంగా చూస్తూ "కోడలి గదికి నేను వెళ్లిన సంగతి తెలిసి ఉండవచ్చు. అక్కడ చాలాసేపు ఉన్నానన్న సంగతికూడా అందరికీ తెలిసే ఉండొచ్చు. కాని మా యిద్దరి మధ్య ఏం సంభాషణ జరిగిందీ మాత్రం ఘుణాక్షర న్యాయంగానైనా ఒక్క అక్షరం కూడా ఎవరూ విని ఉంటారని తోచదు నాకు. మరి కోడలి మాటలవల్ల నా ఒళ్లు మండిపోయి ఇక్కడికి పరుగెత్తుకొచ్చానని ఎలా అనుకో గలిగావు?" అని అడిగాడు.

భర్త చివరి మాటల్లో కొంచెం తీవ్రత వ్యక్తమవటం గమనించి, రాణి ఒక్క క్షణం అతడి ముఖంకేసి తీక్ష్ణంగా చూసి, "కోడలితో మాట్లాడటానికి వెళ్లేటప్పుడు మాత్రం అష్టదిగ్బంధనం చేసుకునే వెళ్లారు. కాని తిరిగివచ్చేటప్పుడు మాత్రం ముఖాన్ని, కళ్లనీ, కంఠస్వరాన్నీ కప్పిపెట్టుకు రాలేకపోయారు. వాటినిబట్టే మీరు రక్కడినుంచి ఏదో కోపంతో తిరిగివచ్చినట్లు స్పష్టంగా తెలిసిపోయింది" అనేసింది.

ఆ మాటలు హరినారాయణబాబును బాగా అఘాత పరిచాయి. అతడు మళ్లీ ఆమెను అఘాతపరచటానికి వెను తీయలేదు. "కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగానే కన్పిస్తుందిట. ఎవరి శరీరానికి వెష్ట కలిగిందీ తెలుస్తూనే ఉంది. కాని ఇదంతా అనవసరం. దానివల్ల లాభం ఏమీ లేదు".

రాణి వ్యంగ్యంగా నవ్వుతూ "కాని నిష్ఫలమైన గర్జనలు మాత్రం మానలేదు" అన్నది.

జమీందారు ముఖం చటుక్కున గంభీరంగా మారింది. రాణి సమాన ధాయాలో సమాధానం చెప్పటంలో ఏమాత్రం వెనుతీయదని అతడు మనస్సులో గ్రహించాడు. అంచేత రాజీకి దిగే ధోరణిలోకి వచ్చి - మెత్తని కంఠ స్వరంతో "అనుమానం మీద ఆధారపడి ఏ విషయంలోనూ ఒక నిర్ణయానికి రాకూడదు. అలా రావటంవల్ల మోస పోయేందుకు కవకాశా లున్నాయి" అన్నాడు.

రాణి ఆ మాటను సమర్థించకుండా ప్రతివాదం లేవ తీస్తున్న ధోరణిలో "కాని ఇంతవరకు వచ్చిన నిర్ణయాలన్నీ అనుమానాన్ని ఆధారంగా చేసుకు వచ్చినవే" అన్నది.

జమీందారు ఆశ్చర్యంతో "అలాగా? దానికి దృష్టాంతాలుకూడా ఉన్నాయన్నమాట ?" అన్నాడు.

"చాలా ఉన్నాయి. మొదటి దృష్టాంతం నేను".

"నువ్వా ?"

"ఆc. కేవలం వంశం నిలిస్తే చాలుననే ఉద్దేశ్యంతో మీరు రాచకన్యను తీసుకురాలేదన్న సంగతి మీకూ తెలుసు, నాకూ తెలుసు. దీనికి వెనుక ఓ పెద్ద అంచనా మాత్రం ఉంది".

'అలాగా ?"

"ఒక్క రాతితో రెండు పిట్టల్ని కొట్టవచ్చుననే అంచనా వేసుకుని మీరు ఉప్పొంగిపోయారు".

"ఏమిటి ?"

"ఇంకా విశదంగా చెప్తాను. మేవాడ్ రాణా రాజ సింహునిలాగా కీర్తిని ఆర్జించాలని మీ ఆశ: మా నాన్న ప్రభుత్వానికి చాలా సన్నిహితుడని విని, అలాంటి సన్నిహితత్వానికేం విలువ లేదని చెప్పారు ఆయనతో".

కుతూహలంకొద్దీ హరినారాయణబాబు రాణి మొహం కేసి చూస్తూ ఊరుకున్నాడు. తర్వాత కొంచెం నవ్వుతూ - "ఇన్నాళ్ళకు నువ్వింత గొప్ప తాత్వికాంశాన్ని కనిపెట్టావన్నమాట: కాని ఇంతకుముం దెప్పుడూ - నువ్వీ విషయమై నాతో అనలేదు" అన్నాడు.

"చెప్పవలసిన అవసర మనేది ఇదివరకెప్పుడూ రాలేదు. ఏదో మాటమీద మాట రావటంవల్ల - కేవలం అనుమానం మీద ఆధారపడే మీరు గురుతర కార్యాన్ని పైన వేసుకున్నారని, చెప్పక తప్పలేదు నాకు. ఒక దృష్టాంతరాన్ని చూపాను మీకు. ఇంక చాలా ఉన్నాయి దృష్టాంతాలు".

"ఆగు. ఇంక వినవలసిన పనిలేదు. వృధా ప్రసంగంతో మనం అసలు విషయాన్ని విడిచి చాలాదూరం వచ్చాము. నిన్ను అసలు ఎందుకోసం పిలిపించానో ఆ విషయమై ఇంతవరకు యేమీ మాట్లాడనేలేదు. సరేగాని నువ్వు కూర్చోవా?"

"ఉహూం. కూర్చుంటే మీతో సంభాషణ తెగటమంటూ ఉండదు. మీరు ఆ మహల్‌లో దెబ్బతిని, ఆ అక్కసంతా నామీద తీర్చుకోటానికి వచ్చారని నేను ముందే గ్రహించాను".

"తప్పించి మళ్ళించి మళ్ళీ ఆమాటే అంటున్నావు!"

"ఇది తప్ప కొత్తగా నేను చెప్పవలసిన సంగతంటూ నిజానికేదైనా ఉందా ?—ఏమో ! నాకేం ఉన్నట్లు తోచటంలేదు".

"అసలు నీ మనస్సులో ఉద్దేశ మేమిటో చెప్పవిందాం".

"ఈ ఇంటికి వచ్చినప్పట్నుంచీ పనివిషయమై ఎవరికీ యెన్నడూ సంజాయిషీ చెప్పకోవాల్సిన అవసరంరాలేదు నాకు. సంజాయిషీ చెప్పకోటానికి రావలసిందనే పిలుపూ రాలేదు. ఆ సంజాయిషీ ఇన్నాళ్ళకు ఇవాళ ఇచ్చుకోవాల్సి వచ్చిం దనుకుంటా. నా ఊహ నిరాధార మంటరా ?"

"ఆశ్చర్యంగానే ఉంది ! ఎవరిని మెచ్చుకోవాలో బోధపడకుండా ఉంది నాకు. కోడలు కూడా నేను ఆ సమయంలో తన మహల్‌కి రావటం చూసి తన విచారణకై వచ్చాననుకుంది. నా పిలుపు రాగానే నువ్వూ సంజాయిషీ కోరటానికే పిలిపించానని అనుకున్నావు" అన్నాడు ఆవేశంతో...

రాణీ భర్త భావావేగాన్ని లక్ష్యపెట్టకుండానే — "నేను సిద్ధంగా తయారయే వచ్చాను. మీరు అడగతలచిన సంగతు లేవేవి ఉన్నాయో, వాటిని అడగటం ప్రారంభించవచ్చు. నేను ఏమాత్రం నిర్లక్ష్యం చూపను" అన్నది.

జమీందారు కూడా కృత్రిమమైన సానుభూతిని వెల్లడిస్తూ "నువ్వింత గట్టిగా చెపుతున్నావు కనుక - నే నయినా నీ విషయంలో ఉపేక్షాభావాన్ని కనపరచటం ఉచితం కాదు.

సరే మంచిదే. నువ్వు ముందుగానే నొక్కి-నొక్కి చెప్పావే - ఈ మహల్‌కి నువ్వు రాణివి కనుక అన్ని విషయాలూ తెలుసుకోవాల్సి ఉంటుందని, గాలే వచ్చి కబుర్లన్నీ నీ చెవిలో ఊదిపోతుందనీ - ఈ మాటలు నువ్వు సరిగ్గా చెప్పినట్లేగా ?" అని అడిగాడు.

రాణీ ఓరచూపుతో ఒక్క-సారి భర్త ముఖంకేసి చూసింది. మరుక్షణంలోనే దృష్టి మరలించుకుని, "ఈమాట లన్నీ తీసుకు రావలసిన అవసరం లేదు. నానోటిమీదుగా వచ్చిన మాటలను ఒప్పుకోకుండా ఉండటమనే అలవాటు నాకు లేదు" అన్నది.

"ఆ సంగతి నాకూ తెలుసు. ఇందుకు నేను నిన్నెన్ని సార్లు మెచ్చుకున్నానో అది నీకూ తెలుసు అయినా ఈ సందంర్భంలో ఈ మాటలన్నీ మళ్లీ తీసుకు రావటం - చాల వరకు సంప్రదాయం లాంటిది - కోర్టులో ఎంత సత్యవాదిచేత నయినా న్యాయాధికారి ముందుగా శపథం చేయిస్తాడే - అలాంటి దన్నమాట ! ఆఁ. ఇహ అసలు సంగతికి వద్దాం. నిజంగా, కొన్ని సంగతులు అడిగి తెలుసుకోందే నాకు ఊపిరి సలపని పరిస్థితులు వచ్చి పడ్డాయి ఎటుచూచినా ..."

ఆమాట పూర్తికాగానే జమీందారు రాణి ముఖం కేసి తీక్ష్ణంగా చూశాడు. కాని రాణి దగ్గరనుంచి జవాబు మాత్రం ఏమీ రాలేదు.

"నేను రాజసింహునిలాగా కీర్తికాముకుడనై నిన్ను వివాహమాడానని ఇంతకుముందే అన్నావు. మరొక అప వాదుకూడా వేశావు. సరే ఆ సంగతి అలా ఉంచు.

మొదటి విషయాన్ని గురించి చెపుతాను. నేను చేసినపని అన్యాయం కాదని పరిస్థితులు క్షుణ్ణంగా తెలిసిన వారెవ రైనా అంటారు. పైగా ఇది చెయ్యటానికి అంగీకరించిన త్యాగంకూడా తక్కువదికాదు. కాని ప్రస్తుతం విచారణీయాంశం మాత్రం ఇదే. నేను నిన్ను అలక్ష్యం చేశానా అని

"నేను ఈ ఆరోపణ ఎన్నడూ చెయ్యలేదు. పైగా వివాహమయిన తర్వాత మీరు నా విషయంలో చూపిన ఆదరణ సామాన్యమైంది కాదని ముక్తకంఠంతో చెప్పగలను నేను. మీ కుటుంబానికి సర్వాధికారిణిని చేశారు నన్ను. ఆ అధికారాన్ని పొందగలిగాను నేను. ఆ కారణంవల్లనే ఈ సంసారంలో అందరిమీదా ఇంతవరకు అధికారం చలాయిస్తూ వచ్చాను. దాన్ని గురించి మీరొక్కనాడైనా ప్రతివాదం లేవనెత్తలేదు - ఎలాంటి అభ్యంతరాన్ని కలిగించలేదు".

రాణిమాటల ద్వారానే తాను చెప్పతలచుకున్న విషయానికి 'లింక్' దొరకేసరికి హరినారాయణబాబు ముఖం ఒక్కక్షణం ఆనందంతో కలకలలాడింది. ఆయన ఉత్సాహంతో "భేష్! సంతోషంతోనే నువ్వు పొందిన అధికార ప్రసక్తి తీసుకువచ్చావు. సరేకాని, ఆ అధికారాన్ని అందరిమీదా సమానంగానే చూపుతూ వచ్చావా? - ఆ మాట గట్టిగా చెప్పగలవా?" అని అడిగాడు.

అప్రత్యాశితంగా భర్తవేసిన ఈ కఠిన ప్రశ్న రాణిని ఒక్కక్షణం స్తబ్ధురాలినిగా చేసింది. కాని మరుక్షణంలోనే

ఆమె ఈ అఘాతాన్ని లక్ష్యపెట్టకుండా దృఢకంఠంతో -
"ఈ మాటకు సమాధానం చెప్పటానికి ముందు నే నొక సంగతి తెలుసుకోవాలి. మీరా అధికారాన్ని నాకు యిచ్చేటప్పుడు - దాన్ని ఫలానా విధంగా ఉపయోగించాలి అని నా కేమయినా నిర్దేశించి చెప్పారా ?" అని అడిగింది.

"అలా ఎవరూ నిర్దేశిస్తూ ఇవ్వరు అధికారాన్ని".

"ఇస్తారు. నే విన్నదేమిటంటే ఆంగ్లేయులు తమ అధికారులను ఈ దేశానికి పంపేటప్పుడు - వారు వినియోగించవలసిన అధికారాన్ని గురించి హెచ్చరించి పంపటంలో ఏమాత్రం ఏమరుపాటు చూపరట: అలాగే మీ జమీందారీలో ఏ ఆఫీసులోనైనా కొత్త అధికారిని నియమించేటప్పుడు అతడి అధికారపరిమితి ఎంతవరకో ఏమీ నిర్దేశించి చెప్పకపోతే పరిపాలన సాగేదెలా ?"

"ఒప్పుకుంటాను. నీ కలాంటి నిర్దేశాలేవీ చెయ్యలేను. నువ్వు సహధర్మిణివి, గృహిణివి కనుక నీ అధికారపరిమితిని నిర్దేశించి చెప్పటం నిష్ప్రయోజన మనుకున్నాను. అందులో నీ కర్తవ్యం ఎంతయినా ఉంది."

"కచ్చితంగా ఉంది. నేను మొదటినుంచీ కర్తవ్యాన్ని ఉపేక్ష చేసినట్లయితే పెద్దగొడవ మొదట్లోనే బయలుదేరేది. ఇన్ని సంవత్సరాలు నిరుద్వేగంగా గడిపిన పిమ్మట హఠాత్తుగా ఇప్పుడు సంజాయిషీ చెప్పటంకోసమని పిలుపురాదు."

"అయితే నీ అధికారాన్ని సంసారంలో అందరిమీదా సమానంగా వినియోగించటానికి వెనుదీయలేదని చెప్పటానికెందుకు సంకోచిస్తావ్ ?..."

"అనవసరంగా అబద్ధం చెప్పటంవల్ల లాభమేమీ లేదు. అన్ని సందర్భాల్లో అలా తూచినట్లు వినియోగించటం జరగదు. బ్రహ్మ సృష్టిలోనే అంతులేనన్ని తారతమ్యా లున్నాయి. మానవులందరూ ఒక్కరకంగా ఉండరు. ముఖాల్లో ఎంతో తారతమ్యం కన్పిస్తుంది. చేతి అయిదు వేళ్ళే సమానంగా ఉండవు. అటువంటప్పుడు అందరిమీదా నా అధికారాన్ని హెచ్చుతగ్గులు లేకుండా సమానంగానే చూపానని యెలా చెప్పగలను?"

"అయితే నీ అధికారాన్ని నువ్వు దుర్వినియోగం చేశావని, మాటకారితనం చేతనయినవాళ్లు నిన్ను మభ్యపెట్టి వాళ్ళ ప్రయోజనాలను వాళ్లు సాధించుకుంటున్నారని, నోరులేని అమాయకులు నిన్ను ప్రసన్నురాలినిగా చేసుకోటం చేతకాక నానా యాతనలూ పడుతూ మోసపోతున్నారనీ ఒకవేళ అంటే—?"

చాలా పెద్ద అభియోగం. రాణి ఈసారి కెవ్వన కేకేసి విదీర్ణహృదయయై పడిపోతుందనుకున్నాడు జమీందారు. కాని ఆమెధైర్యం యేమాత్రం సడలలేదు. ఆమె కంఠస్వరంలో తీవ్రతా వ్యక్తం కాలేదు. భర్త బయటపెట్టుకున్న అభిప్రాయానికి మామూలు ధోరణిలోనే జవాబిచ్చిందామె. "ప్రపంచంలో అనాదినుంచీ ఇలా జరుగుతూనే వస్తోంది—నోరుకలవాళ్లు విజయం పొందటం, నోరులేని వాళ్లు మోసపోవటం... చరిత్రలో దీనికి చాలా దృష్టాంతాలున్నాయి."

యజమాని విస్మయసూచకమైన కంఠస్వరంతో "నువ్వు ఏవేవో పెద్దపెద్ద సంగతులు తీసుకొచ్చి నన్ను తికమక పెట్టాలని చూస్తున్నావల్లే ఉందే!" అన్నాడు.

రాణి మృదువుగా నవ్వి—"బరువైన పదార్థం వచ్చి దభీమని నీళ్ళలో పడితే నీళ్లు కెలుకుడు కాకమానవు. వాస్తవాన్ని కించపరిచి నేను మీ మనస్సును కలతపెట్ట తలచుకోలేదు. మనస్సులోని విషయాన్ని ధైర్యంచేసి విడమర్చి చెప్పాను" అన్నది.

యజమాని కనుబొమలు చిట్లించి, "అయితే ఈ ఇంట్లో నీకు అనుకూలంగా ఉండని వారి నందర్నీ ఒకమూల నొక్కిపెడుతున్నావన్నమాట!" అని అడిగాడు.

"నాపరిస్థితుల్లో ఉన్న ఏ స్త్రీ యైనాసరే - ఆమాత్రమైనా చెయ్యకపోతే నెగ్గుకు రాలేదు. నేను ఈ ఇంట్లో అడుగు పెట్టిననాడే గ్రహించాను. ఇంట్లో అందరూ అస్తమానమూ చనిపోయిన రాణీగార్ని గురించే చెప్పుకుంటూ ఉండేవాళ్లు. ఆమెతో పోల్చిచూస్తే నేనంత తక్కువదాన్నో సప్రమాణంగా రుజువు చెయ్యటానికి ప్రయత్నించేవాళ్లు. అంచేత స్వర్గస్తురాలైన నా సవతి స్మృతిని తుడిచిపెట్టటం, ఆమెకంటే నేను అన్నివిధాల గొప్పదాన్ననని నిరూపించుకోవటం ప్రథమ కర్తవ్యమయింది నాకు. నేను ఈ ఇంటికి యజమానురాలిని అయిఉండి, నా చేతిలో ఇంత అధికారంఉన్నప్పుడు - నన్ను నేను నిలవద్రొక్కుకునే సదవకాశాన్ని ఎందుకు వ్యర్థపరచుకుంటాను." అని రాణి కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పింది,

జమీందారు తనకు తెలియకుండానే చటుక్కున త్రుళ్ళిపడ్డాడు. వివాహమయి ఇన్నాళ్ళయింది, కాని సహ ధర్మిణితో ఇలా ఎప్పుడూ సంభాషణ జరగలేదు. రాణితన మనస్సులోని ఉద్దేశాల్ని ఇంత స్పష్టంగా యెప్పుడూ చెప్ప లేదు. అతడు కొంచెంసేపు రాణికేసి కన్నార్చకుండా చూసి, తర్వాత దీర్ఘంగా నిట్టూర్చి,

"ఊఁ. సరే ఈసారి నేను ఓ కఠినమైన ప్రశ్న నే వెయ్య తలచుకున్నాను. నువ్వు గోవిందుడి విషయంలో ఈ అధికారాన్ని చలాయిస్తూనే వచ్చావా? సవతి - స్మృతిని చెరిపెయ్యటానికి ప్రయత్నించటంలో నువ్వేమీ సంకోచించ నప్పుడు - మరి ఆ సవతి బిడ్డను—"

అంతవరకు అనేసరికి భావావేగంతో అతడి కంఠం రుద్ధమైంది. కళ్ళురెండూ పెద్దవి చేసుకుని రాణి ముఖంకేసి స్థిరంగాచూస్తూ ఊరుకున్నాడు. చెమ్మగిలిన నేత్రాలే అతడి అసమాప్తవాక్యాన్ని వ్యక్తం చేస్తున్నట్లున్నాయి.

రాణీ అవిచలిత కంఠంతో "గోవిందుడి విషయం అడుగుతున్నారా? ఈ ప్రశ్న వెయ్యటంలో ఏమిటి మీ ఉద్దేశ్యం? అతడ్ని ఆదరణగా చూస్తూ పెంచి పెద్దవాణ్ణి చెయ్యటం సంగతేనా మరింకాఏదయినానా?" అని అడి గింది.

హరినారాయణబాబు అభిభూతుడిలాగా—"నేను అడగ తలచిన మాట ఏదో మరిచిపోయాను. కాని అదేదో నేను చెప్పకపోయినా నీకు తెలిసింది. వాడి విషయంలో, నీకు తెలిసింది, నువ్వు చెప్పతలచిందీ-అంతాచెప్పు" అన్నాడు.

"ఎంత విశ్వాసంతో సంసారభారాన్ని మీరు నాకు అప్పగించారో, అంత విశ్వాసంతో అతడి భారాన్ని మీరు నాకప్పగించలేదు. పైగా ఆ విషయంలో నన్ను తప్పించి ఆ భారాన్ని చనిపోయిన రాణీగారి పరిచారికలమీదనే పెట్టారు."

"అవును. ఆమాట కాదనటంలేదు నేను. సవతిబిడ్డ పోరుతో నువ్వెక్కడ బేజారైపోతావో అని నిన్ను ఆ బెడదలో యిరికించలేదు."

"కేవలం అదేనా? సవతితల్లి చేతిలోపడితే బిడ్డకేం అయిష్టం వాటిల్లుతుందో ననే భయంతోనే నన్ను ఉపేక్షించారనుకుంటాను నేను. అదీ భగవంతుని ఆశీస్సుగానే భావించాను నేను. ఎంచేతంటే - అతడి భారం నాకే అప్పగించి నట్లయితే - నేను ప్రసన్న హృదయంతో అతణ్ణి చూసినట్లైతే అతగాడీ నాడిలా జడభరతుడిలా తయారయే వాడు కాదు."

"కాని ఏమయినా వాణ్ణినువ్వు కొంచెం దయగా చూడటం ఉచితంకాదూ?"

"కాదు. మొదట్లో నేను అభిమానపడి అతడికేసి చూడలేదు. తర్వాత నివారణుడు పుట్టాక కేవలం ఇహవాణ్ణి చూడటమే సరిపోయింది నాకు. గోవిందుడు పెద్దవాడయాక, అతడికి తెలివితేటలు శూన్యమని, చదువు సంధ్యలు అబ్బలేదని అందరూ చెప్పుకునేవాళ్లు. పైగా వాళ్ళే నివారణుణ్ని మెచ్చుకోవటం చూసినప్పుడు నా అంత సంతోషించిన వాళ్లెవరూ ఉండరు బహుశా."

"నువ్వు అదివిని సంతోషించావా?" అని గర్జించాడు హరినారాయణబాబు.

రాణి మృదువుగా ఇలా అన్నది — నేను చాలా ఇదవుతున్నాను. ఈ మాటను ఇలా కాకుండా కల్పించి అబద్ధం చెప్పినట్లయితే మీరు బహుశా సంతోషించే వారనుకుంటాను. కాని నేను నిష్కపటంగా యథార్థాన్నే చెప్పాను. ఎందుకు సంతోషించను? నేనూ మనిషినే. బాగా చదువుకుని విజ్ఞానవతిని అయినానని కాదు. నాదీ రక్త మాంసాలున్న శరీరమే. స్వార్థం అనేది నాకూ ఉంటుంది. సవతిబిడ్డ అప్రయోజకుడవటంవల్ల-నాబిడ్డ అదృష్టం పండబోతూంటే, బాబులీ గద్దెమీద కూచునే యోగ్యత ప్రాప్తిస్తుంటే – తల్లికి అంతకన్న ఆనందకరమైన విషయం ఏముంటుంది? కాని ఈ విషయంమాత్రం ఒప్పుకుంటాను. కథల్లోనూ, నవలల్లోనూ ఉండే సవతితల్లుల్లాగా నేను ఈ కంటకాన్ని మొదట్లోనే నిర్మూలం చెయ్యటానికి మాత్రం యేమీ ప్రయత్నించలేదు. అతడు మొద్దులా పడిఉంటేచాలు, అదే నాకు కావలసింది. దీన్ని మీరు స్వార్థపరత్వం అనండి. మరేమయినా అనండి. దీన్నిగురించి మీరు నామీద ఎలాంటి అపవాదు నయినా వెయ్యండి – మీ రెన్నయినా అనండి – సంతానం విషయంలో తల్లిగా నేను నా కర్తవ్యాన్ని నిర్వర్తించానని కచ్చితంగా చెప్పగలను.

"నువ్వు ఇలా అన్యాయంగా ఎవరినయితే వంచించావో వాడుమాత్రం నీ సంతానం కాదూ?"

"కాదు. ఏదో పుస్తకాల్లో రాసినట్లు – ప్రపంచమంతా నా బిడ్డలే అని అనుకోవటం ఎలాంటిదో ఇదీ అంతే. పైకి అలాంటిసూక్తులు వినటానికి బాగానే ఉంటాయి. కాని స్వార్థదృష్టితో చూచినప్పుడు బాధకరంగా కన్పిస్తాయి. సంతానంమీది మమత్వంతో ఇవాళ మీరు దీన్నొక సమస్యగా చూస్తున్నారు. కాని నేను అతడికి సవితితల్లి నన్నమాట ఒప్పుకోవాలి ముందు. అసలీ అడ్డుగోడ కట్టిందెవరు? మీరూ నిర్వికారంగా, ఈ ప్రయత్నం తలపెట్టకుండానే ఉన్నారుగా అప్పుడు. తర్వాత నివారణుడికి మీ అంతట మీరే ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. మీ గద్దెమీద కూర్చోబోయేవాడు–వాడేనని మీరు ఎన్నోసార్లు–చెప్పారు – కాని–"

"ఆగావు యెందుకు? చెప్పు. నువ్వు చెప్పదలచిందింకా పూర్తికాలేదు.—"

"మీ ఆ ఉద్దేశ్యం ఇప్పుడు మారిపోయింది. మీరు ఆయుర్వేద వైద్యుడి కూతుర్ని చూసి, ఆమెని ఈ యింటికి కోడల్నిగా తీసుకురావాలని మహా ఆరాటపడ్డారు. ఆ పేద పిల్లను కోడల్నిగా తెచ్చుకోటానికి నేను అంగీకరించలేదు. అప్పుడు మీ యీరోషమంతా అణిగిపడి ఉంది. ఇప్పుడు ఇంతకాలానికి గోవిందుడి కోసమని మీ హృదయం తహతహ లాడుతోంది... ఇహ నిప్పుడు నివారణుడే మీ రనుకున్నట్లు వెనుకపడతాడు. మీ కోడలే ఈ గాడిదను – మిమ్మల్నికూడా ఉద్ధరిస్తుందని కలలు కంటున్నారు. మీరు కలకాలం ఆ కలల్లోనే ఉండండి. ఇహ నేను ఇచ్చిన సంజాయిషీలో—నాదోషం ఏదైనా ఉన్నట్లయితే – శిక్షించ

టానికి నిరభ్యంతరంగా మీరు పూనుకోవచ్చు. నేను ఆ శిక్ష అనుభవించటానికి సిద్ధపడేఉన్నాను !''

రాణి ఉత్తేజితురాలు కావటం చూసి హరినారాయణ బాబు ఎకసక్కెంగా—"ఓహో చివరికి నువ్వీ మామూలు దారికే వచ్చిపడ్డావన్నమాట! శిక్ష సంగతి ఏమీ రానే లేదిప్పుడు. కోడలి ప్రసక్తి నేనేమీ తీసుకురాలేదు. నువ్వు హఠాత్తుగా ఆ పెద్దమనిషి కూతుర్ని విషయంలో లాక్కొని వచ్చి వ్యవహారాన్ని విషమింప చెయ్యాలనుకుంటున్నావా ? అయితే ఇప్పుడు కోడలే నీ ప్రతిద్వంద్వి అన్న సంగతి బాహాటంగా తెలిసిపోయింది'' అన్నాడు.

రాణి వ్యంగ్యంగా "ఇది నా దౌర్భాగ్యం మరి! అంతకన్న ఇంకేముంది?'' అన్నది.

"కాని ఈ వ్యవహారాన్నంతా మార్చి శుభంగా పరిణమింప చెయ్యటానికి వీల్లేదా ?''

"అదెలాగో చెప్పండి''

"కోడల్ని మాతృ వాత్సల్యంతో దగ్గరకు తీసుకోవటానికి ప్రయత్నిస్తే!''

రాణి ఉద్దీప్త కంఠంతో "అలా వీల్లేదు. ఏమాత్రం వీల్లేదు. దయఉంచి ఆ మాట మాత్రం మరోసారి అనవద్దు. అంతకంటే మీ జడభరతుణ్ణే నెత్తినెక్కించుకుని మీ గద్దె మీద కూర్చోపెట్టుకున్నా నాకేం అభ్యంతరం లేదు. అందుకు నేను అడ్డుగా ఒక్కమాటకూడా మాట్లాడను'' అన్నది.

జమీందారు గంభీరంగా "కాని నివారణుడ్ని ఆ విధంగా వంచించగలవా ?" అని అడిగాడు.

రాణీ దృఢకంఠంతో - "నేను వాణ్ణి బలవంతాన లాక్కురాగలను. కట్టిపడేసి అయినా—"

"తర్వాత ? ఆ అమ్మాయి అధికారాన్ని పూర్తిగా అంగీకరించి ఊరుకోగలవా ?"

"ఆ ఆలోచన తర్వాత. మీ రింకా అడగవలసిందే మయినా ఉందా ?"

హరినారాయణబాబు కంఠాన్ని సవరించుకుని "నువ్వు ఇప్పుడు చెప్పిన ప్రతి మాటామీదా ప్రతివాదం చెయ్యటానికి వీలుంది. ఇంతవర కెన్నడూ గంగూలీ వంశీయుడైన వాడు ఇతర వంశంలోని స్త్రీమీద ఆధారపడి, ఘోషలీ రాజ్య సింహాసనంమీద కూర్చోలేదన్న సంగతి నీకు కచ్చితంగా తెలిసిఉంటుంది. జ్యేష్ఠుడనే అధికారంతో కూర్చోవాల్సివస్తే దానిమీద గోవిందుడే కూర్చోవాలి. కాని ముందు వాడు ఆ యోగ్యతను ఆర్జించుకోలేకపోతే - అది కేవలం దురాశతప్ప ఇంకేమీ కాదు" అన్నాడు.

రాణీ స్తబ్ధులా ఈ మాటలు విన్నది. కొంచెంసేపు ఎవరూ ఏం మాట్లాడలేదు. జమీందారు ఒకసారి రాణీకేసి ఓరగా చూశాడు. తర్వాత మళ్ళీ—

"నువ్వు ఈ భారాన్ని వహించలేవా? ఏ కారణంచేత నయితేనేం - వాడి విషయంలో చిన్నప్పట్నుంచీ కొంత ఉపేక్ష జరిగింది. దాన్ని ఇప్పుడు చక్కదిద్దటానికి వీల్లేదా?" అని అడిగాడు.

రాణీ ఒక్క-క్షణం మనస్సులో ఏమాలోచించుకుందో - తర్వాత స్నిగ్ధకంఠంతో - "ఇది సాధ్యమయితే - మీకోరికను నేను శిరసావహించేదాన్నే. కాని ఇప్పుడిహ అది అసాధ్యమైనపని. పాషాణాన్ని ప్రయత్నంమీద కదలించగలమే కాని, దానికి ప్రాణాన్ని తీసుకురాలేం" అన్నది.

"సరే, అయితే. ఇది సంభవమో కాదో తెలుసుకుందామని పిలిపించాను నిన్ను. దీనిమీద అనవసరమైన విషయాలన్నీ వచ్చి వృధాచర్చ జరిగింది. కాని నేనీ నిజతత్వాన్ని గ్రహించలేక - నా ఖయాలీలో నేనుండి, ఆ అమ్మాయినే శరణ్యంగా భావించి, ఎన్నో ఆశలు పెట్టుకుని ఆమె చేతికి బంగారపుకొరడా అందించాను.

"ఆ సంగతి విన్నాను నేను"

జమీందారు ఆ వేగంతో - "కాని ఇవాళ ఆ కొరడా ఇచ్చివేస్తూ ఆ రాతి బొమ్మలో చైతన్యం తీసుకురావటానికి, ముందు ఆ బొమ్మ మనస్సును గుర్తించి ఉద్బుద్ధం చేస్తే చాలు, బంగారపు కొరడాతో ప్రమేయం లేదన్నది. దీనికి నా సమాధానం ఏమిటో తెలుసా" అన్నాడు.

రాణి జిజ్ఞాసా దృష్టితో భర్త ముఖంకేసి చూడగానే హరినారాయణబాబు ఉత్తేజిత కంఠంతో - "ఆమెమీద ఇప్పటివరకు వచ్చిన ఫిర్యాదుల నన్నిటినీ ఆమె ముఖంచూసి వాయిదా వేసుకుంటూవచ్చాను. ఆమె ఈ పాషాణానికి చైతన్యం తీసుకు రాగలిగిందంటే - ఆమె ఎన్ని ఖూనీలు చేసినా క్షమిస్తాను. అప్పుడు ఆమె స్థానం అందరికన్నపైది... కాని ఈ ప్రయత్నంలో ఓడిపోయిందంటే మాత్రం - ఇది

అధారంగా తీసుకుని ఆమెని మళ్ళీ శ్యామాపురానికి పంపించి వేస్తాను..." అన్నాడు.

ఈ మాటలు అంటున్నప్పుడు ఆయన పెదవులమీద నవ్వు కన్పించింది. విద్యుత్తులాగా తీక్ష్ణమైన నవ్వు అది. రాణి కన్నార్పకుండా భర్త చిత్ర ముఖంకేసి చూస్తూ ఊరు కుంది...

# 20

బ్రాశులీ గ్రామం - అందంగా భాగ్యవంతగా ఉండే ఇతర నగరాలలాగానే అన్ని విషయాల్లోనూ సొష్టంగానే ఉన్నా - ఏదైనా ఒక నదిఒడ్డున ఉండే అదృష్టం మాత్రం ఆ ఊరికి పట్టలేదు. అయితే ఆ గ్రామస్తులకు ఒక తృప్తిమాత్రం ఉంది. ఆ ఊరికి ఏడెనిమిది ఊళ్ళ కవతలగా సరస్వతీ నది ఉంది. ఆ నది ప్రకృతీ, ప్రభావంకూడా ఈ ప్రాంతపు జమీం దారుగారి ప్రభావంలాగా తీవ్రమైనది. పైగా ప్రక్కనే నది లేదన్న కొరత తీర్చటానికి బాశులీ జమీందారులు ఎంతో డబ్బు ఖర్చుపెట్టి - ఈ నదికి ఒక కాలువను త్రవ్వించి దాన్ని బాశులీ మీదుగా వారి యెస్టేట్ సరిహద్దులోఉన్న మరొక నదిలో కలిపారు. దానికితోడు ఆ నదీ ముఖ ద్వారం చెంత చాలా పెద్ద భవనం ఒకటి కట్టించి, దానిచుట్టూ తోట వేయించి, దానికి 'బాశులీ - ఉద్యానభవనం' అని పేరు పెట్టారు.

బాశులీ ఇంచుమించు పదిహేనుమైళ్ళ దూరంలో సరస్వతీనది ఒడ్డునే ఉంది ఈ ఉద్యానభవనం. వర్షా కాలంలో, నది వరదలకు ఒడ్డు కోసుకుపోకుండా ఈ భవనం

పొడుగునా కోటగోడలాంటి గోడను నిర్మించారు. ఈఉద్యాన భవనానికి ఇదొక విశిష్టత. రకరకాల అపురూప వృక్ష లతాదులతో, విశాలమైన పెద్ద భవనంలోని వైభవోపేత మైన అలంకరణలతో ఆ ఉద్యానవనం ఎంత శోభాయ మానంగా ఉంటుందో ఊహించుకోవాల్సిందే!

కాని సంవత్సరంలో చాలా రోజులు, ఈ భవనం, చక్కగా అలంకరించబడిఉండే అందులోని గదులూ ఊరికేనే పడిఉంటాయి. ఒక్కొక్క సంవత్సరం గ్రీష్మ కాలంలో మాత్రం జమీందారు సపరివారంగా వచ్చి ఈ భవనంలో కొన్నివారాలపాటు ఉంటూ ఉంటారు. ఆ సమయంలో ఈ ప్రాంతం మరీ కళకళలాడుతూ ఉంటుంది. ఇక్కడ ఉండే అనుచరులూ మొదలైనవాళ్ళూ - వాళ్ళ జమీందారు మరి కొన్నాళ్లుంటే బావుండునే అని కోరుకుంటూ ఉంటారు. కాని ప్రతియేటా రావటానికి వారికి అవకాశం ఉండదు. అలాగే ఈ యేడూ రానేలేదు.

కాని కొన్ని సంవత్సరాలనుంచి ఇంచుమించు ప్రతి ఋతువుకీ చిన్న జమీందారుగారు వచ్చి స్థిరంగా ఉండక పోయినా తన అనుచరులతో ఒకటి రెండు రోజులుండి గడిపి పోతూ ఉండటం పరిపాటయింది. నిజమే కాని అందువల ఈ ప్రాంతీయులు ఏమీ ఉత్సాహ పడరు. ఎంచేతంటే పెద్ద జమీందారు ఎంత గంభీర ప్రకృతి కలవాడైనా, బొబ్బిలీ దివాణానికి వెళ్ళినప్పుడు వారి దర్శనం ఎంత దుర్లభమయినా, ఇక్కడకు వచ్చినప్పుడు మాత్రం దీనికి పూర్తిగా వ్యతిక్రమం కన్పిస్తూ ఉండేది. ఇక్కడ వారి ఆఫీసులోకి సాహసించి ఎవ

రైనా వచ్చి ఎదుటపడగలిగితే మాత్రం నృపతుల్యుడైన జమీందారుగారి ఆదరాన్ని పొందకుండాపోడు. కాని చిన్న జమీందారు స్వభావం దీనికి పూర్తిగా విరుద్ధం. ఎవరైనా దర్శనం కోరివచ్చినట్లయితే దివాణంలో పొందిన అవకాశాన్నే ఇక్కడ పొందుదామనే ఉద్దేశంతో ఇంత పట్టుదలగా వస్తున్నారని నిర్ణయించుకునేవాడు. అత డలా వ్యవహరించటంవల్ల - దర్శనంకోసం వచ్చిన వారికి కావలసిన దూషణలూ తిట్లూ లభిస్తూ ఉండేవి. కేవలం ఆ ప్రాంతంలోని ప్రజలేకాదు, ఆ భవనంలో ఉండే పరిచారికలు మొదలైన వాళ్లుకూడా చిన్న జమీందారు వచ్చాడంటే చాలు, హడలిపోతూ ఉండేవాళ్లు. దోషం చెయ్యటంమాట దేముడెరుగు - ఏ కాస్త పొరపాటు జరిగినా వాళ్ళకు విముక్తి అంటూ ఉండదు. కఠినశిక్ష అనివార్యమే అన్నసంగతి వాళ్ళందరికీ తెలుసు. అంచేత అందరూ ఇత డెప్పుడు వెళ్ళిపోతాడా అని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉండేవాళ్ళు.

కాని ఈసారిమాత్రం వారి మొర భగవంతుడి చెవిని పడలేదు. ఎంచేతనో చిన్న జమీందారు ఏడెనిమిదిమంది సహచరులతో వచ్చి మూడు మాసాలనుంచి స్థిరంగా ఇక్కడే ఉంటున్నాడు. అక్కడ ఆఫీసులో పని అదీ వదలిపెట్టి ఇంత కాలం ఇక్కడ ఉండటానికి పెద్ద జమీందారుగారి అంగీకారం లభించింది-విచక్షణులైన గృహచికిత్సకుల సలహాతో బలంతో చిన్న జమీందారు ఈ అంగీకారాన్ని పొందగలిగాడు. కాని సదా సందిగ్ధ హృదయుడూ ఎంతో తెలిసిన

వాడైన జమీందారు మాత్రం అది ఆచూకీగాకూడా కని పెట్టలేకపోయాడు.

ఈ విషయంలో చిన్న జమీందారుకు సహాయకుడు, విచక్షణుడైన గృహ వైద్యుడూ - విశ్వామిత్ర ముజుందార్, M. B. అనే కొత్తవ్యక్తి పరిచయం ఇక్కడ చెయ్యాకతప్పదు.

ఎంతో ధనం వ్యయంచేసి సర్వతీనది ఒడ్డున ఈ భవనం కట్టించి, కాల్వలు త్రవ్వించినట్లే - తమ ఊళ్లో ఒక ఆస్పత్రి కూడా పెట్టించి, అది చక్కగా నడవటానికి ఏర్పాట్లూ అవీ చేసి గంగూలీ వంశీయులు చాలా కీర్తి - ప్రతిష్టలు సంపాయించారు. గవర్నమెంటు సర్వీస్‌నుంచి రిటైరయిన, అనుభవజ్ఞుడైన సివిల్ సర్జన్ ఎవరో ఒకరు ఎక్కువ జీతంమీద ఇక్కడ నియమింపబడి, ఆస్పత్రిని ఎంతో శ్రద్ధగా నడుపుతూ ఉండేవాళ్లు. అతడు గంగూలీ వంశీయుల ఆరోగ్యం విషయమై ఎంతో సావధానంగా కూడా ఉండేవాడు. సుప్రసిద్ధుడైన అమరనాథ్ బెనర్జీ అనే సివిల్ సర్జన్ రెండేళ్ళ క్రితంవరకూ ఈ ఆస్పత్రికి ప్రధాన వైద్యుడుగా ఉంటూ ఉండేవాడు. అతడు ఈ ఆస్పత్రిని ఎంతో అభివృద్ధికి తీసుకువచ్చాడు. అతడి హస్తవాసి ఎంతమంచిదో - అంత మాటమంచితనంకూడా ఉండేది అతడిలో. ప్రజలంతా అతణ్ణే 'ధన్వంతరి' అని పొగడుతూ ఉండేవాళ్లు. దేవుడిలాంటి ఈయన దయతలచి డాక్టర్ విశ్వామిత్ర ముజుందార్‌ను ఇక్కడ తాత్కాలికంగా తనకు అసిస్టెంటుగా నియమించుకున్నాడు. ఆ సమయంలో ఈ ప్రాంతాల్లో కలరా విజృంభించి ఊళ్ళకు ఊళ్లు తుడిచిపెట్టటం మొద

లెట్టింది. తాత్కాలికంగా ఒక అసిస్టెంటు కావాలని పత్రి కల్లో ప్రకటించగానే కొద్దిరోజుల్లోనే కొన్ని వందలమంది డాక్టర్లు పెట్టుకున్న అర్జీలు అమరనాథ్‌ని విబ్రతుణ్ణి చేశాయి. సరిగ్గా అప్పుడే కలకత్తా మెడికల్ కాలేజీ మెడల్‌ను, డిప్లమాను పుచ్చుకొని, పంజాబ్‌లోని కొన్ని ప్రైవేట్ ఆస్ప త్రుల సర్టిఫికెట్లూ, కొంతమంది ప్రసిద్ధుల సిఫార్సులూ తీసుకుని, డాక్టర్ ముజుందార్ ఈ బాగులీ ఆస్పత్రిలోకి వచ్చి చేరాడు.

మొదట చూడగానే వయసు చెల్లిన అమరనాథ్ బెనర్జీకి ముజుందార్ వేషభాషలు సంతృప్తికరంగా లేక పోయినా అతడి చేతనున్న ఈ ఆయుధాల నన్నిటినీ ఉపేక్షా భావంతో త్రోసి పారెయ్యలేకపోయాడు. ఈ క్రొత్తగా వచ్చిన డాక్టరు తన క్రూర దృష్టిని ప్రధాన చికిత్సకుడైన బెనర్జీమీదికి పరపుతూంటే-సహచరులు చాటుగా "ఇదెక్కడి దృష్టిరాబాబూ! శని దృష్టి" అని అనుకుంటూ ఉండేవాళ్లు.

వాళ్ళనుకున్నది కొద్దిరోజుల్లోనే యథార్థంగా పరిణ మించి, ప్రధాన చికిత్సకుని మీద పనిచేసింది ఆ ప్రాంతా ల్లోని కలరా ఒక నెలలోనే తగ్గిపోయింది. ఈ క్రొత్తగా వచ్చిన ముజుందార్ మూడుమాసాల్లో తన ఉద్యోగాన్ని విడిచిపెట్టి పోవాల్సిందసలు. కాని మరికొన్ని సిఫార్సుల బలిమివల్ల తాత్కాలికంగా వచ్చిన డాక్టరు స్థిరమైన అసి స్టెంట్‌గా నియమించబడ్డాడు.

తర్వాత కొద్ది మాసాలకే - ఆస్పత్రిని ప్రాణప్రదంగా చూసుకుంటూ ఎంతో అభివృద్ధిలోకి తీసుకువచ్చిన ధన్వం

తరిలాంటి అమరనాథ బెనర్జీ సకుటుంబంగా బాశులీ గ్రామాన్ని విడిచిపెట్టి పోవలసిరావటం, ఆ స్థానంలో ముజుందార్ నియమింపబడటం చూసి ఊళ్లోవాళ్ళంతా ఆశ్చర్యపోయారు. దీనికంతకీ వెనుక పీటీన జరిగిన కుతంత్రాలన్నీ తెలుసుకోగలిగిన సామర్థ్యం ఆ ఆస్పత్రి నిర్వాహకులకు ఉన్నది; కాని వాళ్లెవరూ ఈ శనిదేవత వక్రదృష్టి యెదుటకు వచ్చి నిలబడటానికి సాహసించలేక పోయారు.

తర్వాత దుర్ముఖుడైన చిన్న జమీందారుకీ, ఈ ఆస్పత్రి డాక్టర్‌కీ ఎంతో స్నేహం కలిసింది అని తెలుసుకున్నప్పుడు - ఎస్టేట్ ఉద్యోగులు, ఆస్పత్రిలోని ఉద్యోగులూ అందరూ విస్తుబోయారు.

ఈ ఉభయుల సమావేశానికి వెనుక జరిగిన గాథ ఇది.

చండిమీద ఫిర్యాదు చెయ్యటానికి నివారణుడు తండ్రి దగ్గరకు వెళ్ళగానే, మొట్టమొదట తనకి తగిలిన ఆఘాతాన్ని అతడు సహించలేక పోయాడు. మానసిక వేదనతో అతడు మంచం ఎక్కాల్సివచ్చింది. అతడి కళ్ళు ఎర్రగా ఉండటం శరీరం కంపించటం ముఖం వివర్ణమై పోవటం, దృష్టిలో ఔదాసీన్యం వ్యక్తమవుతూ ఉండటం ఇవన్నీ చూసి పరిచారికలూ మొదలైనవాళ్లు గాభరాపడిపోయారు. తర్వాత విశు డాక్టరు గారికి కబురు పంపటం, కబురు అందిన మరుక్షణం లోనే అతడు ఆదరా బాదరా రావడం సంభవించింది.

ప్రాథమిక చికిత్సవల్లనే రోగి చాలావరకు స్వస్థుడయినాడు - డాక్టరుగారు పరిజనులకేసి, గంభీరంగా చూస్తూ "ఒక గంటసేపు మీరంతా ఇక్కడినుంచి బయటికి వెళ్లాలి.

ఈ గదిలోనే కాదు. అసలీ చుట్టుప్రక్కల యెవరూ ఉండ కూడదు'' అన్నాడు.

పరిజనులంతా ఆ గదిలోంచి వెళ్ళిపోగానే డాక్టరు స్వయంగానే తలుపులు వేసివచ్చి, రోగిపక్కమీద కూచు న్నాడు. రోగి దృష్టి అంతా డాక్టరు మీదనే ఉంది. "చూశారూ! నేను డాక్టర్ని. మీ జీవితాన్ని కాపాడవలసిన భారం నా మీద ఉంచారు కనుక, మీ మానసిక కవా టాలు కూడా నా ముందు బాహాటంగా తెరవండి. అభ్యం తరం పెట్టకండి'' అన్నాడు డాక్టరు.

"మిమ్మల్ని విశ్వసించమంటారా డాక్టరుగారూ!''అని అడిగాడు నివారణుడు.

డాక్టరతణ్ణి గట్టిగా ప్రోత్సహిస్తూ-"ఓ, నిస్సందే హంగా... మీకు చికిత్స చేయటానికి మొట్టమొదట ఈ ఇంట్లో అడుగుపెట్టగానే, మీకు వ్యాధి ఉన్నది శరీరంలో కాదు, మనస్సులోనని చటుక్కన గ్రహించాను. ఆ వ్యాధికి అసలు అంకురం ఏమిటో నాకూ కొంతవరకు తెలియక పోలేదు, అన్నాడు.

"అరె! మీకు తెలుసా? ఆశ్చర్యంగా ఉందే!''

"తెలియకపోతేనే ఆశ్చర్య మసలు! నేను వస్తుతః డాక్టర్ని. ఎవరి ప్రాణాల్ని కాపాడవలసిన బాధ్యత నామీద పడిందో, వారి వ్యాధిని గురించికూడా సర్వదా జాగ రూకుడనై ఉండాలి. వారి మనస్సులోని విషయాలన్నిటినీ కూపీ తియ్య గలిగిన—''

"ఏమిటీ?''

"కుటుంబ వైద్యుడికి అదికూడా కర్తవ్యం క్రిందనే లెఖ్క. మానసిక లక్షణాలు తెలుసుకోకుండా వ్యాధిని నయం చెయ్యగలగటం ఈ యుగంలో అసంభవం."

"అయితే నా మనస్సులో ఉన్న విచార మేమిటో ముందుగా తెలుసుకునే ఇక్కడికి వచ్చారన్నమాట!"

"నాకు కొంతవరకు తెలియకపోలేదని మొదట్లోనే చెప్పాను. ఇప్పుడిహ చెప్పక తప్పదు కనుక చెప్తున్నా నీ మాట. మీ మనోవ్యాధి కొంచెం విషమావస్థకి దారి తీసింది. కేవలం 'హోప్ లెస్' పరిస్థితి కాదనుకోండి. కాని ఈ మనోవ్యాధిని ధైర్యంగా త్రోసేసుకుని ధీమాగా నిలబడటమా— లేదా దానికి లొంగిపోయి ఇలాగే కృశిస్తూ పడి ఉండటమా అనేది ఇహ అంతా మీ చేతుల్లోనే ఉంది"

"నా చేతుల్లోనే ఉందంటారా?"

"ఆహా. కచ్చితంగా మీ మనస్సు ఇప్పటివరకూ అతి చురుకుగా అశ్వమేధయాగపు గుర్రంలా పరుగెత్త సాగింది. ఈ అశ్వం ముఖాన్ని ఉన్న ప్రతిజ్ఞాపత్రం చూసి ఇన్నాళ్లూ దీన్నెవరూ పట్టటానికి సాహసించలేకపోయారు. కాని యిప్పుడు హఠాత్తుగా కాలు మడతపడి అశ్వం కాస్తా పడిపోయింది. అందరూ దూరంగా నిలబడి చోద్యం చూసే వారే కాని, దగ్గిరకొచ్చి లేవతీసి, సేదతీర్చేవాళ్లు లేకపోయారు. దీన్ని కొన్నాళ్లు పాటు ఇలాగే పడి ఉండనిస్తే, ఈ అశ్వానికి కూడా జడభరతుడిలా ఉండే మీ అన్నగారి స్థితే దాపురిస్తుంది."

నివారణుడు వణికిపోయాడు. డాక్టరు చెప్పింది అబద్ధం కాదని గ్రహించాడు. కొన్ని క్షణాలవరకు కూడా తన యింద్రియాల్ని స్వాధీనంలో ఉంచుకోగల సామర్థ్యాన్ని కూడా కోల్పోయాడతడు. అంతేకాదు, మనస్తత్వ శాస్త్రజ్ఞుడైన డాక్టరు తన మనోవ్యాధిని గురించి చెప్పిన దాన్ని కూడా కాదనగల సత్తా లేదతనికి. ఇన్నాళ్ల దాకా ఏదోలే తన దయాధర్మాలమీద ఆధారపడేవాడేగా అని ఎవర్ని గురించి భావిస్తూ వచ్చాడో, అతడంటే ఆంతర్యంలో గౌరవభావం కలగసాగింది యిప్పుడు. కంఠస్వరాన్ని కోమలంగా మార్చుకొని కుతూహలంతో "నిజంగా మీకు చాలా సంగతులు తెలుసల్లే ఉంది. సరేకాని ఆ గుర్రం అలా హఠాత్తుగా ఎందుకు పడిపోయిందో చెప్పగలరా మరి?" అని అడిగాడు.

"దారే నడుస్తూ ఒక చీరెకొంగు కదలికకు బెదిరిపోయి, ప్రక్కమలుపు తిరగబోయింది. ఇలాంటి సందర్భాలలో అలాపడటం సహజమే."

"మళ్ళీ లేవటం?"

"డాక్టరు చికిత్సనీ సలహాను పాటిస్తే దానిదేముంది?"

"కాని మీరు చీరె ప్రసక్తి తీసుకొచ్చారే, దాన్ని ధరించిన ఆమె సంగతులు కూడా తెలుసా యేం మీకు?"

"ఓ; చాలా తెలుసు. నాకు తెలిసినవాటిల్లో మీకు నాలుగోవంతయినా తెలుసునో తెలియదో సందేహమే."

ఆ మాట వినగానే కళ్లు రెండూ పెద్దవి చేసుకుని చూస్తూ నివారణుడు లేవబోయాడు. కాని వెంటనే డాక్టరు

అడ్డువచ్చి "లేవకండి ఇప్పుడు, పడుకునిఉండే వినండి నా మాటలు. మీ రడగ తలచిందేమిటో అడగండి. నా మాటలు విన్నంత మాత్రాన మీ వ్యాధి చప్పున పారిపో తుందని మాత్రం అనుకోకండి. కొద్దిరోజులపాటు మీరు రోగిలాగా పడుకుని ఉండాల్సిందే" అన్నాడు.

నివారణు డీ మాటలు వినిపించుకోకుండా తాను ముందు అడిగిన విషయాన్నే మళ్ళీ తీసుకొచ్చి "నా కంటె కూడా మీకుఎక్కువ సంగతులు తెలుసా ?" అని అడిగాడు.

"ఇందులో ఆశ్చర్యమేముందో అర్థం కావటం లేదు నాకు. ఆమె పంజాబ్ లో తన మాతామహుడి ఒద్దికలో ఉంటుండే రోజుల్లో నేను అక్కడ ప్రాక్టీసు చేస్తూ ఉండే వాణ్ణి."

"ఓ ! అలాచెప్పండి. అయితే—"

"అప్పుడు చాలా సంగతులు తెలుసుకోటానికి అవ కాశం చిక్కింది నాకు. ఇప్పు డా సంగతులన్నీ అలా ఉం చండి. తర్వాత వినవచ్చు. ప్రస్తుతం నేను చెప్పతలచిన దేమిటంటే, ఆ పడిపోయిన గుర్రాన్ని మళ్లీ లేవతీసి, దానికి చికిత్సచేసి, దాన్ని పరుగెత్తింప చెయ్యాలి. ఈసారింక దారి తప్పనీయ కూడదు."

నివారణుడి బుర్రలో మొదట చెప్పిన మాటలే గిర్రున తిరుగుతున్నాయి యింకా. ఉత్సుకభావంతో అతడు మళ్ళీ ప్రశ్నించాడు. "మీకు పరిచయం అంటూ ఉన్న దంటే— ఆమెతో మాటా-పలుకూ కూడా ఆడి ఉంటా రన్న మాటేగా ?"

డాక్టరు దీర్ఘంగా నిట్టూర్చి, "అలా ఉండాల్సిందేగా అసలు! ఆమె చివరకి అన్నమాటలు మాత్రం ఇప్పటికీ నా చెవుల్లో ఇంకా గింగురుమంటున్నాయి" అన్నాడు.

"అది దేన్నిగురించి డాక్టరుగారూ? చెప్పటానికేమయినా అభ్యంతరమా?"

"ఏం లేదు. నేను చేసే మానసిక చికిత్సా విధానాన్ని గురించి ఆమె గేలిచేస్తూ ఒకరోజున మీరు ఫిజిక్సు విడిచిపెట్టి 'ఫిజియానమీ'ని గురించి చర్చించండి, దానివల్ల ప్రజల ముఖాల్లోని భావాలు చూసి, మనస్సులోని భావాల్ని చెప్పవచ్చు' అన్నది."

మీరు జవాబు ఏంచెప్పారు?"

"జవాబు చెప్పేందుకు అవకాశం చిక్కలేదు. చూద్దాం, మీ గుర్రం కనుక జయించిందంటే-ఆ కారణంగా జవాబు చెప్పేందుకు అవకాశం లభిస్తుంది లెండి"

ఆ మాట విని నివారణుడు డాక్టరు ముఖంకేసి సాభిప్రాయంగా చూశాడు. డాక్టరు వక్రదృష్టి కూడా అతడి మీదే కేంద్రీకృతమై ఉంది. ఉభయులూ ఒకర్ని ఒకరు అర్థం చేసుకుని, తమతమ హృదయాలను నిష్కపటంగా వెల్లడించుకున్నారు. వయస్సు చూద్దామా ఇద్దరికీ మధ్య పదేళ్ళ వ్యత్యాసం ఉంది. అభిజాత్యము, అహంకారము, స్వస్వామి సంబంధమూ వీటన్నిటి మూలంగా ఈ ఇద్దరిమధ్యా ఇన్నాళ్ళ నుంచీ అడ్డుగాఉన్న గోడ, చాలా ఆశ్చర్యంగా మాయమై పోయిందిప్పుడు.

నివారణుడి వ్యాధి, అది తగ్గే విధానమూ డాక్టరు హరి నారాయణబాబుకు ఎలా చెప్పాడంటే— అతడు భయంతో డాక్టరు చెప్పినదానికి అంగీకరించే పద్ధతిని చెప్పాడు. 'పని యెక్కువగా చెయ్యటం, దానికితోడు తీరని మనస్తాపం - ఈ రెండే ఈ వ్యాధికి మూలకారణాలు - దాన్ని నిర్లక్ష్యం చేస్తే త్వరలో పిచ్చి యెత్తినా యెత్తవచ్చు'...

డాక్టరు చెప్పినది ఆయనకు చాలా విశ్వాస నీయంగానే కన్పించింది. అంచేత ఈ డాక్టరుగారి అజమాయిషీతో ఆ సరస్వతీ నది ఒడ్డున ఉన్న ఉద్యాన భవనంలో ఉంటూ, ఆరోగ్యాన్ని కాపాడుకోటానికి నివారణుడికి తండ్రి అనుమతి ఇచ్చాడు.

ఆ ఉద్యానభవనంలో కొన్ని నెలలు ఉండటంవల్ల, అక్కడ ఉండే అనుచరుల సుహృద్భావంవల్ల డాక్టరు సాహచర్యంవల్ల నివారణుడు కేవలం ఆరోగ్యాన్ని కాపాడుకోగలిగాడని చెప్పటానికి వీల్లేదు. దాంతోపాటు జీవితంలో అంత వరకూ అనాస్వాదితాలుగా ఉన్న ఒకటి రెండు క్రొత్త వస్తువుల పరిచయాన్ని అనుభూతినికూడా పొందగలిగాడు.

నివారణుడు టీ త్రాగుతున్నప్పుడల్లా డాక్టరు కూడా ఆ టేబిల్ముందే కూర్చుని పెగ్మీద పెగ్ మద్యం సేవిస్తూ ఉండేవాడు. పైగా నవ్వుతూ - సహజంగా ఉష్ణతనుకలిగించే ఈపదార్థం మనోవ్యాధికి సాటిలేని దివ్యౌషధం''అనిఅంటూ ఉండేవాడు. ఒకవారం గడిచేసరికి నివారణుడి టీ కప్పులో ఈ మహౌషధాన్ని కొంచెం కొంచెం కలుపుతూ ఆ టీ యొక్క శక్తిని ఇనుమడింపచేశాడు. ఆ తర్వాత వారంలో ఉభయులూ

ఒకే పరిమాణంలో ఈ మహౌషధాన్ని సేవించేస్థితికివచ్చారు. ఆ తర్వాత వారంలో అసలు టీ త్రాగటం అనేది పోయి, కేవలం దీన్ని త్రాగటమే అలవాటయిపోయింది. ఉభయుల మధ్యా అదివరదాకా ఉన్న అంతరం ఈ త్రాగుడుబల్లముందు పూర్తిగా తుడుచుకుపోయింది.

మన స్తత్వవిదుడైన డాక్టరు, వ్యాధిగ్రస్తుడైనమిత్రుడి కోరికను సఫలీకృతం చెయ్యటానికి, ఈ కొద్ది మాసాలనుంచీ మనోవ్యాధికి సంబంధించిన మందుల్ని గురించే క్రిందామీదా పడుతున్నాడంటే, అతడి విషయంలో అనాలోచితంగా చెప్పి నట్లవుతుంది. మనోవేగంతో అతడు జిల్లా అంతా ఎక్కడికి పడితే అక్కడికి తిరుగుతూ ఈ బాశులీ యెస్టేట్‌ను నష్టాల్లోకి లాగటానికి ఒక పెద్దకుట్ర పన్నసాగాడు.

శ్రీరామచంద్రుడికి ారధికట్టే సమయంలో ఉడత కూడా వచ్చి సహాయపడింది. డాక్టరు సహాయంతో నివారణుడు ప్రారంభించిన ఈ ప్రయత్నంలో పిన్నలు - పెద్దలు అనేకమంది వచ్చి సహాయపడ నారంభించారు. బాశులీజమీందారుగారి కోడలి మన స్తత్వాన్ని గురించి సేకరించిన యదార్థ విషయాలకీ దేశంలో విప్లవకారులు అనుసరించే నీతికీ చాలా సన్నిహితత్వం ఉందట! శ్యామాపురంలో - ఈమె మొండి పట్టుదల మూలంగా జమీందారు ఉచిత విద్యాలయాన్ని స్థాపించటం, ఆ విద్యాలయంలో బాలికలంతా విధిగా వచ్చి చదువుకోటానికి ఆమె చూపినఅధికారం మొదలైనవన్నీ అతిశయోక్తులతో కల్పించబడ్డాయి. మిషనరీవిద్యాలయంలో ఈమె వల్ల అవమానం పొందిన ఉపాధ్యాయిని కూడా వీరికి

సహకరించటానికి సంకోచించలేదు. జమీందారుగారి పాఠశాల ప్రారంభమయాక ఈ మిషనరీ స్కూల్లోకి వచ్చే బాలికలే లేకపోవటం మూలంగా స్కూల్ మూసివెయ్యవలసి వచ్చింది. డిస్ట్రిక్టుమిషన్ సొసైటీ అధికారులుకూడా దీనికి చాలా చింతించారు. అటువైపునుంచి వచ్చిన సహకారమూ తక్కువది కాదు. జిల్లాకలెక్టరు, మేజస్ట్రేటూ ఈ బాళులీ జమీందారంటే గుర్రుగానే ఉన్నారు. కాని ఆయన్ని తమ 'కంట్రోల్' లోకి తీసుకోవటానికి వారి కింతవరకూ యెక్కడా కారణమనేది కన్పించలేదు. హఠాత్తుగా ఇప్పుడు ఆయెస్టేట్‌ను గురించీ, ఆ జమీందారును గురించీ రకరకాల ఆరోపణలు, ప్రత్యక్షంగా, పరోక్షంగా చెంతకు వచ్చి పడటం చూసి, వారు ఆశ్చర్యపోయారు. ఇన్నాళ్ళకెలా అయితేయేం రంధ్రం అనేది కన్పించింది కదా అనుకున్నాడు పై అధికారి దొర. కాని ఆ కాగితాన్ని ఆధారంగా చేసుకోటానికి ఆయనకి కొంచెం సంకోచం కూడా కలిగింది. అది సహజమే పేరు ప్రఖ్యాతులున్న జమీందారు, ప్రభుత్వం యిచ్చే బిరుదాలకు ఆశపడేరకం కాదు. చాలా పలుకుబడి ఉన్నవాడు. ఇది మిథ్యాభియోగం అయితే?

కాని జమీందారు కొడుకు తలవని తలంపుగా అతడి ప్రైవేట్‌రూమ్‌లో ప్రవేశించి, ఆసంకోచాన్ని తొలగించాడు. నివారణు డొక్కడే రాలేదు, విశు డాక్టర్ని తనకు లీగల్ ఎడ్వైజరుగా వెంటపెట్టుకొని మరీవచ్చాడు. దొరతో మాట్లాడేప్పుడు నివారణుడు పొరపాటున మరో ప్రసంగంలోకి దిగ

బోతే, విశుడాక్టరు ఎంతో దక్షతతో సమగ్రతతో దాన్ని కప్పిపుచ్చేవాడు.

ఈ సందర్భములో - ఆ అసాధ్యురాలైన అమ్మాయి జమీాందారుకి కోడలయిందని, ఆమె ప్రస్తుతం వృద్ధ జమీాం దారుని తన గోటిమీాద ఆడిస్తోందన్న సంగతీ తెలిసింది. ఆమె భర్త మూర్ఖుడు, జడుడు, వెర్రిబాగులవాడు. కనుక జ్యేష్ఠు డయినప్పటికీ బాశులీ సింహాసనాన్ని అధిష్ఠించే అధికారాన్ని కోల్పోయాడు. కాని కోడలి ప్రేరేపణవల్ల జమీాందారు ఆ వెర్రిబాగులవాడ్నే గద్దె ఎక్కించటానికి ఉద్యుక్తుడయినాడు. దీనివల్ల ఒకరకంగా కోడలే బాశులీ జమీాకి అధికారిణి అవు తుంది. అలా కనుక జరిగేట్లయితే ఈ ప్రసిద్ధమైన సంస్థానం ప్రభుత్వంతో సహకారాన్ని సద్భావాన్ని నిలబెట్టుకోలేదు. ఈ అమ్మాయి స్వభావమూా, మనస్తత్వమూా అభ్యంతరము లైనవి. దేశంలో విప్లవమార్గములో ముందుకు వచ్చిన స్త్రీ లెవరయితే ఉన్నారో అందరితోనూా ఈమెకి సంబంధబాంధ వ్యాలు ఉన్నాయి.

ఇలా చాలా సంగతులు మాట్లాడిన తర్వాత దొర నివారణుడ్ని ఊరటపరచి, 'షేక్‌హాండ్'తో ఆప్యాయత ఉన్నట్లు వ్యక్తపరచి పంపించివేశాడు. డాక్టరుకూాడా తగిన మర్యాదలు పొందకపోలేదు.

ఇది జరిగిన పదిహేను రోజులకి ఈ ఉద్యానభవనంలో ఒకనాడు అర్ధరాత్రివేళ ఆనందమహోత్సవం సాగుతోంది. నృత్యగీత వాయిద్యాలతో పాటు మధుసేవకూాడా సాగు తోంది. కలకత్తానుంచి డాక్టరుగారి బంధుమిత్రులు కొం

దరు వచ్చారిక్కడికి. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ ఉత్సవం ఏర్పాటయింది. పెగ్ మీద పెగ్ వేసుకుంటూ ఉండ టంతో ఉత్సవం మాంచి జోరుగా సాగుతోంది. ఈ స్థితిలో ఉండగా ఈ ఉద్యానభవనం యొక్క రుద్ధ ద్వారం చెంతకు గుర్రంమీద ఒక వార్తావహుడువచ్చి నిలబడడంతో, వీరిలో కొంతమంది మైకం వదలింది. అతడు కంగారుగా లేచివెళ్ళి చూశాడు. బయట ఆ అశ్వారోహకుడు యెదురుగా చూస్తూ నిలబడి ఉన్నాడు. అతడి దుస్తులు చూడగానే వార్తావహు డని తెలిసి పోతోంది.

తలుపు తెరవగానే అశ్వారోహకుడు పెదబాబుగారి దగ్గర్నుంచి ఉత్తరం తీసుకువచ్చాననీ, దాన్ని యిప్పుడే చిన బాబుగారి చేతికి యివ్వాలని, చాలా అత్యవసరమైన పని అని చెప్పాడు. చిన్న జమీందారప్పుడు ఉత్తరం చదువవలసిన స్థితిలో లేడు. విశు డాక్టరే విధిలేక ఉత్తరం చించవలసి వచ్చింది. అతడు ఉత్తరాన్ని ముందు మనస్సులో చదువు కుని 'హుర్రే!' అని అరిచాడు.

బలవంతాన అందరూ ఒక్కక్షణం కళ్ళెత్తి చూశారు. అక్కడ ఉన్న వారందరూ ఇంచుమించు ఒకే స్థితిలో ఉన్నారు. డాక్టరు ఆ ఉత్తరాన్ని పైకి గట్టిగా చదివేశాడు.

—హరినారాయణ గంగోపాధ్యాయ ఆశీఃపూర్వ కంగా : ఇప్పుడే విశ్వసనీయ వర్గాలద్వారా - ప్రెసిడెన్సీ కమీషనర్, జిల్లా కలెక్టరుగారూ వేటకోసం బయలుదేరి ఈ ప్రాంతాలకి వస్తారని తెలిసింది. వారు ఎల్లుండి మన ఉద్యానవనానికి వేంచేసి మన ఆతిథ్యాన్ని స్వీకరించగలమని

తెలియచేశారు. కనుక నువ్వు ఉన్నవాడివి ఉన్నట్టుగా డాక్టర్ని వెంటపెట్టుకుని రావలసింది."

ఆశీస్సులతో

"(శ్రీ) హరినారాయణ గంగూలీ—"

పెద్ద జమీందారుగారి ఈ అర్జంట్ ఉత్తరం - ఇంత ఆనందకరమైన వార్తను తీసుకురాగలదని నివారణుడుగాని, డాక్టరుకాని యెవ్వరూ ఊహించుకోనేలేదు. కాని విచారకరమైన సంగతేమిటంటే— ఆ ఉత్సవం పరిసమాప్తి చెందలేదింకా. అయినా డాక్టరు సలహా ననుసరించి అందరూ మద్యంతో నిండిన గ్లాసులు చేతపట్టుకొని లేచి తూలితూలి పడుతూ 'మహా గౌరవనీయులైన కమీషనర్ - కలెక్టరు దొరల నుద్దేశించి సంప్రదాయానుసారం ఆ గ్లాసుల్ని ఒం డొంటిని తాపించుకున్నారు. తమ వాంఛితం పూర్తికాబో తున్నందున అందరూ మళ్ళీ ఆ అర్థరాత్రి నిశ్శబ్దతకు భంగం కలిగించారు. 'హిప్ ... హిప్ ... హుర్రే' అంటూ.

## 21

'అమ్మా! అమ్మా! అమ్మా!'

భర్త - వ్యాకులపాటుతో, ఆర్త కంఠంతో ఇలా ఉచ్చరించటంతో చండికి నిద్ర మెళుకువ వచ్చింది. కంగారు పడుతూ లేచి ఆమె ముందు గబగబా దీపం దగ్గరకు పరుగెత్తి, దీపాన్ని పెద్దదిచేసి చూసింది. భర్త పక్కమీద కూచుని

ఉన్నాడు. అతడి కళ్లు పత్తికాయల్లా ఉన్నాయి. ముఖంలో ఏదో భావవికాసం ద్యోతకమవుతోంది.

"ఏమిటి? ఏం జరిగింది? అలా కలవరిస్తున్నారేమిటి?

భార్య ఇలా అడగటంతో అతడికి చైతన్యం కలిగింది. దృష్టిని స్వాభావికంగా మార్చుకుని, భార్యకేసి చూసి, భావ గద్గద కంఠంతో, "మా అమ్మ సాక్షాత్తూ వచ్చి, నా మంచం మీద కూర్చుని, తన చేతులతో నా శరీరమంతా నిమిరింది. ఆ స్పర్శతో నా వీపునిండా కలువరేకులు కప్పినట్లు అనిపించింది. ఇప్పటికి ఆ అనుభూతి పోలేదు. సరిగ్గా ఆ చిత్తరువులో ఉన్నట్లుంది. కాని శరీరచ్ఛాయమాత్రం తెల్లటి తెలుపు" అన్నాడు.

చండి ఏమాత్రం విస్మయాన్ని వ్యక్తపరచలేదు. ఏమీ ప్రశ్నించనూలేదు. స్నిగ్ధస్వరంతో "సాధనలో చిత్త శుద్ధి ఏర్పడగానే దివ్యభావం కలుగుతుంది ముందు ఆ వెను వెంటనే దివ్యదర్శనం కూడా లభిస్తుంది. ఇందులో ఆశ్చర్య పడవలసిందేమీ లేదు" అని మాత్రం అన్నది.

"నేనయినా ఆశ్చర్యపోలేదు, కాని చాలా దుఃఖ మొచ్చింది - లేచికూర్చుని అమ్మని చూడలేకపోయానుగా మరి !"

భార్య మెల్లగా భర్తను ఊరడిస్తూ "కళ్ళతో చూస్తేనే చూసినట్లా యేం? ఆమెమీద అచంచలమైన భక్తి ఉంటే మనస్సుకి సర్వదా కన్పిస్తూనే ఉంటుంది..." అన్నది.

సరీగ్గా ఇంతలో బయట తలుపులు చప్పుడు కావ టంతో దంపతులిద్దరూ చకితులయినారు. వేళకానివేళ ఎవ రిలా వచ్చి తొందర కలిగిస్తున్నారు! ఇద్దరూ గడియారం కేసి చూశారు. నాలుగు కొట్టటానికి ఇంకా కాస్త వ్యవధి ఉంది.

ఇవాళ తలుపులు తీయటానికి గోవిందుడే ముందుకు వెళ్ళాడు. భార్య, భర్త అలా చొరవచేసుకు వెళ్ళటాన్ని ముగ్ధురాలై చూడసాగింది. అతడి అవయవాల కదలికలో పౌరుషం వ్యక్తమవుతూ ఉండటం చూసి, ఆమె తన్మయు రాలు కాసాగింది. 'ధళధళ లాడే లావణ్యం... ధరణి అం తటా నిండింది' అన్న పదావళిలోని మధురమైన చరణం చటుక్కున ఆమె గొంతులో గుసగుసలాడింది.

గోవిందుడు తిరిగివచ్చి, "నాన్నగారికి హఠాత్తుగా జబ్బు చేసిందట! నీ కోసం కబురుచేశారు. బయట పరిచారి కలు నీ కోసం నుంచుని ఉన్నారు" అని చెప్పాడు.

ఆమెకి విచారం కలిగింది. కనుబొమలు చిట్లించి, "నాకోసం కబురు చేశారంటే ఏదో పెద్దజబ్బే చేసి ఉంటుంది. మరి మీరు కూడా రారూ?" అని అడిగింది.

గోవిందుడు మ్లానముఖంతో "నాకు కబురు చెయ్య లేదుగా!" అన్నాడు.

"ఏదైనా సుస్తీ - అదీ చేసినప్పుడు మీకు కబురు పంపటంకూడా అవసరమన్న అభిప్రాయం వారికింకా గట్టిగా యేర్పడలేదు" అన్నది చండి.

ఆమాట వినేసరికి గోవిందుడి మనస్సులో అభిమానం జాగృతమయింది.

"నాన్నగారు నేను ఇంకా అలాగే ఉన్నానని అనుకుంటున్నారు. వారు వచ్చినప్పుడు నేను ఏదో లెఖ్ఖలు చేస్తూ ఉండటం గమనించారు. నన్ను ప్రశ్నించనుకూడా ప్రశ్నించారు. నేను దానికి సరియైన జవాబే ఇచ్చాను. ఆ తర్వాత ఈ కొద్దిమాసాల్లోనూ నేనింక అభ్యున్నతిని ఏమీ సాధించనల్లేనా!"

భర్త మాటలు చండి మనస్సుకు నాటాయి. కాని ఆమె ఈ విషయంలో అతడ్ని ఏమీ ఉత్తేజితుణ్ణి చెయ్యకుండా ఉందామనే ఉద్దేశంతో "బహుశా ఇలాకూడా అయి ఉండొచ్చు. అప్పటినుంచీ వారికి ఒకరకమైన పశ్చాత్తాపం కూడాకలిగి ఉండవచ్చు. మీరుచదువులో ఇంకా అభివృద్ధిని సాధించి ఉంటారనే ఊహించి ఉంటారు. మిమ్మల్ని పిలిపించటానికి మాత్రం కాస్త సంకోచం బాధించి ఉండవచ్చు. అయినా మీకు అభ్యంతరం లేకపోతే ఈ స్థితిలో మీ అంతట మీరు వెళ్ళినా తప్పేమీ లేదు. వారు మిమ్మల్ని చూసి సంతోషిస్తారు" అన్నది.

గోవిందుడు ఒక్క క్షణం తనలో తాను యేదో ఆలోచించుకొని జిజ్ఞాసాదృష్టితో భార్య ముఖంకేసి చూస్తూ "కాని దానివల్ల ప్రయోజనం ఉండదేమో? అస్వస్థతగా ఉంటున్నప్పుడు దుఃఖకరమైన వార్తలు చెవిని పడనీయకూడదని, సంతోషకరమైన వార్తలు కూడా హఠాత్తుగా కనుక వినిపిస్తే దానివల్లకూడా కొంత చెరుపు సంభవించవచ్చునని,

ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం. నేను చాలావరకు శిక్షితు డయినానని తెలిసినా, నాన్నగారి అస్వస్థత ఇంకొంచెం ఎక్కువకావచ్చు" అన్నాడు.

చండి ప్రశంసాసూచకమైన దృష్టితో భర్త ముఖం కేసి చూస్తూ "కాని నాకు ఈ ఆలోచన తట్టలేదు. నిజం గానే మీరు తల్లి అనుగ్రహాన్ని పొందగలిగారు. వివాహం నాటి రాత్రి మీ మాటలు వింటే ఎలా ఉందో ఇవాళ అలా ఉంది నాకు" అన్నది.

భార్య మాటలకి గోవిందుడు కళ్లు రెండూ ఉజ్వలంగా చేసుకుని, "ఆ రోజు, నువ్వు నాతో ఎన్ని మాటలయితే చెప్పావో అన్నీ ఆచరణలో పెట్టావు. నీమూలంగానేగా నే నివాళ ఈమాత్రం శిక్షితుణ్ణయినా అయిందీ!" అన్నాడు.

భార్య ముఖం సిగ్గుతో కొంచెం ఎఱ్ఱబడినా, నిర్మల మైన మందహాసంతో ముఖాన్ని ఉజ్వలంగా చేసుకుని, "మీరు శిక్షితులైంది, మీ మానసిక బలంవల్ల" అన్నది.

"కాని నా మనస్సుకు ఇంత శక్తిని కల్గించిందెవరు? శిక్షితుడయినాక నా కేమనిపిస్తున్నదో తెలుసా? చదువు రానివాళ్లు కేవలం దౌర్భాగ్యులు! నిన్ను పొందకపోయి నట్లయితే నేను జీవితమంతా అలా దౌర్భాగ్యుణ్ణిగానే ఉండి పోవలసి వచ్చేది. అందరూ నన్ను ఈసడించుకుంటూ ఉండే వారు. ఇంకా నాకు ఆ జడత్వం పూర్తిగా పోలేదు. నీ కింకా అడ్డుగా నుంచునే ఉన్నాను. నువ్వు సరాసరి ముందు నాన్నగారి దగ్గిరకు వెళ్లు. మళ్ళీ నీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాను."

చండి ముగ్ధ దృష్టితో రెప్పవాల్చకుండా భర్త ముఖం కేసి చూసింది. గోవిందుడు నిండుగా ఆమె ముఖంలోకి చూసే సరికి ఉభయులకళ్లూ కలుసుకున్నాయి. దాంతో ఇద్దరి ముఖాలూ అపూర్వకాంతితో ఉద్భాసితము లైనాయి

# 22

హరినారాయణబాబు ఒక పెద్ద గదిలో మంచం మీద మైకంలో ఉన్నట్లు పడుకుని ఉన్నాడు. మాధురీదేవి, మృణాళిని మరికొంతమంది స్త్రీలు అతడి చుట్టూ కూర్చొని పరిచర్యలు చేస్తున్నారు. వృద్ధుడైన ఆస్పత్రిలోని అసిస్టెంట్ డాక్టరు – కొంతమంది సహచరులతో దగ్గరలోనే కూర్చుని, మందుల విషయమై ఆలోచిస్తున్నాడు.

"మామగారూ!"

సుపరిచితమైన ఈ పిలుపుతో రోగి మైకం వెంటనే వదలిపోయింది. కళ్లు తెరచి ఆప్యాయంగా 'అమ్మా చండీ!' అన్నాడు మెల్లిగా.

చండి నిస్సంకోచంగా సరాసరి మామగారి మంచం మీదికి వచ్చి కూచుని, నెమ్మదిగా ఆయన పాదాలను తన ఒడిలోకి తీసుకుంది.

చండి అత్తగారి కేసిచూస్తూ"ఏంజరిగింది అత్తయ్యా!" అని అడిగింది.

రాణి దీర్ఘంగా నిట్టూర్చి, "హఠాత్తుగా తల తిరిగి పడిపోయారు. అయినా దేముడి దయవల్ల వారంతట వారే ఆ పాటును కొంతవరకు తమాయించుకున్నారు. పెద్ద దెబ్బ

యేమీ తగ్గలేదు. కాని తలత్రిప్పు మాత్రం ఇంకా తగ్గలేదు" అన్నది.

చండి ముఖం వివర్ణమైపోయింది. "డాక్టరు ఏమన్నారత్తయ్యా?" అని అడిగింది.

"వాళ్లు పైకి యేమీ చెప్పలేదు. తలకు మంచుగడ్డ తీసుకొచ్చి పెట్టమన్నారు. ఒక ఇంజక్షన్ కూడా ఇచ్చారు. విశు డాక్టరుగారు వస్తేనేగాని అసలది ఏంజబ్బు అయినదీ తెలియదు."

"వారింకా ఎందుకు రాలేదు?" - అని చండి వ్యగ్ర కంఠంతో ప్రశ్నించింది.

"ఆయన ఊళ్లో లేరు. అయినా ఈ సుస్తీ చెయ్యక ముందు - ప్రొద్దునే - ఆయన్ని యెందుకో రమ్మని కబురు పంపించారని విన్నాను. తెల్లారేసరికి వచ్చేస్తారు."

అక్కడ ఉన్నవారినందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ "అమ్మా! నువ్వు నిద్రలోనే ఉన్నావల్లే ఉందే ఇంకా?" అని ప్రశ్నించాడు మామగారు.

"లేదు, మామగారూ! నేను మెలుకువగానే ఉన్నాను. కాని మీరు మెదలకుండా పడుకోండి, మాట్లాడొద్దు."

"అయితే మరి నిన్నెందుకు పిలిచాననుకున్నావమ్మా? ఇవాళసలు కబురు పంపవలసింది కాదింకా నీకు... ఇవి మహాలయ పక్షపురోజులు. దేవీ నవరాత్రాలు రావటానికింకా వ్యవధి ఉంది. కాని తప్పనిసరియై నిన్ను అసమయంలో పిలిపించాల్సి వచ్చిందమ్మాయీ!" అని అన్నాడు మామగారు గట్టిగా.

రోగి ఇలా మాట్లాడుతూ ఉండటం చూసి, చేతులో ఉన్న పనివదిలేసి, డాక్టరు దగ్గిరకి పరుగెత్తుకొచ్చాడు. అతడు వైద్యుడుగా తన బాధ్యతని గుర్తెరిగి, సవినయంగా "అదేమిటి ప్రభూ! మీరిప్పుడు ఒక్కమాటకూడా మాట్లాడకూడదు - అది ప్రమాదం" అని మనవిచేశాడు.

రోగి ఎర్రపడ్డ కళ్ళతో డాక్టరుకేసి తీక్షణంగా చూశాడు వెంటనే అదే ధోరణిలో "జీవితంలో ఎన్నడూ ఎవరి ఆజ్ఞనూ యెరగను డాక్టర్! ఇవాళ రోగిని కదా అనే నెపంతో నువ్వు నాకు అడ్డుచెప్పవచ్చావా?" అన్నాడు.

డాక్టరు చేతులు రెండూ జోడించి, "పొరపాటయింది నాది. తమరు ఇంక ఊరుకోండి." అని విన్నవించాడు.

రోగి తర్జనితో శాసిస్తూ "ఊరుకోనా? ఇప్పుడా?" అంటూ వికృత కంఠంతో బిగ్గరగా నవ్వుతూ "పందెపు గుర్రం దాని చిత్తం వచ్చినట్లు పరుగెడుతుంది. దాన్ని ఆప టం నీ తరమా? నిర్ణీత స్థలానికి చేరుకున్నాక దానంతటదే ఆగుతుంది" అన్నాడు.

డాక్టరుకి రోగి స్వభావం తెలుసు. అంచేత ఆయ న్నింక కదలించకుండా తన చోటులోకి వెళ్ళాడు.

"డాక్టరు పారిపోయినాడల్లే ఉంది అమ్మా! ఆఁ.!పారి పోక తప్పదు. ఆఁ! అదేమిటి-ఆయుర్వేదాచార్యుడి కూతురు కళ్లు ఎర్రచేసి ఏదో మాటను కప్పిపుచ్చుతోందల్లే ఉందే! హ్హా హ్హా హ్హా! కాని ఈ మాటవిని నువ్వుకూడా కోపం తెచ్చు కోలేదుకదా అమ్మాయీ?"

"మామగారూ !"

ఆమె యీ పిలుపులో కేవలం సంబోధన మాత్రమే వ్యక్తం కాలేదు. ఇంకా యేదో కూడా ఉంది. ఈ బౌద్ధత్యంతో కూడిన పిలుపు రోగి చెవుల్లో ఉన్మత్త స్వరంలాగా గింగిర్లెత్తించింది. అతడు ఉద్వేల కంఠంతో - "ఓహో ! ఇలాంటి పిలుపే నేను వినతలచింది అమ్మాయీ!" అన్నాడు.

చండి తన స్నిగ్ధ స్వరాన్ని కొంచెం తీక్ష్ణంగా మార్చుకుని, "మీరు ఎన్నడూ ఎవరి ఆజ్ఞనీ మన్నించి యెరగరని మాకు తెలుసు. కాని ఇప్పుడు మన్నించి తీరాలి మామగారూ! మీ రొక్కమాట కూడా మాట్లాడటానికి వీల్లేదు. మీరీమాటను లక్ష్యపెట్టకపోతే, మేమంతా ఇప్పుడే ఇక్కడ నుంచి లేచి వెళ్ళిపోతాం" అన్నది.

యజమాని మెల్లి మెల్లిగా చెయ్యి పైకి యెత్తుతూ - "అది నాకు తెలుసునమ్మా! నువ్వు ఏదయినా చెయ్యగలవు. డాక్టరుకి భయపడను కాని, నీకు మాత్రం భయపడతాను" అన్నాడు.

"అయితే మేమంతా లేచి వెళ్ళిపోవాలనే మీకు కోరికగా ఉన్నదా ?" అని అడిగింది చండి.

"లేచి వెడతారా ? నువ్వు ఏమనుకుంటున్నావ్ ? నాకు ఉపచారం చేయించుకోటానికే నిన్ను పిలిచాననుకుంటున్నావా ? నాకు ఏమాట చెప్పాలంటే నాలిక పీకుతుందో- దాన్ని నువ్వు వినితీరాలి. వినకపోతే నీకూ నిష్కృతిలేదు, నాకూ నిష్కృతిలేదు" అన్నాడు రోగి వికృతకంఠంతో ...

"కాని ఏమైనా చెప్పటానికిదేనా సమయం మామ గారూ?"

యజమాని వెనుకటిలాగానే వికృతంగా నవ్వుతూ "సమయంకూడా ఇంచుమించు నాలాంటిదే! ఎవరెంత అడ్డు పడబోయినా ఆగదు. ప్రమాదంగా పరిణమిస్తే దాన్ని ఎవరూ పట్టుకోలేరు. ఆఁ! అసలు నిన్ను పిలిపించింది ఎం దుకో చెపుతాను. దానంతటదే తెల్లవారి పోబోతోంది అమ్మాయీ! తెల్లవారనీకుండా యెవ్వరూ ఏమీ చెయ్య లేరు. కలెక్టరును వెంటపెట్టుకొని కమీషనర్ దొరగారు వేటకోసమని వస్తున్నారు. రేపు ప్రొద్దున్నే వారు వస్తా రిక్కడికి-" అన్నాడు.

మళ్ళీ యజమాని ముఖంలో వేదనాచిహ్నాలు కన్పిం చాయి. ఆయన తన వక్తవ్యాన్ని పూర్తిచెయ్యటానికి అవ కాశం చిక్కలేదు.

చండిచటుక్కున ముందుకువంగి, మామగారిముఖాన్ని చేత్తో నిమరసాగింది ఆమె దృష్టి అంతా మామగారి ముఖం మీదనే ఉంది. కాస్సేపటివరకూ ఎవ్వరూ ఏమీ మాట్లాడ లేదు.

చండి మామగారికి మాట్లాడేందుకు అవకాశం ఇవ్వ కుండా, "మీ స్వభావాన్ని నేను అర్థంచేసుకున్నదాన్ని బట్టి చూస్తే - కమీషనర్ దొరగారికి ఇక్కడ మర్యాద చెయ్య టంలో ఏదైనా పొరపాటు జరుగుతుందేమో అనే మీరింత కలత పడుతున్నారంటే నేను విశ్వసించలేకుండా ఉన్నాను మామగారూ!" అన్నది.

చండి మాటలకి యజమాని ముఖంలో చటుక్కున నవ్వు తళుక్కుమంది. ఆయన ఉత్సాహంతో - "నువ్వు చాలా ఘటికురాలివి. రోగాన్ని సరిగ్గా పట్టుకున్నావు. కమీషనర్, కలెక్టరూ-ఇక్కడికి వేటకోసమని రావటంలేదు అమ్మాయీ! విచారణకోసమని వస్తున్నారు" అన్నాడు,

ఆమాట రోగి గదిలో ఉన్నవారి నందర్నీ చకితుల్ని చేసింది. చండి మామగారి ముఖంకేసి చూస్తూ "అలాంటి అధికారం వారి కిప్పటికీ ఉందా మామగారూ? అని ప్రశ్నించింది.

"బహుశా లేకపోవచ్చు. లేకపోయినా వారికి చేసిన ఫిర్యాదుల్ని బట్టి, మరెవరైనా అయినట్లయితే ముందు తెలియ చెయ్యకుండానే పోలీసుల్ని పంపి పట్టించేవాళ్లు. కాని ఇది ఆయన పిండం అని తెలుసు కనుక, పోలీసుల్ని పంపి రెచ్చకొట్టటానికి సాహసించలేదు. అసలు అధికారులే వేట అనే మిషతో దర్యాప్తు చెయ్యటానికి వస్తున్నారు. కాదనటానికి వీల్లేదు. కొత్త ఆర్డినెన్సులూ—"

చండి విస్మయకంఠంతో - "ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయమే మామగారూ! సర్కారువారు మిమ్మల్ని కూడా 'ఆర్డినెన్స్'అనే త్రాళ్లతో బంధింపచూస్తున్నారా?-" అని అడిగింది.

అంతవరకు అడగగానే మామగారి ముఖంలో హఠాత్తుగా భావ పరివర్తనం కలగటం గమనించి, బలవంతాన గొంతు నొక్కుకుంది.

హరినారాయణ బాబుకి కొంచెం వేడి పుట్టింది. "నన్నా? ఇదిగో అమ్మాయీ! ఈ సారి పొరపాటు చేశావంటే—" చండి అవిచలితకంఠంతో - "నా ఊహ సరియైనదికాదని మీ ముఖం చూడగానే తెలుసుకున్నాను. వారు 'వేట' అనే నెపంతో మరెవర్నో వేటాడాలని వస్తున్నారని ఇప్పుడు అర్థం చేసుకున్నాను" అన్నది.

"గ్రహించావా అమ్మా? గ్రహించావా? అయితే వాళ్లు వస్తున్నారంటే నే నెందుకింత కళవళపడుతున్నానో ఇప్పుడు తప్పకుండా గ్రహించి ఉంటావు"

చండి ఒక్క క్షణం ఏదో ఆలోచించుకుంది. తర్వాత స్నిగ్ధ కంఠంతో - నేను తమ పాదాలు స్పృశించి చెప్పగలను మామగారూ! ఒకటి రెండు కఠిన కృత్యాల్లో జోక్యం కలిగించుకున్నా 'ఆర్డినెన్స్' బంధనాల్లోకిపోయి చిక్కుకునేటంత అన్యాయ కృత్యాల్ని నే నింతవరకు యెన్నడూ చెయ్యలేదు. వాళ్లు తప్పకుండా ఏదో కల్పితగాథలు విని మనల్ని ఆఘాతపరచాలనే సంకల్పంతోనే వస్తున్నారని తోస్తుంది. కాని ఆ కల్పిత కథలికి 'అస్తిత్వం' అనేది లేదు" అన్నది.

హరినారాయణబాబు చండి మాటల్ని నిబ్బరంతో విన్నప్పటికి - చివరికి కంగారు పడుతూ - నే నిప్పుడు ఆరోగ్యంగానే గనుక ఉన్నట్లయితే అస లే బెడదవచ్చినా ఆలోచించాల్సిన పనేలేదు. కాని ఇప్పుడింక మళ్ళీ లేచి నిలబడగలనో లేనో ఏం తెలుసు - ఈ పెద్దపులి ఒంట్లో పద్దెనిమిది గుళ్లు దూరాయి."

చండి ఆయన మాటలకు అడ్డువచ్చి - "నామీద వచ్చిన ఫిర్యాదేమిటో మీ కసలు తెలుసా మామగారూ?" అని అడిగింది.

హరినారాయణబాబుఅస్థిర భావంతోనే-"చాలా... చాలా ఉన్నాయ్ అమ్మా! చాలా ఉన్నాయి. ఇవి ఇదివర 'కయినట్లయితే బయటికి వచ్చేవికావు. కాని ఏం చెప్పగలం అమ్మా! ప్రతి రికార్డులోనుంచి ఏదో ఒకటి బయట పడు తూనే ఉందిట. సర్కారువారి రికార్డులను కాదనటానికి వీల్లేదు. ఫిర్యాదులన్నీ నీమీదే వచ్చాయి. నువ్వు చాలా సందిగ్ధావస్థలో పడేశావ్. నువ్వు రాసిన ఉత్తరాలుకూడా చాలా పట్టుపడ్డాయట: నువ్వు ఇదివరలో చేసిన కఠిన కార్యా లన్నీ ఇప్పుడు దృష్టాంతాలుగా మారిపోయాయట! అదీకాక నువ్వు నన్ను నీ గుప్పెటలో పెట్టుకున్నావట; ఆ వెర్రి బాగులవాడ్ని నిర్లక్ష్యంచేసి, నువ్వే 'బాశులీ' ఎస్టేట్ అధి కారాన్ని చేజిక్కించుకోవాలనే ప్రయత్నంలో ఉన్నావట. ప్రభుత్వ వ్యతిరేకులకు సాహాయ్యం చెయ్యటమే నీ ప్రధానో ద్దేశ్యంట!... అని చెప్పాడు.

మామగారి మాటలు చండి చాలా శ్రద్ధగానే విన్నది. కాని ఆమె ముఖంలో భయమూ దిగులూ అలాంటి లక్షణా లేవీ కన్పించలేదు."

న్యాయమైనదాన్ని బలవంతంగా అన్యాయంక్రింద జమకట్టటానికి అనేకులు అనేక ప్రయత్నాలు చేస్తూ ఉం టారు - కాని న్యాయం ఎప్పుడూ న్యాయంగానే ఉంటుంది. సత్య మెప్పటికీ మిథ్య కాబోదు. ఏం చెయ్యను! నేను

మీా యింటి కోడల్ని. లేకపోతే నేను స్వయంగానే వారి యెదుటకు వెళ్లి సంజాయిషీ యిచ్చేదాన్నే—'' అన్నది.

మామగారు అమితోత్సాహంతో ''ఇందుకే నిన్ను రమ్మని కబురంపించాను, ఇందుకే – ఈ సంజాయిషీ ఇప్పించాలనే!'' అన్నాడు.

చండి వక్రదృష్టితో మామగారి ముఖంకేసి చూస్తూ ''మామగారూ! అయితే నేను—''

హరినారాయణబాబు కొంచెం గట్టిగానే. ''ఆఁ!నువ్వు సిద్ధంగా ఉండమ్మా! నేను చెప్పినప్పుడు నువ్వు ఇంక సంకోచించవలసిన పనిలేదు. ఇప్పుడు భారమంతా నీమీద వేసుకుని ఉన్నాను. నువ్వు వెళ్ళిరా అమ్మాయీ!—'' అన్నాడు.

''వారు వచ్చాక – అవసరమనితోస్తే నేను వెడతాను మామగారూ! ప్రస్తుతం నా కర్తవ్యం అంతా మీకు ఉపచారాలు.''

''కాదు తల్లీ కాదు. అన్నిటికన్నా ఇప్పుడు నీ కర్తవ్యం ఆత్మరక్షణకు అవసరమైన ఏర్పాట్లు చేసుకోవటమే. నీ మర్యాదను కాపాడుకోవటం యెలాగో నీ గదిలోకెళ్ళి కూర్చుని బాగా ఆలోచించుకో. ఇప్పుడు నా విచారమంతా నిన్ను—''

చండి అవిచలిత కంఠంతో – నేను మీాపాదాలు పట్టుకుని మనవి చేస్తున్నాను మామగారూ. మీారీ విషయంలో నిశ్చింతగా ఉండండి. మనస్సులో కల్మషం అనేది లేని వారిని – వారి మర్యాదనూ జగదంబే రక్షిస్తుంది. ఆ తల్లి కృపవల్ల వంశానికి అగౌరవం రానేరదు'' అన్నది.

హరినారాయణబాబు మనస్సులో చాలా తృప్తిపడి, ఆవేగంతో - "ఈ రక్షణ కేవలం నీకే కాదు, నాకుకూడాను. అస లదికాక నేనే జబ్బు నయమై మళ్ళీ గట్టెక్కితే-అప్పుడా శాసనాన్ని - ఎందుకులే అమ్మ! ఇప్పుడా అనవసర ప్రసక్తి అంతా... ఏదో చెప్పబోయి ఏదో చెప్పాను. అయితే ఇహ నువ్వు వెళ్ళిరా అమ్మా! తెల్లవారటానికి ఇంకెంతో వ్యవధి లేదు" అన్నాడు.

చండి మామగారి పాదాలను మెల్లిగా దిండుమీద ఉంచి, సవినయంగా - "నేనింక వెళ్ళివస్తాను. నాది ఒక్క మనవి. తమరింక మాట్లాడవద్దు" అన్నది.

హరినారాయణబాబుకి నవ్వొచ్చింది. "అలాగేలే అమ్మా! ఇంక మాట్లాడను. నువ్వు వెళ్ళిరా".

చండి మెల్లిగా రోగి గదిలోంచి బయటకి వచ్చేసింది. కొంచెం సేపయాక హరినారాయణబాబు గట్టిగా నిట్టూర్చి "కేవలం సంజ్ఞతోనే అసలు సంగతి అర్థం చేసుకుంది. అంచేత నేను చెప్పుదాం చెపుదాం అనుకుంటున్నది చెప్పటానికే వీల్లేకపోయింది" అన్నాడు.

మామగారూ-కోడలూ మాట్లాడుకుంటూంటే రాణీ యింతసేపూ మెదలకుండానే ఊరుకుంది. ఇప్పుడిహ కొంచెం వెటకారంగా "అయితే ఇంతసేపూ మీరు చూపించిన ఉద్వేగం అంతా ఒట్టిదేనన్నమాటా?" అని అడిగింది.

ఆ మాట వినగానే అతడు మండిపడ్డాడు. "ఒట్టిదేనా అని అడగటంలో ఏమిటి నీ ఉద్దేశం? నే నసలు సంగతి చెప్పనేలేదనా?"

రాణి కూడా ఏ మాత్రం తెల్లమొహం వెయ్యకుండా "'అసలు సంగతి' ప్రసక్తి అంటూవస్తే 'ఒత్తి సంగతి' అనేది కూడా దానంత టదే వస్తుంది. నేనేం తప్పు మాటాడలేదు. మాటదాచే అలవాటు లేదు నాకు" అన్నది.

జమీందారు రాణీకేసి తీవ్రంగా చూసి, తర్వాత కొంచెం గంభీరంగా, "ఈ అలవాటును నేర్చుకోవటం ఇదే మొదలు కనుకనే నాకైనా, ఈఅవస్థ వచ్చిపడింది" అన్నాడు.

రాణీ సందిగ్ధ దృష్టితో భర్త ముఖంకేసి చూస్తూ "అలా అనటంలో అర్థం? ఎవర్ని ఉద్దేశించి ఇప్పుడీ అసలు విషయ ప్రసక్తి తీసుకువచ్చింది?" అని అడిగింది.

భర్త ఈసారి కఠినంగా – "వినాలని ఉందా? అసలు సంగతేమిటో తెలుసా? ప్రబుద్ధుడైన నీ కొడుకు విశుడాక్టర్ని వెంటబెట్టుకుని కలెక్టరు దగ్గరకి వెళ్ళి నా మీద—"

"ఎవరు నివారణుడా?"

"ఆc. ఆc! కాకపోతే 'ప్రబుద్ధు'డని యెందుకంటాను?"

"ఏం చెప్పాడు?"

"చాలా చెప్పాడు. చాటుచాటుగా తన అస్త్రాలన్నిటినీ గుప్పించాడు."

"ఎవరు చెప్పారా సంగతి?"

"ఆ సంగతి అనవసరం. గాలేవచ్చి అన్ని సంగతులూ నా చెవులో ఊదిపోతుందన్న సంగతి జ్ఞాపకం ఉంచుకో. కాని అబద్ధాలు మాత్రం కావు, అన్నీ యదార్థ విషయాలే. అందుకనే కలెక్టరుగారు కమీషనర్ గారితోసహా వేట అనే నెపంతో

బాశులీకి వేంచేస్తున్నారు. ఈ అసలు సంగతి బాపూలీకి తప్ప ఇంకెవరికీ తెలియదు. నేనూ మనస్సులో పెట్టుకొని ఊరుకున్నాను. కాని ఉండపట్టలేకపోయాను. మనస్సును సరియైన స్థితిలో పెట్టుకోలేకపోయాను. అయినా విచారకరమైన-ఉస్ ! ఉస్ ! అబ్బ !..."

ఉద్రేకం ఎక్కువవటంతో అంతవరకు చెప్పేసరికిఅతడి గొంతు పట్టుకుపోయింది. ఈ ముఖ భంగిమ, ఆ అస్వాభావిక దృష్టి గదిలో ఉన్నవారినందర్నీ చకితుల్ని చేసింది. డాక్టరు ఆదరా బాదరా మళ్ళీ రోగి దగ్గరకి పరుగెత్తుకొచ్చాడు.

## 23

బాశులీ నివాసుల్ని చకితుల్ని చేస్తూ, కలెక్టర్, కమీషనర్ ప్రభృతులు. ఉషఃకాలానికే జమీందారుగారి భవనానికి చేరుకున్నారు. వారివెంట పోలీసు సూపరెండెంట్, కొందరు పోలీసు ఇన్స్పెక్టర్లూ, మరికొందరు కానిస్టేబిలూ ఉన్నారు.

దివాన్ రాధానాధబాపులీ ఎస్టేట్లోని ప్రముఖ ఉద్యోగులందరితో కలిసి ఈ దొరలకు స్వాగతం చెప్పటానికి సిద్ధంగానే ఉన్నారు. ఈ అభ్యాగతులను చక్కగా అలంకరించిన 'డ్రాయింగ్ రూం'లోకి సగౌరవంగా తీసుకెళ్ళాక, జమీందారు గారికి హఠాత్తుగా జబ్బుచేసిన సంగతి చెప్పి, దివాన్‌జీ ఇంకా ఇలా అన్నాడు. "నేను వారి ప్రతినిధిగా తమకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయటానికి నియుక్తుడనయినాను. వేట విషయములో తమ తమ అభిరుచులకు అను

గుణంగా ఏర్పాట్లూ అవీ చెయ్యటంలో ఏ మాత్రం అశ్రద్ధ జరగదు".

కలెక్టరు సందిగ్ధ హృదయంతో కమీషనర్ కేసి చూశాడు. ఒక్కక్షణం ఉభయులూ ఏవో గుసగుసలాడు కున్నారు. మరుక్షణంలో కలెక్టరు కుర్చీలోంచి లేచి, దివాన్‌ను రహస్యంగా పిలిచి, మెల్లిగా ఇతరుల కెవ్వరికీ విన్పించకుండా అసలు సంగతి బయటపెట్టాడు — తాము వేటకనే ఇక్కడికి వచ్చారుట, కాని నిజానికి తమ ఉద్దేశం అది కాదుట! జమీందారుగారి కోడలిమీద వచ్చిన ఫిర్యాదుల్ని— ఈ నెపంతో దర్యాప్తు చెయ్యటానికి వచ్చారుట. అయినా కమీషనర్ గారి ఉద్దేశం మాత్రం ఇంత పెద్ద జమీందారు కుటుంబ గౌరవాన్ని కాపాడేందుకుగాను ప్రాథమిక విచారణంతా రహస్యంగానే జరపాలనిట!

"తమరు తలవని తలంపుగా చెప్పిన ఈ విషయం మాకు ఆశ్చర్యాన్ని కల్గించింది. తమరు ఎవరి విషయమై దర్యాప్తు చెయ్యటానికి వచ్చారో, ఆమె చక్కని స్వభావాన్ని, నిర్దోషిత్వాన్ని తెలుసుకుని చివరకు పశ్చాత్తాప పడవలసి ఉంటుంది" అన్నాడు దివాన్.

ఈశ్వరానుగ్రహంవల్ల ఆమె నిరపరాధిని అని రుజువయితే మేమూ చాలా సంతోషిస్తాం. అయినా దర్యాప్తు మాత్రం జరపకుండా ఉండటానికి వీల్లేదు" అన్నాడు.

"అలాంటి అభిప్రాయం ఉన్నట్లయితే స్టేట్ రూంలోనే విచారణ కొనసాగించవచ్చు." అన్నాడు దివాన్.

"ఈశ్వరానుగ్రహంవల్ల ఆమె నిరపరాధిని అని రుజువయితే మేమూ చాలా సంతోషిస్తాం. అయినా దర్యాప్తు మాత్రం జరపకుండా ఉండటానికి వీల్లేదు" అన్నాడు.

"అలాంటి అభిప్రాయం ఉన్నట్లయితే స్టేట్ రూమ్ లోనే విచారణ కొనసాగించవచ్చు" అన్నాడు దివాన్.

మళ్ళీదొరలిద్దరూ ఏదో కాసేపు సంప్రదించుకున్నారు. "అలాగే. ఏర్పాటు బాగానే ఉంది. కాని ఆ గదికి చుట్టు ప్రక్కల ఎవరూ ఉండకూడదు. కమీషనర్, నేనూ, కమీషనర్ పర్సనెల్ అసిస్టెంటూ, ఇంకా కొద్దిమంది మాత్రమే ఉంటాం. దివాన్‌జీ, మరొక వకీలు ప్రతివాదికి సహాయంగా ఉండవచ్చు" అన్నాడు కలెక్టరు.

"వకీలు ఉండవలసిన అవసరం ఏమీ లేదు. తనమీద వచ్చిన ఫిర్యాదులన్నీ నిరాధారాలే అయితే ప్రతివాదిని వాటి నన్నిటిని స్వయంగానే ఖండించగలదు. ఒకవేళ యథార్థాలే అయినట్లయితే 'జాక్సన్' దొరవచ్చి నిలబడ్డా ఏం ఫర్వా లేదు" అన్నాడు దివాన్.

దివాన్ చెప్పిన దానికి కమీషనర్ తృప్తిపడి, "సరే, బాగుంది. ఆ ఏర్పాట్లన్నీ మీరే చెయ్యండి" అన్నాడు.

ఏర్పాట్లు చెయ్యడంలో విలంబనమేమీ జరగలేదు. జమీందారీ ఆఫీసులన్నీ చుట్టూ ఉండే మధ్యహాల్లో ఈ నలుగురు అధికారులూ సమావేశమయినారు. ఆ పెద్ద హాల్లో బ్రహ్మాండంగా చేసిన ఈ రాజకీయపు ఏర్పాటు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

"జమీందారుగారి కొడుకు లెక్కడున్నారు? ఇష్టమైతే వారుకూడా ఇక్కడికి రావొచ్చు" అన్నాడు కమీషనర్ ముందుగానే.

"చిన్న కొడుకు ఊళ్లో లేరు. నిన్నరాత్రే అతడికోసం కబురు వెళ్ళింది. పెద్దకొడుకు ఇంట్లోనే ఉన్నారు. అతడికీ ఒంట్లో కులాసాగా లేదు. అయినా ఈ విచారణకు రావటం అవసరమయితే వస్తాడు" అన్నాడు దివాన్.

పెద్దకొడుకు వంట్లో బాగాలేదన్న మాట కలెక్టరుకు కాస్త ధైర్యాన్ని చిక్కించింది. ఈలోపుగానే - ఈ ఫిర్యాదులన్నీ యెవరిమీద ఉన్నాయో, ఆమె రాకకోసం అధికారులు ఎదురు చూస్తున్నారన్న వార్త అంతఃపురంలోకి పంపబడింది.

కాని ఎక్కువసేపు వారు యెదురుచూడవలసిన పని లేకుండానే పోయింది. లోపలివైపుకి ఉన్న గుమ్మంలోనుంచి, పరదా తొలగించుకుని ఆమె వారి యెదుటికి వచ్చి నిలబడింది. అనవద్యమైన ఆమె ఆకృతిని, అనింద్య సుందరమైన ఆమె ముఖంలోని అపూర్వ తేజస్సును, సంకోచం అంటూ లేని ఆమె నిర్భయ వైఖరిని చూసి ఈ అధికారులు - తాము ఆమెమీద ఆరోపించబడిన ఫిర్యాదుల్ని విచారించటానికి వచ్చామన్న సంగతి మరిచిపోయారు. కమీషనర్‌ని చూడగానే అతడితోపాటు అందరూ లేచి నిలబడ్డారు. టోపీలు తీసి నత శిరస్కులు కూడా అయినారు.

ఎవరిమూలకంగా ఈ అధికారుల కిక్కడింత గౌరవ మర్యాదలు చూపబడుతున్నాయో, ఆమెకూడా ప్రత్యభి

వాదసూచకంగా కొంచెం శిరస్సువంచి, స్వచ్ఛమైన ఇంగ్లీషులో "ఒకసామాన్య స్త్రీని అరెస్టు చెయ్యటానికని వచ్చి మీరు చూపుతున్న గౌరవనీయమైన ప్రవర్తన మీ జాతి యొక్క సభ్యతకు నిదర్శనం. ఇందుకు నేనుకూడా సవినయంగా ధన్యవాదాలు తెలుపుతున్నాను" అన్నది.

అందరూ చకితులయినారు. కమీషనరుతోను, కలెక్టరుతోనూ స్వచ్ఛమైన ఇంగ్లీషులో మాట్లాడగలిగిన జమీందారులు కొద్దిమంది మాత్రమే ఉన్నట్లు వారికి తెలుసు. పల్లెటిదిక్కు వాడయిన ఈ జమీందారు ఏయే విషయాల్లో అజ్ఞానుడో అదీ తెలుసు వారికి. కాని ఆయన కోడలే ఇంత చక్కని ఇంగ్లీషు ఇంత స్వచ్ఛంగా మాట్లాడటం చూసి, వారు ఒక్క క్షణం స్తబ్ధు లయినారు.

చండి వారి స్తబ్ధతకు భంగం కలిగిస్తూ "మా దురదృష్టంకొద్దీ, మాననీయులైన మా మామగారు తమవంటి ఉన్నతాధికారులతో సంప్రదింపులు జరపటానికి అవకాశం లేకుండా అస్వస్థులయినారు. నేను వారి కోడల్ని అయినప్పటికీ మీతో సమాన ఫాయాగా సంప్రదింపులు జరిపే అధికారం లేదు నాకు. ఎంచేతంటే నామీదవచ్చిన ఫిర్యాదుల్ని గురించి దర్యాప్తు చెయ్యటానికే తమరు వచ్చారు కనుక... తమకు ఈ విచారణలో చేతనయినంతవరకు తోడ్పడటానికే వచ్చాను నేను.

తమరు దయఉంచి సావకాశంగా కూచోండి, మీరడిగే ప్రశ్నలన్నిటికీ జవాబులు చెపుతాను" అన్నది.

"ముందు మీరు మీ 'సీట్' లో కూర్చోండి. మా కర్తవ్యాన్ని కాదనలేక మేము ఈ అప్రీతికరమైన వ్యవహారంలో విచారణ జరపటానికి వచ్చినా, మీమీద ఉన్న ఆరోపణలన్నీ రుజువు కానంతవరకు మీ స్వాతంత్ర్యానికి, మీ మర్యాదకి భంగం రానీయము. దయఉంచి కూచోండి మీరు" అన్నాడు కమీషనరు.

తప్పనిసరియై దగ్గరలోనే ఉన్న ఒక సోఫాలో కూర్చున్నది చండి. ఆమె కూర్చున్నాక కమీషనరు, తదితర ఉద్యోగులూ తమతమ స్థానాల్లో కూర్చున్నారు.

తర్వాత విచారణ ప్రారంభమైంది. కమీషనరుగారి సెక్రటరీ ఆ ఫిర్యాదులకి సంబంధించిన 'ఫైల్స్' తీసి కమీషనరు ముందు పెట్టాడు.

ఆ కాగితాలన్నీ వరుసక్రమంలో ఫైల్ చెయ్యబడ్డాయి. మొదటి పేజీమీద చూపు పడగానే "తమ పేరు శ్రీమతి చండి దేవియా?" అని అడిగాడు కమీషనరు.

"ఆఁ." అన్నది వెంటనే చండి.

"మీ వివాహమై ఎన్నాళ్ళయింది?"

"ఇవాల్టికి సరీగ్గా ఆరు నెలల ఇరవై రోజులైంది."

"మీ పుట్టిల్లు శ్యామాపురమా? వివాహానికి ముందు అక్కడే ఉండేవారా మీరు?"

"ఆఁ."

"అక్కడ ఉండగా మీరు ఓ మిషన్ గరల్స్‌స్కూలు లేడీ టీచరు మిస్ క్రీస్తుకుమారిని కొట్టి అవమాన పరిచారుట కదూ?"

"కొట్టటం మాత్రం చెయ్యలేదు. కాని అవసరమయినంతవరకు అవమానించినమాట మాత్రం వాస్తవం."

"దాన్ని మీరు అపరాధంగా భావించటం లేదా ?"

"ఈ సంఘటన జరిగి చాలా కాలమయింది. ఇన్నాళ్లకిప్పుడు ఆ అప్రీతికరమైన సంఘటనను పురస్కరించుకొని నామీద ఫిర్యాదు చెయ్యబడిందా ?"

"ప్రత్యేకమైన ఫిర్యాదంటూ యేమీ రాలేదు. కాని అసలు ఫిర్యాదుకు ఇదొక నిదర్శనంగా మాత్రం ఉంది. మీరు సమాధానం చెప్పండి."

"నా సమాధానాన్ని మీరు యథార్థమైనదిగా విశ్వసిస్తారా ?"

"తప్పకుండా... మీలాంటి సుశిక్షితమైన యువతి అబద్ధమాడదని మా గట్టినమ్మకం."

"అయితే ఆ గాథను సంక్షేపంగా చెప్పాలి నేను."

"చెప్పండి."

"నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు - ఆ స్కూల్లో ఏదో ఉత్సవానికి ఊళ్లో ఇతర స్త్రీలతోపాటుగా నాకుకూడా ఆహ్వానవస్తే వెళ్లాను. కాని స్కూల్లో లేడీటీచర్ మమ్మల్ని నిష్కారణంగా అవమానించింది."

"ఏం చేసింది ?"

"ఆమె తన ఉపన్యాసంలో మా ధర్మాలమీద, మా సమాజం మీద, మా సంస్కారాల మీద విరుచుకుపడింది. అంతమందిలోనూ నే నొక్కదాన్నే ఆ ఉపన్యాసాన్ని ఖండించ వలసి వచ్చింది."

"అలాగా! ఊఁ. తర్వాత?"

"నేను ఖండించినదానికి ఆమె సహేతుకమైన సమాధానం యేమీ ఇవ్వకుండా, నన్ను తన యెదుటికి పిలిచి చెంపమీద కొట్టింది."

"అప్పుడు మీరేం చేశారు?"

"ఏసుక్రీస్తు ఆదేశానుసారం ఈ చెంపమీద కొడితే రెండో చెంప చూపలేదు. ఆమెని మర్యాదగా మందలించాలనే ఉద్దేశంతో చేత్తో ఆమె ముందు ఉన్న టేబిల్‌ను వెనక్కి ఎత్తేశాను. దాంతో ఆమె క్రింద పడింది. ఆ టేబిల్ మీది సిరాబుడ్డిలోని సిరా ఒలకటంవల్ల ఆమె నల్లని ముఖం మరింత నల్లబడిపోయింది."

అది విని కమీషనరు, అతడి సహచరులూ అతికష్టం మీద నవ్వు ఆపుకున్నారు. చండి సంకోచించకుండా మళ్ళీ "నే నలా చెయ్యటం అపరాధంగా కనుక మీరు భావిస్తే నేను తప్పక అపరాధినే" అన్నది.

ఈ ప్రసక్తిని ముగించి కమీషనరు మరొక ప్రశ్న వేశాడు. "ఈమాట నిజమేనా? మీరే పట్టుపట్టి బలవంతాన ఆ మిషన్ స్కూల్‌ను ఎత్తివేయించారుటగా!"

"ఒక్కనాటికి కాదు. అనుషంగికంగా నేనే కారణం కావచ్చు. కాని నేను మాత్రం వారి స్కూల్‌కు విరుద్ధంగా ఒక్కమాట కూడా అని యెరుగను."

"వివాహానికి ముందు ఈ ఉద్దేశంతోనేగా — ఆ స్కూల్ ఎత్తివేయించి మీ పేరుతో కొత్త స్కూల్‌ను స్థాపించమని మీ మామగారిని కోరింది?"

"నేను మామగారిని బాలికలకు ఒక ఉచిత విద్యాలయాన్ని స్థాపించమని కోరినమాట నిజమే; కాని యే స్కూలునూ ఎత్తివేయించమని వారిని కోరనూ లేదు. వారు ఎత్తివేయించనూ లేదు. కాని నే నిలా కోరినందువల్ల వారు స్కూలును స్థాపించిన కారణంగా - ఏ స్కూలు తలుపులైనా మూతబడితే అది వేరేసంగతి."

"కాని ఈ కోరిక సమర్థనీయమేనా ?"

"అయితే మీరేచెప్పండి. మా ధర్మానికి సంస్కారాలకి సంబంధించిన చక్కటి శిక్షణ యిచ్చే విద్యాలయం లేకపోయినచోట - అలాంటి విద్యాలయాన్ని స్థాపించమని నేను కోరితే అది నేరం అవుతుందా ?"

కమీషనరు స్తబ్ధులాగా కొంచెంసేపు కాగితాలకేసి అలాగే చూస్తూ ఊరుకున్నాడు.

"మీ కోరికలో ప్రచ్ఛన్నంగా ఎలాంటి విద్వేష భావమూ కనుక లేకపోతే మాత్రం అలా కోరటం నేరం కానేరదు సరికదా ప్రశంసించతగిన విషయం. కాని అసలు మీకు అలాంటి శిక్షణ - ప్రచారాలను గురించి విప్లవాత్మక మైన అభిప్రాయాలున్నట్లు మాకు చాలా దృష్టాంత పూర్వకంగా తెలిసింది" అన్నాడు.

చండి తన కంఠస్వరాన్ని కొంచెం తీక్ష్ణంగా మార్చి, "ఎలాంటి ప్రమాణాలమీద ఆధారపడి మీరు నన్ను గురించి ఇలా అభిప్రాయపడ్డారో తెలుసుకోవచ్చునా నేను ?" అని అడిగింది.

కమీషనరు చేతులో ఉన్న ఫైలును ఎత్తిపట్టుకుని "తప్పకుండా. ఈ ఫైల్ చూడండి మీరు. ఇందులో ఆ ఉత్తరాలూ ఆ సంతకాలూ అన్నీ ఉన్నాయి. అవన్నీ సరిగ్గా చదివి, తర్వాత వాటిమీద మీ సంజాయిషీ యివ్వండి" అన్నాడు.

ఆ ఫైల్లో కొన్ని ఉత్తరాలూ, కొన్ని అచ్చయిన నోటీసుల్లో ఆమె పేరూ ఉన్నాయి. చండి ఆ ఫైల్ చూసి, అక్కడక్కడ కొద్దికొద్దిగా చదివి, దాన్ని అక్కడే ఉన్న ఐవరీ టీపాయ్ మీద పెట్టి, "ఇందులో మీరు సంపాయించి పెట్టిన— అస్త్రాలమీదనే ఆధారపడి, నామీద యుద్ధానికి దిగినట్లయితే మీ శ్రమ అంతా వ్యర్థమే అనాలి" అన్నది.

ఆమె అంత పట్టుదలగా మాట్లాడే తీరుకి కమీషనరు రవంత స్తబ్ధుడై "ఎందుకని?" అని అడిగాడు.

"అవన్నీ చెల్లనివే" అన్నది చండి.

కమీషనరు ముఖంలో చిరాకు స్పష్టంగా వ్యక్తమవుతోంది. చండి తీక్ష్ణ దృష్టితో అదిగమనించి, "వీటి విషయంలో నా సంజాయిషీకూడా దయఉంచి వినండి" అన్నది.

అలా అంటూనే ఆమె ఫైల్‌లోనుంచి, తన పేరు అచ్చు అయిఉన్న ఒక కాగితం తీసి, "క్రింద నా పేరుతో ఈ ప్రకటన కాయితం వెలువడింది- 'శ్యామాపురంలోని మిషన్ స్కూల్ ఎత్తివేయించటం అనేది చాలా కష్టం. ఇలాంటి ప్రత్యేక సందర్భాలలో చివరి మార్గం అవలంబించాలి. ఒకటి రెండు మిషన్ స్కూళ్ళలో అలజడి పుట్టిస్తే, మిషనరీ టీచర్ల మీద దురాక్రమణచేస్తే, ఈ దేశంలో వారి స్కూళ్లు ఎన్ని

ఉన్నాయో అన్నీ మూయబడుతాయి.' ఈ కాయితంమీద నా పేరు మాత్రమే ఉండి, ప్రెస్ పేరు లేకపోవటం మీరు గమనించే ఉంటారు. నా కేమీ పేరు ప్రఖ్యాతులు లేవని, నేను అంతఃపురం విడిచి బయటికి రావటానికి వీల్లేనిదాన్నని మీరు అంగీకరించి తీరాలి. నా కిలాంటి ఉద్దేశమే ఉన్నట్లయితే, ఆ ఉద్దేశ్యసిద్ధికి ఈ కాయితం అచ్చు వేయటం దేనికి? మా మామగారి ప్రతాపంతో, పలుకుబడితో, వారి ఎస్టేట్‌లో ఉన్న స్కూళ్ళ నన్నిటినీ చట్టసమ్మతమైన పద్ధతులలోనే మూయించవచ్చు. ఈ శ్యామాపురం సంఘటనని ఇంకెక్కడా ఆధారంగా తీసుకోలేదుకదూ" అన్నది.

కమీషనరు ఆమె మాటలన్నీ శ్రద్ధగా విన్నాడు. "అయితే దీంతో మీకు సంబంధం ఉన్నట్లు ఒప్పుకోరా?" అని అడిగాడు.

"ఏమాత్రం ఒప్పుకోను" అన్నది చండి కఠినంగా.

"మరి ఈ ఉత్తరాలన్నిటిమాట? వాటితోనూ మీ కేమీ సంబంధం లేదంటారా?"

అవన్నీ చెల్లేవికావని మీకు ముందుగానే చెప్పాను సార్! ఉత్తరాలను పరీక్షగా చూస్తే - లోపల ఉన్న విషయమంతా ఒక స్త్రీ వ్రాసినట్లు, ఆమెకూడా ఏదో అంతంత మాత్రంగా చదువుకున్న స్త్రీయే నని మీకే తెలుస్తుంది. అందులో ప్రతి పంక్తిలోనూ తప్పులు కన్పిస్తూనే ఉంటాయి. పైన చిరునామా మాత్రం బాగా చదువుకున్న పురుషుడెవడో రాసి ఉంటాడు ఇంగ్లీషులో. నా ఇంగ్లీషు దస్తూరీ, బెంగాలీ దస్తూరీ కూడ మీకు వ్రాసి చూపిస్తాను. మీరు

పరీక్షించి చూడండి ముందు. తర్వాత దస్తూరీలను పోల్చటంలో నిపుణులైన వారిదగ్గరకు పరీక్షకు పంపి చూడండి. అప్పుడైనా తెలుసుకుంటారు నేను చెప్పింది అబద్ధం కాదని.''

దగ్గరలోనే టేబిలుమీద ఉన్న కాయితం కలం తీసుకుని, కొన్ని పంక్తులు బెంగాలీలోనూ, కొన్ని పంక్తులు ఇంగ్లీషులోనూ వ్రాసి, చండి ఆ కాగితాన్ని కమీషనరు టేబిలు మీద పెట్టింది.

వెంటనే ఆమె దస్తూరీతో ఉన్న ఉత్తరాల ఫైలును తీసుకొని కమీషనరు, అతడి అనుచరులు ఆ దస్తూరీల వ్యత్యాసాన్ని తెలుసుకునే ప్రయత్నంలో పడ్డారు.

పరీక్షించటం అయాక, కమీషనరు, తన అభిప్రాయాన్నేమీ వెలిబుచ్చకుండానే ''కాని ఉత్తరాలమీద ఈ ఊరి ముద్రే ఉన్నదన్న సంగతి మీరు గమనించారా?'' అని అడిగాడు.

''గమనించాను. ఆ కాగితాలు అచ్చువేయించిన సంగతి యదార్థమయినట్లు - ఆ ముద్రలూ యథార్థమే. కాని వ్రాసిన వ్యక్తి, వ్రాయబడిన వ్యక్తుల పేర్లు మాత్రమే అయథార్థం.''

''మీరు ఆత్మరక్షణకోసం ఇంకెవరిచేతనయినా ఉత్తరాలు రాయించిఉన్నా అందులో ఆశ్చర్యం యేమీలేదు.''

''దానివల్ల నాకేమిటి లాభం? ప్రజాందోళనల్లో పాల్గొనే సువిఖ్యాతలైన స్త్రీలలాగా నేనేం ప్రసిద్ధురాలిని కాదు. నా పేరును క్రింద వేయించుకోవటంవల్ల ప్రయోజనం ఏముంటుంది చెప్పండి. తాము స్వయంగా రాయ

టానికి ధైర్యం చెయ్యలేని వాళ్లు క్రింద సంతకం పెట్టారంటే- అది ఎంతవరకు నమ్మ తగింది?"

"అయితే ఈ ఫైల్సులోని కాగితాల విషయంలో మీరు కేవలం అజ్ఞులని, మీకు వాటితో యెలాంటి సంబంధమూ లేదని శపథంచేసి చెప్పగలరన్నమాట?"

"ఈ ఫైల్ చూడటానికి ముందే నేను చెప్పవలసిందేదో చెప్పాను. అయినా భగవత్సాక్షిగా ఈ మాటమాత్రం చెప్పగలను - ఇంతవరకు నే నెన్నడూ ఒక్క అబద్ధమయినా ఆడి యెరుగను. సత్యాన్ని దాచటం అనేది నాకు తెలియదు..."

"అయితే మీ శత్రుపక్షంలోనివా రెవరైనా, మీకు అనిష్టం కలిగించాలనే తలంపుతో మీ పేరుతోనే ఈ కాగితాలు సృష్టించి ఉంటారు - అన్న అనుమానం మీ కేమైనా ఉందా?"

"ఈ విషయంలో నా అనుమానంకన్న తమదర్యాప్తు ఎక్కువ బలమైంది కదూ? నేను ఒక్క సంగతేమయినా మిమ్మల్ని అడగవచ్చునా?"

"తప్పకుండా. మిమ్మల్ని మీరు సమర్థించుకునేందుకు ఏదయినా అడగవచ్చు."

"ఈ నోటీసుల్లో క్రింద నా పేరుమాత్రం అచ్చువేసి ఉంది. ఓ సమితిపేరుకాని, ఓ చిరునామాకాని ఏదీ లేదు. కవర్లలో మాత్రం 'సెక్రటరీ, మహిళాభ్యుదయసమితి, టాలీగంజ్, దక్షిణ కలకత్తా' అని మాత్రం రాసిఉంది. బహుశా మీరు ఆ విలాసంనుంచే ఈ అస్త్రాలన్నీ పోగుచేసి ఉంటారు.

కాని అక్కడ నిజంగా ఇలాంటి సమితి అంటూ ఏదయినా ఒకటి ఉందా? ఉంటే సెక్రటరీ ఎవరో పట్టుకోగలిగారా? ఆ సమితిలో సభ్యత్వం ఉన్నవారి నెవర్నయినా చూశారా? నా విషయంలో వారి అభిప్రాయాలు తెలుసుకున్నారా? వారు ఎరుగుదునని, నాతో వారికి పరిచయం ఉందని ఏమయినా చెప్పారా?''

ఈ ప్రశ్నలకు కమీషనరు కొంచెం విసుగుదలగా "మీ యీ ప్రశ్నలకు వేటికీ సమాధానం చెప్పజాలం. క్షమించాలి" అన్నాడు.

చండి తీక్ష్ణ దృష్టితో ఒకసారి కమీషనరు మొహం కేసి చూసి, మామూలు ధోరణిలోనే "ఇంకా మీరు నన్ను అడగదలచిన ప్రశ్న లేవయినా ఉన్నాయా? మీ అనుమానాలను నే నేమయినా తొలగించ గలిగానా?'' అని అడిగింది.

"మీరు తొందరపడకండి. మా దర్యాప్తు యింకా పూర్తికాలేదు. ఇంకా అడగవలసిన ప్రశ్నలున్నాయికొన్ని''
అన్నాడు కమీషనరు కొంచెం గట్టిగా.

చండి కొంచెం తలవంచుకుంది. కమీషనరు ఒక్క సారి చండి ముఖంకేసి వక్రదృష్టితో చూసి, వెంటనే "మీం భర్తపేరు గోవిందనారాయణా?'' అని ప్రశ్నించాడు.

"ఊఁ."

"ఆయన జన్మతః జడుడు, మూర్ఖుడు, ఉన్మాదుడట కదూ?''

"ఆ అభిప్రాయం చాలా మందికి ఉన్నమాటనిజమే.''

"ఆయన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?''

"ఈ ప్రశ్నకు నా నుంచి సమాధానం పొందటంవల్ల ప్రయోజన మేమైనా ఉన్నదా? ఏ ఉద్దేశ్యంతో మీ రిలా అడుగుతున్నారో - నేను అడుగవచ్చునా సార్?"

"ఉద్దేశ్యం ఇది — మీలాంటి చక్కని అభ్యుదయ భావాలు కలిగిన యువతి, అలాంటి జడుణ్ణి వివాహం చేసుకున్నదంటే వెనక ఏ పార్టీ ప్రోద్బలమో ఉండి ఉండాలి. అలాచేస్తే భవిష్యత్తులో ఈ ఎస్టేట్ ధనంతో ఆ పార్టీని ఎక్కువ స్తోమత కలదానినిగా చెయ్యవచ్చుననే అభిప్రాయం ఉండొచ్చు.'

"అందరూ అప్రయోజకు డని తేల్చిన ఆ వ్యక్తిలో నే నేదో ఒక ప్రత్యేక లక్షణ మున్నట్లు గ్రహించాను. నేను శాయశక్తులా ప్రయత్నించి వారిని ఆదర్శ పురుషునిగా చేయవచ్చుననే ఉద్దేశ్యంతో వివాహం చేసుకున్నాను. నా ప్రయత్నంకూడా సారకమయింది — అని నేననేట్లయితే మీ అనుమానం ఆధారం లేనిదని అంగీకరిస్తారా?"

చండి చెప్పిన ఈ సమాధానం ఒక్క కమీషనరునే కాదు, అతడితోపాటు ఉన్న అధికారులను కూడా చకితుల్ని చేసింది. ఈ ప్రసక్తి ఇంక ముగింపునకు వచ్చింది అనుకున్నది చండి. తనమాటలతో తనంతట తానే పట్టుపడిందీమె అని అధికారులనుకున్నారు. అలా అనుకోటానికి చాలా కారణాలున్నాయి. చండి యుక్తులతో మిగిలిన ఫిర్యాదు లన్నీ బలహీనమయినవని తేలిపోయినా, ఇది మాత్రం అలా తేలిపోయేది కాదని వారందరికీ మనస్సులో స్థిరమైన విశ్వాసం ఉంది. అసలు ఈ ఊళ్లో అడుగు పెట్టగానే జనసామాన్యం చెప్పు

కునే మాటల్ని బట్టి కూడా అతడు జడుడే నని తేలిపోయింది. అతడు జడుడు కాదని చండియే చెప్తోంది.

చండి ఉద్దేశాన్ని క్షుణ్ణంగా తెలుసుకోవాలనే భావం తో "మీరు చెప్పినదాన్ని ఉపసంహరించుకుంటారా ?" అని అడిగాడు.

"ఎందుకు ?" అని ప్రశ్నించింది చండి తలయెత్తి.

"మీ మాటల్ని బట్టి మీ భర్త మూర్ఖుడు, జడుడు, మతిలేనివాడు కాడని, మామూలు వ్యక్తేనని స్పష్టపడు తోంది".

"వారిని గురించి కనీసం నా అభిప్రాయం ఇదే."

"కాని అతడ్ని గురించి అందరి అభిప్రాయాలూ ఎలా ఉన్నాయో, అవి మీకు తెలియవా ?"

"నన్ను ఈ ప్రశ్న అడగటం వృథా... ఇతరుల అభి ప్రాయాలకి అనుగుణంగా ఆలోచించే స్వభావం కాదు నాది."

దొరగారి యెర్రటిముఖం ఒక్కక్షణం వివర్ణమయింది. మరుక్షణంలోనే అతడు నిగ్రహించుకుని, "అయితే మేము వృథాగా సందేహాల్లో పడిపోతున్నాము. తమ భర్తతో పరి చయం చేసుకునే అవకాశాన్ని ఇప్పుడింక వదలుకోము. వా రిక్కడికి రావాలని వాంఛిస్తున్నాం మేము" అన్నాడు.

చండి సాభిప్రాయంగా దివాన్ కేసి చూడగానే, అతడు లేచి లోపలి గుమ్మందాకా వెళ్లాడు. లోపల కొంతమంది

పరిచారికలు ఆజ్ఞకై ఎదురుచూస్తూ ఉన్నారు. అతడు వారి కేదో నిర్దేశించి వచ్చేశాడు.

కాసేపు అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. చటుక్కున కమీషనరు ఆ నిశ్శబ్దతకు భంగం కలిగిస్తూ "మీ భర్త యందు మీకు ఉన్న గొప్ప అభిప్రాయాన్ని బట్టి మేము ఆయన్ని సుశిక్షితుడని ఆశించవచ్చునా ?" అని అడిగాడు.

"ఇంగ్లీషు రావటమే ఒక 'స్టాండర్డు'గా భావించి మీరు వారిని పరీక్షించ తలచినట్లయితే మాత్రం మీరు కొంత నిరుత్సాహాన్ని పొందవలసి వస్తుంది. ఆ విషయంలో వారు సునిశితులు కావటాని కింకా కొంత వ్యవధి కావాలి. కొద్దిరోజులు పోయాక వారిలో ఆ లోపంకూడా ఉండదు. ఈ దేశంలో సుశిక్షితులైన ఇతర జమీందార్లతోపాటు - సమాన స్థాయిలో వారూ వ్యవహరించగలరనే విశ్వాసం మాత్రం నాకు ఉన్నది."

"మీ భర్తను గురించి మేము ఇతరుల ద్వారా విన్న దానికి అనుగుణంగా వారితో మేము మాట్లాడుతాం. వారు సహజమైన స్థితిలోనే ఉన్నట్లు మాకు కనుక తోచినట్లయితే మీరు చెప్పిన విషయాలన్నిటితో ఏకీభవించి, మా విచారణను ఇంతటితోనే ముగిస్తాం."

చండి ముఖంలో పరివర్తన యేమీ కన్పించలేదు. "నేను కొంచెంసేపు లోపలికి వెళ్ళవచ్చునా ?" అని అడిగింది.

చండి అలా అడగటంతోనే కమీషనరు కుర్చీలోంచి లేచి "తప్పకుండా. అవసరమయితే మళ్ళీ మేము మిమ్మల్ని ఆహ్వానిస్తాం" అన్నాడు.

చండి ఈ గదిలోకి వచ్చేప్పుడు ఏలాంటి మర్యాదను పొందిందో, మళ్ళీ ఇక్కడనుంచి వెళ్ళేటప్పుడూ అలాంటి మర్యాదనే పొందగలిగింది.

కాస్సేపట్లోనే లోపలినుంచి గోవింద నారాయణ్ పరదా తప్పించుకుని ప్రవేశించాడు. తెల్లటి దుస్తులతో, కఠోర నిగ్రహంతో-బ్రహ్మచర్య పరాయణుడైన ఆ వచ్చిన ఆజానుబాహు వయిన యువకుని కేసి అందరూ గ్రుడ్లప్పగించి చూశారు.

"వీరు మా జమీందారుగారి జ్యేష్ఠ పుత్రులు గోవింద నారాయణ గంగూలీ" అని దివాన్ అక్కడ ఉన్నవారికి పరిచయం చేశాడు.

గోవిందనారాయణ గంభీరంగా కొంచెం ముందుకు వచ్చి ఇంగ్లీషులో సుప్రభాతాన్ని తెలియజేశాడు దొరలకు.

వెంటనే కమీషనరు లేచి అతడితో కరచాలనం చేశాడు. మిగతా అధికారులంతా ఆయన పద్ధతినే అనుసరించారు.

ఈ లాంఛనాలన్నీ అయినాక అందరూ కూర్చున్నారు. కమీషనరు విశుద్ధమైన బాంగ్లాభాషలో - "ఈ యెస్టేట్‌లో ఏయే శాఖలతో సంబంధం ఉన్నదో తెలుసుకో వచ్చునా?" అని అడిగాడు.

"ఎలాంటి సంబంధాన్ని గురించి మీరు తెలుసుకోదలిచారు?" అని అడిగాడు గోవిందనారాయణ స్పష్టమైన ఉచ్చారణతో.

"ఈ ఎస్టేట్ పరిపాలనా విషయాల్లో మీరు మీ తండ్రిగారికి ఏ విధంగా సహాయపడుతున్నారో తెలుసుకోవాలనుకుంటున్నాం.

గోవింద నారాయణ చిరునవ్వుతో - నే నంటే మా నాన్నగారూ, మా ఎస్టేటూ అందరికీ వేసటే. అలాంటప్పుడు నేను వారికి సహాయపడటం అంటే ఎలా సంభవం?" అన్నాడు

"మీ రెందు కిలా అంటారు? మీరంటే వారందరికీ యెందుకంత వేసట?"

"దురదృష్టవశాత్తూ నే నన్ని విధాలా అయోగ్యుణ్ణి కావటమే కారణం"

"మీ రిప్పటికీ అదేభావంలో ఉన్నారా?"

"లేదు. శిక్షణలేక నేనూ ఇదివరలో అయోగ్యుణ్ణే అనుకుంటూ ఉండేవాణ్ణి కాని ఇప్పుడు రవంత శిక్షణ పొందటంతో - ప్రయత్నిస్తే యోగ్యుణ్ణి కావటం ఏమంత కష్టం కాదని తోస్తోంది. నాకూ తగిన శిక్షణ అనేది కనుక ఉంటే మా తండ్రిగారికి పరిపాలనా విషయాల్లో మున్ముందు సహాయపడగలననే ఆశ ఉన్నది."

"మీరు సభ్యతగలవారితో కలసి మెలసి ఉండరని, మీ కసలు వ్రాయటం చదవటం రానేరాదని మీ మనస్సు కూడా సహజస్థితిలో లేదని విన్నాం మేము. ఇదంతా నిజమే నంటారా?'

'సరియైన సమాచారమే విన్నారు. నా పూర్వజీవితం నా కిప్పు డేదో కలగాతోస్తూ ఉంటుంది. అందరూ నన్ను

'మాడ్' అని 'ఇడియట్' అని 'ఫూల్' అని అంటూ ఉం టారు."

"మీ రేమనుకుంటారు?"

"నేనూ ఇదివరదాకా అలాగే అనుకున్నాను. కాని ఈ ఇంగ్లీషు మాటలకు అప్పుడసలు అర్థం తెలియదు నాకు."

"అంటే ఇప్పుడు ఇంగ్లీషు బాగా అర్థం చేసుకోగల రన్న మాట!"

"అంటే అన్ని మాటలూ అర్థం చేసుకోగలనని కాదు. కొన్నికొన్ని చేసుకోగలను. నా చదువు ఇంకా పూర్తి కాలేదు."

"ప్రారంభించి ఎన్నాళ్ళయింది?"

"వివాహం అయినాక. ఇంకా పూర్తిగా ఏడు నెలలు కాలేదు"

"అంతకు ముందు ఏంచేసేవారు?"

"ఏమీలేదు. మనిషీ పశువూ కాని, స్థితిలో పడిఉండే వాణ్ణి ఒకమూల. నాకు చదువుచెపుదామని వచ్చినవాళ్ళంతా ఒకటి రెండురోజు లేదో చెప్పి, నేనొట్టి మొద్దునని, జడుణ్ణని 'ఇడియట్' నని అనేసి వెళ్ళిపోయేవాళ్ళు"

"ఇంతకీ వివాహమయిన ఈ కొద్దివ్యవధిలోనే మీరింత స్థితికి రాగలిగామని చెప్పటమేనా మీ ఉద్దేశ్యం?"

"ఆc."

"ఇది ఎలా సాధ్యమయిందో చెప్పగలరా?"

"నా భార్య కృషివల్ల. నేను అయోమయ స్థితిలో ఉండటం చూసి, నాకు శిక్షణ నిచ్చే భారం నా భార్యే వహించింది."

"అయితే ఆమె శిక్షణవల్లే మీలో యింత మార్పు వచ్చిందని ఒప్పుకుంటున్నారన్న మాట!"

"ఓ! కచ్చితంగా. నేనీ విషయాన్ని సగర్వంగా అంగీకరిస్తాను."

"సరే, మిమ్మల్ని మరొక విషయం అడుగుతాను. మీ చదువు విషయంలో మీభార్య మీకు యెలా సహాయ పడుతున్నదో – అలాగే ఆమె ఇతర వ్యవహారాల్లో మీరు కూడా అలాగే సహాయ పడుతున్నారా?"

"ఆమెకి వేరే మరొకపని అనేదే లేదసలు – నాకు శిక్షణ ఇవ్వటం తప్ప. ఈ కృషికై ఆమె సర్వస్వాన్నీ ధార పోస్తోంది!"

కమీషనరు ఈసారి సంతోషంతో గోవింద నారాయణుని కరచాలనంచేసి, "మీతో మాట్లాడటంవల్ల నేను చాలా సంప్రీతుణ్ణయినాను. ధన్యవాదాలు బాబూ!" అన్నాడు.

సరీగ్గా అదే సమయంలో నివారణు డక్కడికి వచ్చాడు. అతడి వెంట డాక్టర్ విశ్వమిత్ర ముజుందార్ కూడా ఉన్నాడు. వారిద్దరి ముఖాలూ వెలవెలబోయాయి అప్పుడు.

"వీరే మా జమీందారుగారి కనిష్టపుత్రులు నివారణ గంగూలీ" అన్నాడు దివాన్.

"హలో! మీరు 'ఇడియట్' అని 'మాడ్' అని చెప్పిన మీ అన్నగారు గోవింద్ అంటే వీరేనా?" అని ప్రశ్నించాడు కలెక్టరు.

నివారణుడి మైకం కొంత వదిలింది కాని, మాట ఇంకా స్పష్టంగా రావటంలా. తొట్రుపడుతున్న కంఠంతో "యస్. రాత్రింబగళ్లు అనేవి ఎంత సహజ సత్యాలో వీడు ఇడియట్ - ఫూల్ - మాడ్ అనేది కూడా అంత నగ్న సత్యం -" అన్నాడు. కమీషనరు హేళనగా - "But now we see the tables have been turned!" అన్నాడు.

కమీషనరు హేళనతోపాటు కలెక్టరు కొంచెం రోషంగా- "Now, save your situation Nivarana Babu!" అన్నాడు.

డాక్టర్ విశ్వామిత్ర ఇంతలో తనను సమర్థించుకునేందుకు - కమీషనర్‌ను పొగిడే సూత్రాలను కొన్నిటిని మెల్లిగా నివారణుడికి ఉపదేశించాడు.

అతడు చెప్పినట్లు నివారణుడు కమీషనరు దగ్గిరగా వెళ్ళబోయాడు. కాని దురదృష్టవశాత్తూ తూలిపడిపోయాడు. దాంతోపాటు అతడికి ఉన్న త్రాగుడు అనే దురభ్యాసం, ఆ మైకంలో ప్రేలే ప్రేలాపనకూడా అధికారులకు బాగా అవగత మయిపోయింది.

పరిచారకు లింతలో వచ్చి చినబాబుగారిని పట్టుకున్నారు.

కమీషనరు అతణ్ణి అలాగే అవతలగదిలోకి తీసుకెళ్ళమని ఆదేశించాడు. తర్వాత దివానుకేసి తిరిగి నెమ్మదిగా

"ఇప్పుడు మీ జమీందారుగారికి మాదొక మనవి. కొద్ది నిమిషాలు వారితో మాట్లాడటానికి మాకు అనుమతి ఇప్పించాలి" అన్నాడు.

కమీషనరు కోరికను దివాన్ అంతఃపురంలో నున్న జమీందారుగారికి వెంటనే తెలియచేశాడు.

## 24

అంధరాజైన ధృతరాష్ట్రుడు కురుక్షేత్రయుద్ధవార్తలు తెలుసుకోటానికి ఎంత ఆదుర్దాతో ఎదురుచూశాడో, మంచ మెక్కిన హరినారాయణబాబు కూడా అంత ఆదుర్దాతోనూ కచేరీవార్తలు ఎప్పటికప్పుడు తెలుసుకోసాగాడు. ఆ వస్తున్న వార్తలు క్రమక్రమంగా అతడి రోగమలిన ముఖంలో ఆనందాన్ని రేకెత్తించసాగాయి.

సంప్రదాయసిద్ధమైన కచేరీ దుస్తులు ధరించటానికి బదులు - గోవిందుడు చక్కటి సిల్కుదుస్తులు వేసుకుని ఉండటం చూసి, హరినారాయణబాబు ఆశ్చర్యపోయాడు. విస్మయవిముగ్ధుడైన తండ్రి పాదధూళిని స్వీకరించటంతో పాటు అతడి ఆశీర్వాదాన్నికూడా పొంది, గోవిందుడు ఉత్సాహంతో కమీషనర్ సందర్శనానికి వెళ్లాడు. మళ్ళీ వచ్చినప్పుడు అతడి ముఖం ప్రఫుల్లంగా ఉంది. అతడి కమీషనర్ కూడా ఉన్నాడు.

"నాన్నగారూ! దొరగారు వచ్చారు. మన ప్రాంతానికి కమీషనర్ వీరే" అని గోవిందుడే ముందు చెప్పాడు తండ్రితో.

చండి లోపలికి రాగానే చీరె మార్చుకుని మామగారి తలంపిదిక్కున వచ్చికూర్చుంది. దొరను చూడగానే అవ గుంఠనాన్ని సవరించుకుని లేచి నుంచుంది.

యజమాని హరినారాయణబాబు ఉజ్జ్వల దృష్టితో దొర ముఖంకేసి చూశాడు. అతడు చూడగానే కమీషనర్ భారతీయ సంప్రదాయానుగుణ్యంగా చేతులు జోడించి నమస్కారం గంగూలీబాబూ! మీరిలా అస్వస్థులుగా ఉన్నారని తెలిసికూడా కర్తవ్యాన్ని త్రోసిపుచ్చుకోలేక కొద్దినిమిషాలు మీకు శ్రమ కలిగించటానికి వచ్చాను. మీ కోడలి మీద వచ్చిన ఫిర్యాదుల్ని గురించి దర్యాప్తు చేయటానికే మే మిక్కడికి వచ్చామని మీకు తెలిసే ఉంటుంది. మీ కోడలు తన అసాధారణమైన శిక్షణతోనూ, సత్య నిష్ఠతోనూ, మనో దార్ఢ్యంతోనూ వచ్చిన ఫిర్యాదుల నన్నిటినీ ఖండించగలిగిందని మీకు సంతోషపూర్వకంగా తెలియ చేస్తున్నాను. నేను మనస్ఫూర్తిగా ఆమెకి ధన్యవాదాలర్పిస్తున్నాను. ఇలాంటి అప్రీతికరమైన వ్యవహారంలో అలాంటి సుశిక్షితమైన యువతికి కొంచెం కష్టం కలిగించవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను'' అన్నాడు.

జమీందారు కూడా ప్రయాసపడి చేతులెత్తి "ధన్యవాదాలు మహాశయా! మీ సౌజన్యానికి ముగ్ధుడనైనాను. అదలా ఉండగా దేశీయభాషలో మీరింత స్వచ్ఛంగా మాట్లాడటం నాకు చాలా ఆనందంగా ఉంది, ఆశ్చర్యంగానూ ఉంది'' అన్నాడు.

కమిూషనర్ నవ్వుతూ "మిూరిందులో ఆశ్చర్యపోవా ల్సిందేమిూలేదు బాబూ! నేను జస్టిస్ 'ఉడ్రఫ్' స్టూడెంట్‌ని. నేను నా మాతృభాషతో పాటు సంస్కృతం–బెంగాలీ చిన్న ప్పుడే నేర్చుకున్నాను" అన్నాడు.

కమిూషనర్‌ని కూర్చోమని అభ్యర్థించారు; కాని అతడు కూర్చోలేదు. అక్కడున్న వారందరికీ ధన్యవాదాలు తెలిపి, అవగుంఠనవతియైన చండికి సగౌరవంగా నమస్క రించి, కమిూషనర్ సెలవు తీసుకుని నిష్క్రమించాడు.

హరినారాయణబాబు కోడలి శిరస్సుమిూద హస్తాన్ని ప్రసారించి, "అన్నివిషయాల్లోనూ నువ్వే జయించావు తల్లీ! నువ్వు నిజంగా స్వయంసిద్ధవి కనుకనే ఇప్పుడిలా కాపాడగలి గావు. మూగవాడికి సరస్వతీ ప్రసన్నం చేయించావ్. పాషా ణానికి చైతన్యాన్ని తీసుకొచ్చి, నువ్వు బాశులీ పరువు ప్రతి ష్టలు నిలబెట్టావు తల్లీ!" అన్నాడు.

చండి ఈ ప్రశంసా వాక్యాలకి ఉబ్బితబ్బిబ్బుకాకుండా భక్త్యావేశంతో వినమ్రంగా ఇలా అన్నది–"అంతా దైవేచ్ఛ మామగారూ! ఇందులో నా నేర్పరితనం ఏమిూలేదు - తమకు తెలియని దేముంది?

"మూకం కరోతి వాచాలం। పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపా తమహం వందే। పరమానంద మాధవమ్..."

సమాప్తం